నటసామ్రాట్టు ఉజ్వలభావ ప్రదర్శనంతో జీవంపోసిన
శిల్పి సామ్రాట్టు ప్రేమగాథ!

విక్రమ్ ప్రొడక్షన్స్

విక్రమ్ ప్రొడక్షన్స్

# అమరశిల్పి జక్కన్న

పూర్తి ఈస్ట్‌మన్ కలర్ చిత్రం.




నిర్మాత-దర్శకుడు:
B.S.రంగా

నవయుగ

RF RAGHURAM FILMS (P) LTD

రఘురామ్ ఫిలిమ్స్

# కలవారి కోడలు

నిర్మాత * దర్శకుడు కె. హేమాంబరధర రావు

ఆంధ్రప్రదేశ్-వాణీ రిలీజ్ మైసూరు-సూర్యా ఫిలిం ఎక్స్చేంజ్ బెంగుళూరు





Vijaya Publicities

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 3—4—'64
క్రోధినామ సం॥ అధిక చైత్ర బహుళ షష్ఠి
సంపుటము : 56 సంచిక : 31

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## చందా వివరాలు

| | |
|---|---|
| విడిప్రతి | 30 న॥ పై. |
| సంవత్సర చందా | 15.60 |
| 6 మాసాల చందా | 7.80 |

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1



"ఎందుకైనా మంచిదని ఒక సీసాడు విషం నావదనే వుంచుకొంటున్నాను ... ఆహారసమస్య నాచేయిదాటిపోతుందని!"

## మనలో మాట

ఎలాగైతేనేం ఈ సంచికలో మూడు కథలను వెయ్యగలిగాము.

ఎండాకాలం వచ్చిందంటే ఆవకాయ కాలం వచ్చినట్లు కదా! ఈ వారం వనితాలోకంలో శ్రీమతి హేమలతా కైలాసం గారు వ్రాసిన 'ఆవకాయలలోని రకాలు' వ్యాసం ఒకటి వేశాము. అందులో కొన్ని కొత్తరకాల 'ఆవకాయ'లు కూడా వున్నట్లు అనిపించింది.

* *

ఆంధ్రసచిత్రవారపత్రిక వనితాలోకం శీర్షికలో వంటలు; కుట్లు; మాత్రమేగాక తరచుగా "స్త్రీల ప్రతిపత్తి సమస్యలమీద" స్త్రీలు వ్రాసిన వ్యాసాలను వేస్తూనేవున్నాము. లోగడ "రాజకీయాలలో స్త్రీల పాత్ర" అనే వ్యాసరచన పోటీ కూడా జరిపివున్న సంగతి పాఠకులకు జ్ఞాపకమున్నదనుకుంటున్నాము.

యీ శీర్షిక ద్వారా సాధ్యమైనంత త్వరలో కొన్ని ప్రత్యేకమైన - స్త్రీల దృక్పథం నుంచి స్త్రీలకని స్త్రీలే వ్రాసిన నిర్మాణాత్మక - వ్యాసాలను అందించాలని ప్రయత్నాలు చేస్తున్నాము.

* * *

ఈ సంచిక తయారవుతూవుండగా, అమెరికా ప్రభుత్వం ఆహ్వానంపై అమెరికా పర్యటనకై బయలుదేరి వెళ్లిన శ్రీ అక్కినేని నాగేశ్వరరావుకి పలుచోట్ల జరిగిన సన్మానాలకు చెందిన వార్తలు మా కార్యాలయం చేరాయి. ఈ విశేషాలను సాధ్యమైనన్నింటిని ఈ సంచికలో 15వ పేజీ నుంచి ప్రారంభించి పొందుపరచడం జరిగింది. ఈవారం రాజధాని కబుర్లలో కూడా ఇవే విశేషాలు వుండడంలో ఆశ్చర్యమేమీ లేదనుకుంటున్నాము. తెలుగు చలనచిత్ర ప్రతినిధిగా సుహృద్భావయాత్రకై వెళ్లిన శ్రీ నాగేశ్వరరావుకి ఈ సందర్భంలో మా శుభాకాంక్షలు!

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: "మురళీకృష్ణ" లో జమున.

# లోహియా వర్గం వింత వైఖరి:

# దురాక్రమణకు పాకిస్తాన్ సన్నాహాలు!

అధికార పక్షంలో కాస్త కాస్తగ పక్షపాత లక్షణాలు పెరిగిపోతున్నట్లున్నాయి. వీటిని వినియోగించుకొనేందుకు, కమ్యూనిస్టులు, "లోహియా మార్కు" సోషలిస్టులు ప్రయత్నాల మీద ప్రయత్నాలు చేస్తున్నారు. ధరలు "పెరుగుతున్నాయో, పెరుగుతున్నాయో" అంటూ డాంగే శుష్క వినాదాలు చేస్తున్నాడు—ఆ విషయం ఎవరికీ తెలియనట్లు! పైగా, ధరల పెరుగుదలను అణచివేసేందుకు, బ్యాంకులను, నూనె కంపెనీలను, విదేశీ వర్తకాన్ని జాతీయం చెయ్యాలని డాంగే ఒక ఉద్యమాన్ని ప్రారంభించారు. డాక్టర్ లోహియాజీ కూడా అంతే .... ధరలు తగ్గాలంటూ ఆయన పార్లమెంటు భవనం ముందు ప్రదర్శనలు చేశారు. కేవలం ఇంతటితో సరిపోలేదు ..., లోహియా వర్గీయులకు ఏదో ఒక నెపంతో అల్లర్లు, ఆగడాలు చేయటం అలవాటయిపోయింది. తాను ఏర్పాటు చేస్తున్న ప్రదర్శనలో ప్రసంగించేందుకు, పార్లమెంటునే వాయిదా వేయాలనే లోహియా కోరారు! అది కుదరదని స్పీకర్ నిర్మొహమాటంగా చెప్పేసరికి నలుగురు సభ్యులున్న యీ వర్గం సభనుంచి "వాకౌట్" చేసి వెళ్ళింది.

ఎలాగూ, ఆ ప్రదర్శనలన్నీనిరర్థకమని తేలిపోయింది. ఇక ఏం తోచలేదు కాబోలు, నాయకులంతా, లార్డ్ ఇర్విన్ విగ్రహం మీదకు ఎక్కటానికి, గందరగోళం చేయటానికి, విచ్చేసలు తెప్పించుకొన్నారు.

"లోహియా మార్కు అధికారం" అమలులోకి వస్తే పరిస్థితులు ఎంత హాస్యాస్పదంగా ఉంటాయో చెప్పటానికి, వేరే నిదర్శనం ఎందుకు? ..... వీళ్ళ మనసులు, మమతలు, తత్వాలు ఎంత చిన్నవో తెలియచెప్పే ఉదంతం ఒకటి పోయిన సోమవారం నాడు లోక్‌సభలో జరిగింది.



మార్మొగోవా హార్బరులోనికి భారత నౌకాదళానికి చెందిన ఐ. ఎన్. ఎస్. గోమంత నౌక ఆగమనంతో "గోవా" నౌకాస్థావరం ఏర్పాటు జరిగినది. దీనికి మార్చి 7—న నౌకాదళాధిపతి వైస్—అడ్మిరల్ బి. ఎస్. సోమన్ ప్రారంభోత్సవం చేశారు.

# న్యూఢిల్లీ లేఖ

ప్రధాని శ్రీ నెహ్రూ అనారోగ్యం నుంచి కొద్ది కొద్దిగా కోలుకొంటూ, తమ కార్యక్రమాన్ని నిర్వహించుకొంటూ పోతున్నారు. పోయిన సోమవారంనాడు ఆయన లోక్‌సభ సమావేశానికి హాజరయ్యారు. ప్రశ్నోత్తరాల సమయంలో శ్రీ నెహ్రూ ముందుకు వచ్చారు. ఆయన ఇంకా బలహీనంగా వుండటంవల్ల, బిగ్గరగా మాట్లాడ లేకపోతున్నారు. కనీసం, కనీసపు అభిమానమూ, ఆదరణ అయినా లేకుండా లోహియావర్గపు సభ్యులొకరు లేచి, ప్రధానిమీద ఎంతో అసభ్యకరమైన ప్రసంగం చేశారు. అది విని, సభంతా నివ్వెర పోయింది.

పాశ్చాత్య, ప్రాచ్య సంస్కృతి, సంస్కారాల వైవిధ్యంమీద చర్చలు జరుగుతున్న యీ రోజుల్లో ...... సంస్కారాన్నిబట్టి విలువలు గట్టబడుతున్న ఈ యుగంలో ...... లోహియా వర్గానికి కేపాటి స్థానం ఉన్నది ? సంస్కారం, సభ్యత, గౌరవం.... ఇలాంటిమాటలు లేవి వారి నిఘంటువుల్లో వెతికినా కనుపించవ్ !

లార్డ్ ఇర్విన్ విగ్రహం కథకు వద్దాం ..... ఆ విగ్రహాన్ని నామరూపాలు లేకుండా చేశారు ఇదంతా కావాలని చేసిన అల్లరి. పెద్ద పన్నాగమే ఇది. విదేశీయుల విగ్రహాలను ఇదేవిధంగా నామరూపాలు లేకుండా చేస్తామని లోహియా ప్రకటించారు ..... అదేదో ఘనకార్య మైనట్టు.

ఇది చాలా చిన్న విషయం. ఏమాత్రం బుర్ర ఉపయోగించినా చాలు. ఈ విగ్రహాలన్నీ బ్రిటిష్ వారి ఆస్తులు కావు. అవి భారతదేశపు ఆస్తి పాస్తులే. అందువల్ల వీటి విదేశాస్తులని కాబట్టి, నాశనం చేస్తామనుకున్న లోహియా వర్గపు వాదనలో అర్థమే లేదు. అదే లెక్కన, తాజమహల్, కుతుబ్‌మీనార్‌లను కూడా నాశనం చేస్తారా ?

ఆంగ్ల దినపత్రిక "హిందూస్తాన్ టైమ్స్" యీ విషయమై ఒక కార్టూన్‌ను ప్రకటించింది. లోహియా "సుత్తి" తీసికొని విగ్రహంమీద కొడుతుండగా, ఆయన అనుయాయులొకరు ఇలా అంటారు: "డాక్టర్, ఇంకా కొట్టండి. వాడు తిరిగి కొట్టలేడులే." ఇదీ లోహియా ప్రతాపం.

ప్రభుత్వం ఎంత బుజ్జగిస్తున్నా, మరోవైపు కమ్యూనిస్టులు కూడా దండెత్తుతున్నారు. వీళ్లకు ఒక్క అధిక ధరల వివాదమే 'చేయూత' గా దొరికింది. బ్యాంకులు, నూనె కంపెనీలు, విదేశీ వర్తకం మొదలైన అంశాల జాతీయాకరణకు, అధిక ధరలకు ఏదో సంబంధం, కల్పన చేసూ్త ఉపన్యాసాలను ప్రారంభించారు. గుల్జారీలాల్ నందా గారి "క్రమశిక్షణా నియమావళి" రంగంలోకే రావటంలేదు. ఈ కమ్యూనిస్టులకు, టి. టి. కృష్ణమాచారికి అసలు పడటంలేదు. దీనికి తోడు కొందరు కాంగ్రెసువాదులు కూడా కమ్యూనిస్టులతో చేతులు కలుపుతున్నారు. ఏమైనా ఆ యింటి మీద కాకి ఈ ఇంటిమీద వాలదు. రాజ్యసభలో ఆ వర్గం టి. టి. కె. తో సంఘర్షణకు తలపడింది. అందువల్ల, పార్లమెంటు సమావేశాల్లో, ఇలాంటి సంఘర్షణల చాలా సాధారణ మయ్యాయి. "లోహియా మార్క్సు సోషలిజం" అంటే 'వాకౌట్' అని మారుపేరు. వీళ్లంతా బాధ్యతలను విస్మరించి, ఎందు కిలా విర్రవీగుతారో బోధ పడటంలేదు!

* * *

ఇండియాలోవున్న అంతః కలహాలను పాకిస్తాన్, చైనాలు బాగా వినియోగించుకొంటున్నాయి. అయినా, ఎంత తెలివితక్కువ వాడయితే మాత్రం ఇలాంటి అవకాశాలు జారవిడుచుకొంటాడా!

ఈనాడు కాంగ్రెసులో వెర్రితలలు వేస్తున్న రాజకీయాలు పాకిస్తాన్‌కు గాని, చైనాకు గాని తెలియవని మనం అనుకొంటే .... అది కేవలం మన భ్రమ, భ్రాంతి మాత్రమే అవుతాయి. ఇండియా సైనికంగా దృఢతరంగా లేదన్న భావంతోనే, చైనా రెండేళ్లనాడు మనమీద దండయాత్రకు వచ్చింది. నిజం కూడా అంతే ! చైనా దురాక్రమణ ద్వారా, ఇండియా సైనిక బలహీనత రట్టయిపోయింది.

ఇండియామీద రెండు వేపుల నుంచి దాడిచేయాలని పాకిస్తాన్ సంకల్పించినట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది. అది మొదలయిందనే చెప్పాలి.

రెండవది తూర్పు సరిహద్దులలో. తూర్పు పాకిస్తాన్‌లో ఉన్న హైందవులను, క్రైస్తవులను తరిమివేయాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి. పైగా, అక్కడి నుంచి కనీసం రెండు లక్షల మంది మహమ్మదీయులను అస్సాంలో దింపాలని పాకిస్తాన్ ఆరాటం .... ఇంత కపటపు నాటకం ఆడుతూ కూడా, పాకిస్తాన్ ఇండియాలోని మరి కొంత భూభాగాన్ని కోరుతూ, మొసలికన్నీరు కారుస్తున్నది.

ఇండియా "మెత్త మెత్తగా" ఉండటానికి రెండు కారణాలున్నాయి. మొదటిది కాశ్మీరు, రెండవది సెక్యులరిజం. కాశ్మీరులో వుండే మహమ్మదీయుల పట్ల ఇండియా స్నేహవైఖరిని వ్యక్తపరచటంలో కూడా అర్థం లేకపోయింది. అస్సాంలోని పాకిస్తానీలను పారదోలాలని ఇండియా ఒక నిశ్చయానికి వస్తే .... ఆ రోజుననే, కాశ్మీరులోని మహమ్మదీయుల ద్వారా పాకిస్తాన్ కక్ష సాధించకుండా వూరుకోగలదా ?.... ఇండియా అమలు జరుపుతున్న 'సెక్యులరిజం' విధానంవల్లనే ప్రభుత్వం ధైర్యంగా ఏ అడుగూ ముందుకు వేయలేక పోతున్నది.

కారణాలు, అకారణాలు ఇలా చెప్పుకపోతుంటే అంతే ఉండదు. కాని, ప్రస్తుత సమస్య అది కాదు. దీనిని ఎలా పరిష్కారం చెయ్యాలా, అన్నదే నేటి సమస్య.

ముందు, కాంగ్రెసులో ఐక్యత ఏర్పడటమే అందుకు మార్గం. కేంద్రమంత్రివర్గంలో కూడా యీ ఐక్యత అవసరమని అనిపిస్తుంది. కాంగ్రెసులో. ఇద్దరు కలిస్తేనే చాలు...ఒక ముఠా తయారవుతున్నది. పైగా, ఏ ఇద్దరు నాయకులకూ పడదు.

గుల్జారీలాల్ నందా ఆమధ్య శ్రీ లాల్‌బహాదూర్ శాస్త్రికి ఒక లేఖ వ్రాశారు. దాన్ని అనంతరం ప్రచురించటం కూడా జరిగింది. వాళ్లిద్దరిమధ్య ఎలాంటి చీలికలు ఉన్నాయో ఆ లేఖలోని అంశాలే స్పష్టం చేస్తాయి.

విషాదమంతా ఇంతటితో అంతం కాదు. ఇండియా రాజకీయాల్లోని ఈ దుర్భర పరిస్థితులు పాకిస్థాన్‌కు తెలియటం మరీ విషాదం. ఇండియాలో కొందరు మంత్రులు ఒక వర్గంగా తయారయి, తమ పలుకుబడిని ఎలా పెంచుకొంటున్నారో కూడా పాకిస్తాన్‌కు తెలుసు.

నిజాయితీకి కాంగ్రెసులో స్థానం వున్నదా? ఒక్క విషయం అడుగుతాను. కాంగ్రెసువాదులు, ముఖ్యంగా కేంద్రమంత్రులు ఎంతమంది గాంధీజీ సిద్ధాంతాలకు కట్టుబడివున్నారు?

ఇంతవరకు, శ్రీ మొరార్జీదేశాయ్, జగ్జీవన్‌రాం, పాటిల్, ఫరవాలేదనిపించుకున్నారు. అధికారదాహంతో, పదవుల కోసం వారు ప్రాకులాడక పోవటమే అందుకు కారణం కావచ్చు.

శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రిగారు కూడా ప్రశంసనీయులే. ప్రధాని ఆజ్ఞలకు కట్టుబడి ఏవిధంగా అయితే పదవీ త్యాగం చేసి వెళ్లారో, అదేవిధంగా తిరిగి పదవిలో చేరారు. మంత్రివర్గంలో నాలుగో స్థానం ఇచ్చినపుడు కూడా ఆయన ప్రతిఘటించనే లేదు. ప్రధాని తరువాత అంతటివాడే అయినా, మంత్రివర్గంలో పెద్ద హోదా కోసం ప్రాకులాడలేదు. పార్లమెంటరీ కాంగ్రెసు పక్షం వెనుక ముఠాతత్వాలు ఉన్నాయని తెలిసి కూడా, శ్రీ శాస్త్రి ఆ ముఠా రాజకీయాలలో జోక్యం కల్పించుకోలేదు. పైగా శ్రీ నందా తన్ను కోరినట్లయితే, ఎన్నో సమస్యల పరిష్కారానికి తోడునీడగా నిలిచేవాడు .... కాని, అలా జరుగలేదు.

లాల్‌బహదూర్ శాస్త్రి యొక్క ప్రతిభా విశేషాలు ప్రధానికి తెలుసు. ఆయన వేసే ప్రతి అడుగులోను, ఆయన పలికే ప్రతి మాటలోను శ్రీ నెహ్రూకు విశ్వాసం ఉన్నది. శ్రీకృష్ణ. ★

**రాజధాని కబుర్లు:**

# హైదరాబాదులో సినిమావారికి సన్మానాలు: 'నా అభిమాన నటుడు' సావిత్రి!

ఈ వారం ఎక్కడ చూసినా కథానాయకుని కథనాలే! సాంఘిక చిత్రాల ద్వారా, ఆంధ్ర ప్రజకు అతి సన్నిహితుడైన అక్కినేని నాగేశ్వర రావుగారు, ఆంధ్రుల అభిమాన నటునిగా ప్రసిద్ధి కెక్కటంలో అబ్బురమేమీ లేదు. అందులోనూ ఆయనగారు అమెరికా ప్రభుత్వ ఆహ్వానంపై విదేశ పర్యటన సాగించబోతున్న సమయంలో వీడ్కోలు యివ్వటంలో రాజధాని ప్రజలు తెగ విరగపడ్డారు. నిజాం కళాశాల ప్రాంగణంలో ఎంతో మంది రాజకీయ నాయకులు గొంతులు చించుకున్నారు. ప్రేక్షక మహాశయుల కోసం ఎదురు చూసిన సన్నివేశాలు కూడా కొన్ని లేకపోలేదు. అయితే ఆనాడు జరిగిన బ్రహ్మాండమైన వీడ్కోలు మహాసభ తిలకించి ఆంధ్రేతరులు కూడా మూర్ఛపోయారు. వేలాది జనం తీర్థప్రజ లాగ, గంటల తరబడి వేచియుండి ఎట్లాగైనా సరే చలనచిత్ర నాయకున్ని ఒక్కసారి తనివితీర చూసి జన్మ సార్థకం చేసుకుందామనే ఆకాంక్షతో, పరుగులెత్తింది. ఈ సభను చూడని వారికి ఇది కొంచెం అతిశయోక్తిగా కనపడచ్చు. అయితే అక్కినేని వారు, పూలదండలతో సగం మునిగి, అన్నపూర్ణా సమేతంగా వేదికమీదికి వచ్చి నిలబడిన క్షణాన, ప్రజల పులకరింపులు, వాళ్ళ హావభావాలు, ఆశ్చర్యాభిమానాలు ప్రత్యక్షంగా చూసిన వాళ్ళకు మాత్రం తెలుస్తుంది నిజమని.

ఆంధ్రత్వం లోటు పడిందని, మన రాజధాని నగరంలో తెలుగుతనం వెలవెల బోతోందని అనుకుని బాధపడినవా రందరికి, ఈ ఉత్సవం కనువిందయింది. కోటీ దగ్గర్నుంచి ప్రారంభమయిన ఈ వూరేగింపులో అన్నీ ప్రత్యేకతలే. ముట్ట మొదటగా సావిత్రి, జగ్గయ్య గారల రథం బయలుదేరింది. జనసమూహం యొక్క జేజేల మధ్య, వీరిద్దరు నిండుగా కూర్చుని పయనమయి పోతుంటే, జనం వెర్రిగా గొంతులెత్తారు. అన్నట్టు ఈ మధ్యనే సావిత్రికి 'నటీ శిరోమణి' బిరుదు ప్రదానం కూడా జరిగింది. ఆమెగారు అసలు జీవితంలో నటున్నే భర్తగా స్వీకరించింది కూడా. తనూ, తన భర్త జెమినీగణేశ్ యిద్దరూ ఏనుగు అంబారీ మీద వూరేగుతూ రవీంద్ర భారతికి వచ్చిననాడు అశేష ప్రజకు ఆమెను చూసే అవకాశం కలిగింది. మళ్లీ ఈనాడు వూరేగింపులో ఆమే ప్రథమంగా కనిపించేటప్పటికి, ప్రేక్షకజనం యొక్క కోరిక పూర్తిగా నెరవేరినట్లయింది. తర్వాత రథంలో సినిమాల్లో అందరికీ 'ఏవగింపు' కలిగిస్తూ, వ్యక్తిగా మంచి అనిపించుకున్న సూర్యకాంతాన్ని చూసేటప్పటికి, ఇక కోలాహలం హెచ్చిపోయింది. మూడో రథంలో ఉన్నవాళ్ళూ తక్కువేం కాదు, గుమ్మడి, రాజసులోచన, గారలు. చివరి రథంలో అక్కినేని దంపతులు ఆసీనులయి ఉన్నారు. నాగేశ్వరరావుగారు ముకుళితహస్తాలతో ప్రజ చూపిస్తున్న అపారమైన అభిమానాన్ని సగౌరవంగా స్వీకరిస్తున్నారు. విదేశయాత్ర విజయవంతంగా ముగించుకుని స్వదేశానికి తిరిగి వచ్చిన హీరో నాగేశ్వర్రావా అనిపించింది. దారి పొడుగునా పూలు విరజిమ్ముతూ వేలాది జనం, హర్షధ్వానాలు ప్రకటిస్తూనే ఉన్నారు.

సరిగ్గా నిజాం కాలేజీ ఆవరణలోకి నటీనటవర్గం వచ్చేటప్పటికి, జనం కిక్కిరిసి ఉంది. పసి పిల్లలతో సహా స్త్రీలు కూడా వేల సంఖ్యల రావటం, రాజధాని నగరంలో యిదే ప్రథమమేమో! అనుక్షణం ఉద్రిక్తతకు ప్రాతినిధ్యం వహిస్తున్న విద్యార్థి బృందంవారు ఈనాడు ఎంతో క్రమశిక్షణతో వ్యవహరించి ఇంత బ్రహ్మాండమైన సభను దిగ్విజయంగా కొనసాగడానికి దోహదం యిచ్చారు. సుమారు నూరు ౧౦౦ నారు, రాజధాని నగరంలో చలనచిత్ర పరిశ్రమకు బలం కలిగించిన శ్రీ అక్కినేనిని, పూలహారాలతో ముంచెత్తారు. వసంతఋతువు ప్రారంభ కాలంలో ఉగాదినాడు జరిగిన ఈ అభినందనలో ఎంతో



గౌతమీ నదిపై కూలిన అలమూరు వంతెన.

విశిష్టత ఉందని అందరూ అన్నారు. లాలిత్యం, నాజూకుతనం, తన సొంత సొమ్ముగా చేసుకున్న నాగేశ్వరరావుగారి నటనా చాతుర్యాన్ని గురించి ఎంత చెప్పినా తక్కువగానే కనుపిస్తుంది. అయినా తమకు తోచిన నాలుగు ముక్కలు, నలుగురూ చెప్పనే చెప్పారు. కొత్త ఊహల్ని, కొత్త పోకడల్ని సంతరించుకుంటున్న ఆయన నటన తాపీగా కూర్చుని, సుష్టుగా భోంచేసినట్టుంటుంది, అని జగ్గయ్యగారంటే, నా అభిమాన నటుడు నాగేశ్వరావే అన్నది సావిత్రి. 'తెలుగు సినీ రంగంలో అనేక కథలకు నాయకులై, వివిధ నాయికల నాయకులై, అశేష నటులకు నాయకులై నేడు చలనచిత్ర రంగానికే నాయకపదవి అందుకున్నారు' అంటూ సన్మాన సమితివారు తమ అభిమానాన్ని వ్యక్తపరిచారు. 'ఆంధ్రుల అభిమాన సినీ నటకులు శ్రీ అక్కినేని అన్న పదం అనవరతం ఆచంద్రతారార్కంగా ఆంధ్రదేశంలో అలరారుతుం

# రాజధాని కబుర్లు

దనటంలో అతిశయోక్తి లేదు' అంటూ ఆశీర్వదించాయి, అదివరకే అయిదు ప్రఖ్యాత కళా సంస్థలు.

లోగడ రవీంద్రభారతిలో జరిగిన అభినందన సభలో నైతేనేమి, ఉగాదినాటి ఉత్సవంలో నైతేనేమి, అనేకమంది అనేక విధాలుగా అక్కినేని అమెరికా యాత్రను గురించి ఆశలు వెలిబుచ్చటం జరిగింది. ప్రజాస్వామ్యానికి కట్టుబడ్డ రాష్ట్రమంత్రి వర్గ సభ్యులే చలనచిత్ర పరిశ్రమను, శ్రీ అక్కినేని 'డిక్టేట్' చెయ్యాలని, ఆయన ఆ స్థాయిలో ఉన్నారని, అమెరికా వెళ్ళి, కథావస్తువులో మార్పు తీసుకు రావాలని సలహా ఇచ్చారు. ఈ విదేశపర్యటన ముగించుకున్న తర్వాత నాగేశ్వరరావు గారి దృక్పథంలో తీవ్రమైన మార్పు రావాలని, తాను గడించిన అనుభవం దృష్ట్యా, తెలుగు చలన చిత్ర పరిశ్రమలో యేవేమిటో జరిగి పోవాలని ఆశించారు. ఇదొక భాగం. ఇక రెండోది, శ్రీ అక్కినేని వారు, మద్రాసు వదిలిపెట్టి, శాశ్వతంగా హైదరాబాదుకు మకాం మార్చటానికి కారణం, చలన చిత్రపరిశ్రమను ఉద్ధరించటానికేనని, వారంత త్యాగ బుద్ధితో ఇక్కడికి రావటం ఎంతో ఆనందదాయకంగా వుందనీ, ప్రభుత్వంవారు, ఇతరులు కూడా పొగడారు. వీటికి సమాధానం చెప్పటంలో నాగేశ్వరరావు కొంత ఇరకాటంలో పడ్డారని చెప్పక తప్పదు. అయితే నిర్మొహమాటంగా, నిక్కచ్చిగా ఉన్న విషయాన్ని గట్టిగా చెప్పినందుకు ఆయన ఎంతైనా అభినందనీయులు.

మొదటిది, తాను కేవలం వ్యక్తిగతంగా అమెరికా వెళ్లటం లేదని, తనతోటి నటీనటుల ప్రతినిధిగా మాత్రమే అమెరికా ప్రభుత్వం ఆహ్వానించింది గనుక ఈ గురుతర బాధ్యత అను క్షణం గుర్తుపెట్టుకుంటూ ప్రవర్తిస్తానని హామి ఇవ్వటం, మన దేశ సాంప్రదాయాలకు అనుగుణంగా, కథా వస్తువులు రూపొందేవి కనుక. విదేశాలలో కథా వస్తువులు, ఇక్కడకు దిగుమతి చెయ్యటమనే సమస్య లేనేలేదు. తాను కేవలం, నటుడే కనుక, సాంకేతిక విషయాల్లో ఘనంగా విజయం సాధించిన విదేశాల అనుభవం తాను ఆకళింపు చేసుకోటానికి సాధ్యపడదని, ఇకపోతే, నాగేశ్వరరావు అమెరికా నుంచి తిరిగి వచ్చిన తర్వాత ఆయన నటనలో యేదో పెద్ద మార్పు వస్తుందనుకోవటం శుద్ధ పొరపాటని తేల్చి చెప్పేశారు.

తానేదో చలన చిత్ర పరిశ్రమనే ఉద్ధరించటానికి, హైదరాబాదు తరలి వచ్చాననటంలో సత్యం లేదు. ఆనాటి పరిస్థితుల్లో మద్రాసు స్టూడియోల్లో జరిగిన సమ్మెదృష్ట్యా, రెండు మూడు చిత్రాలు తియ్యటానికి మాత్రమే సారథీ స్టూడియోకు రావటం జరిగిందని, వచ్చిన తర్వాత ఇక్కడ కనిపించిన అనువైన వాతావరణం, రాష్ట్ర ప్రభుత్వ ప్రోత్సాహం, కొత్త ఆలోచనలకు తావిచ్చిందని అన్నారు. 'కథానాయకునికి' తెరవెనుక నాయకునిగా వుంటూ వున్న అన్నపూర్ణా పిక్చర్సు అధినేత శ్రీ దుక్కిపాటి మధుసూధనరావు గారి సందర్భోచితమైన సలహాయే, ఈ తరలింపుకు కారణమయిందని కూడా అన్నారు. ఏమయినప్పటికీ వీరు ఇక్కడికి వచ్చిన తర్వాతే చలన చిత్ర పరిశ్రమలో సంచలనం ప్రారంభమయిందనటంలో సందేహం లేదు. ఎవరు ముందూ, ఎవరు వెనకా అనే విషయం మీద తర్జన భర్జనలు అనవసరమేమో!

అన్నట్టు, రాజసులోచనగారి నృత్య ప్రదర్శన ముందు, తన సాంఘిక చిత్రాల విజయానికి తోడ్పడ్డ విద్యార్థి బృందాన్ని, శ్రీ అక్కినేనివారు, మహారాజ పోషకులుగా అభివర్ణించారు. మరి ఈ ఆసరా చూసుకొని, ఈ పోషకత్వంలో ఇంకా ముందంజ వేస్తారేమో కూడా! చదువులు విస్మరించనంత వరకు యెన్ని సినిమాలు చూస్తే మాత్రం యేం లెండి! ఇంత మంది శుభాశీస్సులు పొందగలిగిన నాగేశ్వరరావు గారు దిగ్విజయంగా విదేశ పర్యటన ముగించుకుని, ఎప్పుడు వస్తారా అని ఎదురు చూస్తున్నారు అందరూను.

ఐ. ఎల్. ఎన్. ★

# ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

## "పయనమయే ప్రియతమా" నను మరచి పోవుమా!

వెళ్ళొస్తా రాధా! వెళ్ళొస్తా
అన్నప్పుడే ఆడదీ పట్టదు తిరుగురస్తా
అప్పుడే నిజంగా మొదలవుతుంది వాళ్ళ సంభాషణ
తెగబారెడు ఆత్మస్తుతీ, తగుమాత్రం పరదూషణ
వెళ్ళొస్తా రాధా! వెళ్ళొస్తా
అన్నప్పుడు గుర్తించదు మొగుడవస్థ
మూడో సిగరెట్టు ముట్టించి దగ్గుతాడో దగ్గ
ఆయన పెట్టే ఇబ్బందికి ఆవిడ పడబోదు సిగ్గ
వెళ్ళొస్తా రాధా! వెళ్ళొస్తా
అన్న ప్రదేశం కావచ్చు చౌరాస్తా
అక్కడే వాళ్లు మాట్లాడుతారు రహస్యాలు
ఆత్మీయుల వర్తనపై చేస్తారు భాష్యాలు
వాకిలి, నడవ, వరండా ఇత్యాది మజిలీలు
సెలవు తీసుకుంటున్న ఆడాళ్ళకి మహా వీలు
వాళ్ళ సంభాషణల వాక్యాల్లో కామాలు
వెళ్ళొస్తా వెళ్ళొస్తా అనేవే కామాలు
గుర్తించలేదు ఎంతో ప్రేమించే మగనాలు
ఘోరంగా నొప్పెట్టే భర్తగారి కాలు
కూర్చొని కొట్టకూడదా ఈ కుచ్చిటప్పాలు
మూర్ఛ తెప్పించవా మాటల వానావలప్పాలు
వెళ్ళొస్తా వెళ్ళొస్తా వెళ్ళొస్తా రాధా
అని లేవకపోతే ఉంటుందా ఈ బాధా.



# సీతాకళ్యాణం

కుమారి భారతి



"సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకము రామచంద్రా— ఆ పతకమునకు పట్టె పదివేల వరహాలు రామచంద్రా—"

భక్తిరంజని ప్రసారం...... డ్రాయరు మీద తలనువాల్చి పాటలో మునిగిపోయిన సీత ఆ ప్రసారం పూర్తైనా మర్చిపోయిందనాలి !!

"కలికి తురాయి నీ తలకు చేయిస్తిని రామచంద్రా— ఎవడబ్బ సొమ్మని కులుకుతూ ఉన్నావు రామచంద్రా—"

గగుర్పొడిచిన శరీరాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ తన ఉలికిపాటును ఎవరైనా గమనించారేమోనని భయంతో చుట్టూరా పరికించింది !

అదృష్టమో — దురదృష్టమో — రెండింటి మిళితమో ఫలితమో కానీ ఆ గదిలోకి అడుగిడుతూనే సీత ఉలికిపాటునూ, తడబాటునూ చూసి తలుపు వెనకాలే దాక్కున్న రాంబాబు మాత్రం సీత కంటబడనే లేదు !

"కమలనయన రారా— నను— నీ కరుణ నేలుకోరా"

పాట వెనకాల పాట సీతని పూర్వ్వతోకాల్లోకి ప్రాయుల లాగిస్తున్నాయి !

విలసితనంలో పుట్టింది —
ఆకతాయి తనంలో పెరిగింది. —
కొంటె తనంలో పదవింది —

ఈ పదునారేండ్ల సీతలో ఇన్నాళ్ళు తనకి కనుపించని అదృశ్య శక్తిని రాంబాబు చూడగానే కోలుకుని — సీత మునుపటి స్థితిని ప్రస్తుతస్థితితో పోల్చి ఊహించసాగేడు......

భక్తిరంజని అయిపోయిందనాలి....

సీతమాత్రం స్విచ్ ని ఆఫ్ చేసి అలాగే డ్రాయరు మీద తలవాల్చి ఆలోచిస్తూ కూర్చుంది.! తరుచుగా తను పాడేపాటల మీద సీతకింత సదభిప్రాయం ఉందని తెలిస్తే ప్రాయంలో రాంబాబు మరో నాలుగు సంవత్సరాలు గెంతేసేవాడు ఒకే లాంగ్ జంప్ లో !!

"రావేరావే తారాజువ్వా రంగేళీరవ్వా" పాటల్తో రోజుల్ని నిమిషాలుగా గడిపేసే సీతలోని భక్తి ప్రపత్తులను ఇన్నాళ్ళూ గమనించ(లే)క పోయినందుకు తనకు తానే నిందించుకుని —

"సీతా —" అంటూ వెనకాతే వెళ్ళి భుజాల మీద చేతులుంచి పిలిచేడు రాంబాబు !!

ప్రక్కలో బాంబు పడినంతగా అదిరిపడింది సీత !!

నిదర్శనంగా గుండె మరో పదిసార్లు కొట్టుకుని సమున్నత వక్షస్సుకు శ్రమను కలుగజేస్తోంది !

బంగారు పడిపోయింది —

నిదర్శనంగా భీతహరిణేక్షణ అయ్యింది సీత !!

తడబాటు పడింది —

తొట్రుబాటుగా పంటనీ, పమిటనీ సరిజూసుకుని లేవడానికి ప్రయత్నించే విఫలురాలయ్యింది !!!

ఆఖరిసారిగా కోపగించుకుంది —

నిదర్శనంగా పై మూడింటి కలయికలేకాక — పెదాలు ముడుచుకుని బుగ్గల్ని బూరెల చేసేసింది !!!!

అన్ని కోపాలు ఒక విధంగా ఉండవు కదా ?

ఒకోరకానికో భంగిమ ఉంటుంది మరి !!

ఇక్కడ ఇప్పటి భంగిమలు రాంబాబు మెచ్చుట పడేవే మరి !!!

అంతకోపంలోనూ రాంబాబు కిష్టమైన భంగిమ అనే ప్రదర్శించ గలగడం —

ఆ రాంబాబు అదృష్టమైనా అవ్వాలి !

ఈ సీతమ్మ దురదృష్టమైనా అవ్వాలి !!

నిజానికి పాపం సీతకి నిజమైన కోపం వచ్చింది.

ఈ కోపం ఉత్తుత్తి కోపాలు బావా మరదళ్ళ మధ్యలో వస్తే ప్రణయ కోపమేకదా మరి ?

మునిమాణిక్యం వారి భాషలో తన సీత ప్రణయ కలహం పట్టిందను కున్నాడు రాంబాబు.

ప్రణయ కలహం చికిత్సలు మొదలుపెట్టబోయేసరికి తలను విసురుగా త్రిప్పేసుకుంది !

విసవిసా నడిచేస్తోంది !!

సీత తలత్రిప్పులో ఓ విధమైన ప్రత్యేకత ఉంది —

అందమంతా ఆమె జూకాల తళతళలలో మెరిసి మాయమవుతుంది !

నవ్వుకుంటూన్న రాంబాబు పెదవులని ఏవో శబ్దం విన్న చెవులు మూడి చేసేయి—

"అమ్మా -- బావ చూడవే" — ఎంత అపశ్రుతిలా వినిపించింది. ఇంత మధురాతి మధురమైన సీత మంద్ర స్వరం రాంబాబుకు !

అప్రయత్నంగా లేచేడు —

సీత వెను వెంటనే నడిచేడు —

సీత వెళ్ళిన మార్గం గుండా ఆమె వదిలిన మధుర స్మృతులను తలచుకుంటూ తమా వెళ్ళేడు అత్తయ్య దగ్గరికి !

ఏకాంతంగా కూర్చుని ఏదో ఆలోచించు కుంటూన్న తల్లితండ్రుల మధ్యన చేరబడి తన మీద ఫిర్యాదు చేస్తున్న సీత కంటబడగానే రాంబాబు శరీరం గగుర్పొడిచింది. !!

అత్తయ్య అంటుంది కదా —

" మా సీత ఓ గడుగ్గాయి మేళమోయ్ — ప్రతి మాటకీ అరిచేస్తూంటుంది కదా ? — దాన్ని చేసుకుని నీవేం సుఖపడతావ్రా ?" — అని

" సీత అరిస్తేనే చాలా అందంగా ఉంటుం దత్తయ్యా ! సీత మృదువుగా నాతో మాట్లాడు తూంటే చాలా అసహజంగా ఉంటుంది. అయినా సీత అరుపులంటేనే నాకు ఎక్కువ మక్కువ " — అన్నాడు తను.....

ఇది యిరువురకీ ఒకేసారి మదిలోమెదిలి ' కీ ' యిచ్చేసరికి అత్తయ్య — అల్లుళ్ళు ముఖాముఖాలు చూచుకుని నవ్వుకున్నారు......

ఇదిచూసి సీత ఉడుక్కుంటూ తండ్రి వంపన జేరి —

" చూడు నాన్నా — బావేమో .. ... "

మధ్యలోనే కలియబడి " నేనేం జేసేను ? ఇది మరీబావుంది....నువ్వే చెప్పుమామయ్యా ?" ఈసారి మామయ్య మనసుకు కూడా సాధించి పశపరచు కున్నడు......

తిరిగి అమ్మను సమీపించి —

" చూడమ్మా — బావ మరీనూ....నేనేమో పాట వింటూంటే...." అంటూ అక్కడితోఆపి, చెప్పను ? అన్నట్లు దండిస్తున్న చూపును సారించింది సీత !

" అవును ! అస్తమానూ నేను పాడేపాటలని అంత శ్రద్ధగా వినడమేం ?" —

" ఇది మరీబావుంది !" —

" ఏది ? అడుగు తున్నది నేనే — ?"

" నువ్వు నాతో మాట్లాడక్క...రనే లేదు " ఆగమనమంత విసురుగానూ నిష్క్రమించింది ఆఖరి మాటతో......

అక్కరలేదు — అని సీత అనడంతో " సొంపు " ఉంది.... 'అ' హ్రస్వం గానే అంటూ " ఖ్క " అనే దాన్ని వత్తుతూ 'రలేదు" అనేని ఒకే కాలమాత్రంలో పూర్తిచేసి కోరగాచూసి కోపంగా నిష్క్రమిస్తుంది !

" నువ్వు మరీ సీతను రాలుగాయి చేస్తున్నావేం! అత్తయ్యా?" నవ్వుతూ (వే) అన్నాడు రాంబాబు...

" సీతా— బావకీ కాఫీ ఇయ్యి !!" — జవాబు చెప్పకుండా పురమాయించి—

రాంబాబును చూసి నవ్వుతూ —

" దీనికి జవాబు సీతో అడుగు " —

అంది సీత తల్లి శాంతమ్మ !

" అబ్బా ..." అంటూ రాంబాబు హుషారుగా నిష్క్రమించేడు.....

ఏకాంతంలో ఒక్కసారిగా విరబూసిన గిరజాజి గాలివాటానికి ప్రక్కలకి ఒరిగేసరికి రాలిపడిన పూలల్లో, వెనకటి దృశ్యాలు కనిపించి నవ్వేయి తెట్టిస్తూ ఆమెని !

*  *  *

ఆవేళ కరణం గారి కమాలా, మునసబు గారి సరోజా తనకు సాయం రానేలేదు !

అప్పుడు మరి ! రోజా సాయంత్రం వెళ్ళారు మంచినీళ్ళకి !! అమ్మ కసలేమీ తెలియదు......

" బావ సాయంత్రం వస్తాడూ — శాంతి — నీవిప్పుడే మంచినీళ్ళు తీసికుని రా " — అంది.

అది విన్నవాన్న అమ్మని చూసి నవ్వుతూ —

" శివరాం ఈ బండిలోనే రావచ్చు.... మన సుబ్బన్నని బండి కట్టి స్టేషనుకు వెళ్ళి చూసి రమ్మనమను !" — అన్నారు —

బావ వచ్చే టైమ్ ఇదే నని శాంతికీ అను మానంగా ఉంది.... అయినా అమ్మమాట వినాలిగా ? అందుకని చంకన బిందెతో బయలుదేరింది ! రోజా తోడుగా ఉండే కమలా — సరోజా కూడా లేరు..... తీరికగా బావని గూర్చి ఆలోచిస్తు నడుస్తోంది శాంతి ....

బండిలోంచి సగం త్రోవలోనే దిగిపోయి — "నీవు వెళ్తూండు సుబ్బన్న... నేనిప్పుడే ఇక్కడ ఉన్న స్నేహితులను కలుసుకుని వస్తాను !" అన్నాడు శివరాం !

ఇంతక్రితమే అమ్మాయి గారిని ఇద్దరూ చూసేరు... అరవయ్యోపడిలో పడిన సుబ్బన్నకి శివరాం మాట్లాడదలుచుకున్న స్నేహితు లెవరో తెలియదూ ? అయినా చిన్నగా నవ్వుకుని —

" తొందరగా వచ్చేయండి బాబూ — పెద్దమ్మ గారు మీ కోసం నేనెల్లగానే అడుగుతారు.. తిన్నగా ఇంటికి తోలుకు రా అన్నారు "— అన్నాడు. సుబ్బన్నతాత.......

తోలుకు రావడం అనే మాటకి నవ్వుకుని — తాతకి తెలిసి పోయిందని తనకి తెలిసినా —

" సరేలే తాత ! నీవు ఇంతగా చెప్పాలా ? ..... చిటికలో వచ్చేయనూ ?" — అనుకుంటూ సాగి పోయాడు !

నెత్తిమీద నుండి వర్తులాకారంగా కుడిచెయ్యి వేసి ఎడమ భుజాన్నున్న బిందెని సుతారంగా పట్టుకుని, ఎడమ చేయిని వయ్యారంగా డొక్కలో ఆన్చి పాంజేవులూ — అందెలూ ఘల్లు ఘల్లు మని మ్రోగుతుంటే ఈత తోపులోంచి ఒంటరిగా మెల్లిగా ఇంటికి వెళ్ళిపోతూన్న శాంతి కనిపించింది శివరాంకి !!

నడినెత్తిన అరచెయ్యి వెడల్పున రాళ్ళు పొదిగిన నాగరం —

నాలుగు వేళ్ళ వెడల్పున నల్లగా నిగనిగ లాడే బారెడు జడ మధ్యలో పెద్దరాళ్ళచామంతి —

చివరన మూడేసి చొప్పున విడివిడిగా కట్టిన తమాషా కుచ్చులూ —

కనిపించిన ఆ ఆకారం తన శాంతిదేనని చెప్పకనే చెబుతున్నాయి శివరాంకి !!!

త్వరత్వరగా సమీపించేడు —

తల్లోని జాజులు ఆమె ఏగింత మేరా సువాసనలని గాలిలో కలిపి కాస్సేపైనా మంచిని జ్ఞాపకం పెట్టు కోమని నవ్వుతున్నట్లున్నాయి....

వెనక నుండి మెల్లిగా నీటి బిందెను అంది పుచ్చుకో బోతున్న శివరాంను చూడకుండానే శాంతి జంగారుపడి హఠాత్తుగా — ' అమ్మా ' — అని అరుస్తూ —

బావని చూడగానే సిగ్గుల భరణియై బిందెని వదిలేసి అమాంతంగా గోపెట్లో మొహాన్ని దాచేసు కుంది !

హఠాత్తుగా తిరగటంతో నీళ్ళు శాంతికి శివరాం ఫాంటును, షర్టును, తడిపి చల్లగా హాయిగా — విచ్చుకుంటున్న బొండు మల్లెలనీ, నవ్వుతూన్న పారిజాతాలనీ గుర్తుకు తెచ్చేయి —

" బిందె పట్టుకోకుండా నేను జడనేలాగి ఉన్నట్లయితే బిందెను వదిలేసేదానివేనా " — అధిక్షేపించేడు శివరాం బిందెను శాంతి తలమీద బట్టి మోపుగా అన్నుతూ !

సిగ్గుల భరణిలో దాక్కున శాంతి నుండి ప్రత్యుత్తరమే లేదు..... ప్రతివాదాలు ఎలా వస్తాయి ? ప్రతిఘటించడం అనేది కలలోనైనా జరగనిది.... ఇక ఇంటలో—

"మునసబు ఇటే వస్తున్నాడు.. బిందె తీసికో శాంతి"— అనే తొందర సౌంజ్ఞను చూసి నిజ మను కుని అమాంతంగా బిందెను అంది పుచ్చు కుని వెనుదిరగబోయి కనిపించని మునసబు రాకకి నవ్వుకుంది సిగ్గుగా.....

"మునసబు అంటేనే గానీ...." అంటూ నవ్వుతూ సముదుతూ వసుగుతూ నటించే శివ రాం నుంచి తప్పించుకుని పోబోయింది శాంతి.

"ఇక నాకు దొరకవా ?— నీ సంగతి...."— శివరాం మాటలకు—

తలని తమాషాగా తాటిస్తూ — "చూకేం" అంటూన్నట్లు వడివడిగా సాగిపోయింది శాంతి.

అడ్డదారి వెంట శాంతి కన్నా ముందు ఇల్లు చేరి అత్తయ్యతో కబుర్లు చెబుతూన్న శివరాం పెరటి నుండి ప్రవేశించి వరండాలో బిందెను దింపనున్న శాంతిని చమత్కారంగా చప్పుడు చేసి భయపెట్టేసరికి సగంలోనే బిందెను వదిలి ప్రక్క గదిలోకి పారిపోయింది. శాంతి తల్లి "ఏమిటా చప్పుడూ" అని ప్రశ్నిస్తున్నా జవాబు చెప్పకుండా !

పాలేరుని పిలిచి ఆ నీళ్ళని వత్తెయ్యమని పురమాయించి గదిలోకి వెళ్ళిన శాంతి తల్లి తడిసిన పరికిణీ విగుళ్ళు పిండుకుంటూంటే పచ్చడి అయిన అమె కాలి బొటన వేలిని చూసి అదిరిపడి హయ్యో.... అదేమిటే.... అంత రక్తం"— అంటూ గోలచేసేసింది....

"పరిగెట్టేటప్పుడు కనిపించినా— గోడం టాకు పెట్టుకుందని అనుకున్నా నత్తయ్యా" అంటూ ఆదరా బాదరాగా ఆ గదిలోకి దూరి సిగ్గుతో చితికి పోయిన శాంతిని నయానా

53 వ పేజీ చూడండి



'మీవంట్లో షుగర్ చాలా ఎక్కువగానే వుందండీ!'

'అరె అమాట ముందుగానే తెలిసుంటే బ్లాకులో మాంచిలాభానికే అమ్మేద్దునే!'

# సరాగమాల — వి.ఎ.కె. రంగారావు

విజయనగరంనించి కుమారశ్రీ ఇలా వ్రాశారు.

మాటలు నావి. భావాలు వారివి. సంగీత దర్శకులలో ఇద్దరే కొత్త కంఠాలతో పాడించటంలో గాని కొత్త విధంగా పాత కంఠాల కలకయికలు యేర్పరచటంలో గాని యేమాత్రమైనా శ్రద్ధ చూపిస్తున్నారా? తక్కిన వారందరూ "పాత కంఠాలే వాడరా — ప్రొడ్యూసర్ల దేసరి" అన్న పద్ధతిలో ఘంటసాల, శ్రీనివాస్, సుశీల, జానకి మొదలైన వారితోనే పాడిస్తున్నారు. ప్రతి పాట కొత్తవాళ్ళకు ఇమ్మని ఎవరూ అనరు. ఇచ్చినా ఎవరూ వినరు. అయితే కొత్తదనం యెందులోనూ చూపరెందుచేత రాజేశ్వరరావు, పెండ్యాల కలిసి బసవేశ్వర్, సత్యారావు స్వర్ణలత, బి.గోపాలం, జమునా రాణి, వసంత, ఆశాలత మొదలగు వారికి కొత్త ఛాన్సులు ఇవ్వడమో కొత్త కలయికలో ఛాన్సు ఇవ్వడమో చేశారు. మరి తక్కిన సంగీత దర్శకులు చేయరేమి?

జవాబు: తక్కిన వారెవ్వరూ చేయలేదనటం భావ్యం కాదు. వసంతతో చాలామంది పాడించారు. బెంగుళూరు లతతో దక్షిణామూర్తి 'నర్తనశాల'లో పాడించారు. కోదండపాణి "బంగారు తిమ్మరాజు"లో జేసుదాస్‌ను పరిచయం చేశారు. ఇక తక్కిన వాళ్ళు తటస్థంగా ఊరుకోవటానికి ఒక కారణం నిర్మాతలు మీరు పేర్కొన్న సంగీత దర్శకుల మాట విన్నంతగా అందరి మాటా వినరు. ఇక పైగా వీరిద్దరూ ఉన్నతమైన స్థానాన్ని ఆక్రమించి ఉన్నారు. కాని తక్కినవారు అలా కాదు కొత్త కంఠాలను ఉపయోగించే కంటే పాతవాటినే పేరున్నవారినే ఉపయోగిస్తే పాటలకు పలుకుబడి, వారికి రాబడి హెచ్చుతుందని వారి అభిప్రాయం. వాళ్ల దృష్టిలో కొంత వరకు అదీ సమంజసమే కదా?

మీకు జమునారాణి— గోపాలం కలయిక నచ్చినట్లు ఉన్నది. అయితే మరొక మంచి వార్త. అనుపమా వారి కొత్త చిత్రం "ఉయ్యాల— జంపాల"లో ఒక పాట వీరిచే పెండ్యాల పాడించారు. నేనింకా వినలేదు కాని భలే సరదాగా (కొసరాజీయం మరి!) ఉందని వార్త. ఆ చిత్రంలోనే బాల మురళీకృష్ణ ఒక నేపథ్య గానం పాడారు. మీరన్నట్టు గానే కొత్త కంఠాలకు చేయూత నిచ్చేది ఆ ఇద్దరు సంగీత దర్శకులే. "మైరావణ"లో బాలమురళీకృష్ణ చేతనే రాజేశ్వరరావు రెండు పద్యాలు పాడించారు.

గత పదేళ్ళగా చూడాలనుకుంటున్న ఒక రకం డాన్సు ఈ మధ్యనే చూశాను. పదేళ్ళు వేచిన ఈ నాట్యం ఏ అమర నాట్యమో, ఏ పాశ్చాత్య లాస్యమో, ఏ శాస్త్రీయ నృత్యమో అనుకునేరు. ఇవేవీ కాదు. కాని ఈ మూడిటి ప్రభావం నేను చూసిన దానిలో కొంతయినా ఉంది ఏమిటీ ఉపోద్ఘాతం అని మరి ఆలోచించనవసరం లేదు. నేను చూసినది కార్నివాల్ డాన్సులు. కొన్ని చోట్ల వీటినే అమ్యూజ్‌మెంట్ పార్క్ డాన్సులంటారు. మరి కొన్ని చోట్ల ఇంకా వేరే పేర్లతో పిలుస్తారు. కాని వాటిని అచ్చులో వేస్తే సర్కారు వారు చర్య తీసుకుంటారు.

నేను చూడాలనుకున్న పదేళ్లనుంచి ఇటువంటి డాన్సుల గురించి విపరీతమైన, విషపూరితమైన దుష్ప్రచారం వింటున్నాను. ఆ నర్తనులు ఆడుతూ ఆడుతూ కన్ను కొడతారని, ముందు వరసలో కూర్చున్న వారిపై పూలు విసురుతారని, ఇంకా మీద బడబోతూ పాట పాడతారని, వాళ్లను చూడటానికి వచ్చే వాళ్ళందరూ యెందుకూ కొరగాని వారని, త్రాగుబోతులని, అమాయకులెవరైనా వస్తే వారి వద్ద ఆనిర్వాహక వర్గం వారు డబ్బు మాయోపాయం చేత గుంజుతారని, ఒకటా, పదా, ఎన్నో విన్నాను. విన్న తరువాత ఇంతటి మహా వ్యవస్థను కళ్ళారా చూద్దామనే కుతూహలం మరీ ఎక్కువైంది. తీరా మొన్న చూసేసరికి అందులో ఏమీ లేదు. ఊహించుకుందామన్నా అందులో వికృతూహ లేమీ కనుపడటం లేదు. మేము, అంటే నేను, గుడివాడ వాస్తవ్యులైన మదన కింకరావు, మూడవ వరసలో కూర్చున్నాము. మమ్మల్ని చూసిగాని, ముందు వరసలో ఉన్నవారిని చూసిగాని ఆడిన ముగ్గు రమ్మాయిలో, ఒక అమ్మాయి కూడా కన్ను కొట్టలేదు. సరిగదా, కన్ను మాపై నిలిపి చూడలేదు. ఇక ఇదే లేకపోయినపుడు ఇక పూలు రువ్వటం, అన్యాప

60వ పేజీ చూడండి



'లీడర్' చిత్రంలో ఒక దృశ్యం.

# ఆంధ్రుల ఘనమైన వీడ్కోలుతో అక్కినేని అమెరికా పయనం

ఆంధ్రుల ముఖ్య పట్టణమైన హైదరాబాదు నగరం గతవారమంతా ఎన్నెన్నో అందచందాలతో మురిసి, మెరిసిపోయింది. ఆంధ్రుల ప్రియతమ నాయకులు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు అమెరికా వెళుతున్న సందర్భంలో రాజధానిలో ఎన్నో వేడుకలు; ఉత్సవాలు వైభవోపేతంగా జరిగాయి. ఆబాలగోపాలమూ ఆ ఉత్సవాలలో పాల్గొని ఆ మహానటునికి ఘనంగా సన్మానంచేసి చరిత్రాత్మకమైన వీడ్కోలునిచ్చి పంపటం జరిగింది.

కోఠీ నుంచి నిజాం కళాశాల వరకు జరిగిన ఈ ఊరేగింపు చూపరులకు దిగ్భ్రమ కలిగించింది. కన్నులు చెదరిపోయాయి.

చిత్రసీమలో ఖ్యాతి గడించిన మహారథులందరూ వైభవంగా అలంకరింపబడిన రథాలో పయనించటం, వారి వెనుకన శ్రీ అక్కినేని, శ్రీమతి అక్కినేని మరో అందమైన రథంలో......... ముకుళిత హస్తాలతో, ఈ అనంత ప్రవాహినిని చూసి మురిసిపోతూ, వారి ఆదరాభిమానాలను చూసి ఆనందాతిశయంతో..... నిజాం కళాశాలకు వచ్చి, సన్మానంపొందారు.

శ్రీయుతులు జగ్గయ్య, గుమ్మడి, సావిత్రి, సూర్యకాంతం, రాజసులోచన, ప్రభృతులు ఈ ఉత్సవంలో పాల్గొనటం, కేవలం ఆయా నటుల విశాల దృక్పథానికే నిదర్శనం.

## ఇంకా ఆంధ్రావని అంతటా ఘనమైన సన్మానాలు జరిగాయి.

స్వగ్రామమైన రామాపురంలోను, ఆంధ్ర దేశానికి నడిగడ్డయైన విజయవాడలోను, రాజధానిలోని రవీంద్రభారతి, నానక్‌రాం కళాశాలల్లోను ఈ సన్మానసభలు జరిగాయి. —

గత రెండు దశాబ్దాలుగా శ్రీ అక్కినేని సినిమా నటుడుగా చేస్తున్న కళాసేవ పట్ల పలువురు ప్రముఖులు ఆనందాతిశయం వెలిబుచ్చారు.

## విజయవాడలో

ఆదివారంనాడు అరుణోదయానికి పురవీధులలో విజయ పతాకములు, అరుణోదయకాంతులతో రంగురంగుల తోరణాలు, జన సమూహంతో నిండింది. శ్రీ అక్కినేని. నాగేశ్వరరావుకు కని, విని ఎరగని, ఘనసన్మానాలు శ్రీ అలంకార్ టాకీస్ శ్రీనివాసమహల్ వద్ద, ఫిల్మ్ ఛాంబర్ వద్ద ముఖ్యంగా శ్రీ వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయ భవనం ఎదుట, జరిగాయి. సుమారు లక్షపైగా జనం, స్త్రీలు బిడ్డలతో చీకటనక, నలుప్రక్కల బారులుతీర్చి కూర్చున్నారు.

ఊరేగింపు ఉత్సవాలలో విచిత్ర వేషాలు, డప్పువాయిద్యములు, ఢంకా నవరుత్, బ్యాండు వాయిద్యాలతో అన్ని వీధులవెంట లక్షలాది ప్రజలు తిలకించారు.

పురపాలక సంఘం, రోటరీ క్లబ్, ఇండో అమెరికన్ కల్చరల్ సంఘం. అనంతరం ఆంధ్ర ప్రదేశ్‌లోని 187 కళాసంస్థలు శ్రీ హనుమంతరాయ గ్రంథాలయం వద్ద అత్యంత ఆప్యాయతతో సన్మానాలు జరిపారు. శుభాకాంక్షలు అందజేశారు.

ఆంధ్రుల అభిమాన కథానాయకుడు చలనచిత్ర పరిశ్రమను తెలుగు రాజధానికి తరలించిన ఘటికుడు అని, తెలుగు సినిమా పరిశ్రమకు దోహద మిస్తున్న బుద్ధిశాలి అని అన్నారు.

జాతీయోద్యమంలో ప్రముఖస్థానం వహించిన విజయవాడలో శ్రీ నాగేశ్వరరావును అన్ని సంస్థలు, అన్ని రాజకీయ పక్షాలు "సుఖంగా అమెరికా వెళ్ళి మన సంస్కృతిని తెలియజేయుమని" కోరినారు.



నానక్‌రాం భగవాన్దాసు కళాశాలవారు తనకు జరిపిన సత్కారసభకు శ్రీ నాగేశ్వరరావు సమాధానమిస్తున్న చిత్రం. శ్రీ నాగేశ్వరరావుగారికి కుడివైపున వారి సతీమణి శ్రీమతి అన్నపూర్ణ ఆశీనులై వున్నారు.

## హైదరాబాదు కళాశాలలో

ప్రఖ్యాత సినీనటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారిని, వారి సతీమణి శ్రీమతి అన్నపూర్ణను, రానున్న వారి అమెరికా పర్యటనను పురస్కరించుకొని నానక్‌రాం భగవాన్దాసు కళాశాల వారు ఈనెల 2వ తేదీ సాయంకాలం ఘనంగా సన్మానించారు. సభకు కాలేజి పాలక వర్గాధ్యక్షులు శ్రీ సాగర్మాల్ గుప్తా అధ్యక్షత వహించారు.

శ్రీ సాగర్మాల్ గుప్తా శ్రీ నాగేశ్వరరావు గారికి స్వాగతమిస్తూ, ప్రతిభావంతులు అయిన శ్రీ నాగే

56వ పేజీ చూడండి




ఇరవై సంవత్సరాల నిండు విగ్రహం! పొడవుకి తగిన శరీర పుష్టి! పుష్టికి తగిన అంతస్సారయుత మైన అవయముల బిగి! బిగికి తగ్గ లాఘవం! లాఘవానికి తగినకౌశలం — కలిగియున్నాడు వీరందొర!

క్రూర మృగాలకి వీరందొర సింహస్వప్నం. భీకరమైన వాని శరీరాలయంలో మెత్తని ప్రేమ పూరిత హృదయం దాగుంది. వాని విశాల రక్తాంత నయనకోణాలో కరుణ నిండి ఉంది.

అప్పుడు మిట్ట మధ్యాహ్నం! నభోమణి మధ్యంలో నిప్పులు చెరుగుతున్నాడు! పశుపక్షి మృగాదులు చల్లని జాగాల్లో చేరుకొని విశ్రాంతిని అనుభవిస్తున్నాయి. పక్షిగణం ఆకు — జొంపాలో కిలకిలలాడుతున్నాయి.

నల్లసాని రాయివలె నిగ నిగ మెరుస్తున్న దొర విశాల వక్షస్థలం చెమట బిందువులచే అలంకరింప బడి వీరలక్ష్మియొక్క పాందపీఠంవలె ఉంది. జీడి నూనె పట్టించి, కొమ్ము పన్నెతో దువ్వబడిన కేశాలు ఎత్తి శిరోపరి భాగంలో ముడివేయబడి, రంగు రంగు పక్షి ఈకల్తో మెరుస్తూంది. కటి ప్రదేశానికి బిగించి కటిన ముతక ధోవతి సిలకట్టు మొలలో దోపుకొన్న ఒరతో కూడిన బాకు, ప్రక్కన వ్రేలాడుతున్న పదునైన గొడ్డలి, చేతిలో నల త్రాచువలె భయంకరమైన విలు, వీపుపై నల్లని పటీతో బిగించి కట బడిన అమ్ముల పొది— ఇలిగి వీరందొర భిల వేషంలో అర్జునునికి ప్రత్యక్షమైన సాంబశివునివలె ఉన్నాడు!

ఒక పెద్ద చెరువులో తామరలు, కలువలు నిండి ఉన్నాయి. చెరువు ఒడ్డున శాఖోపశాఖలతో మర్రిచెట్టు సగం చెరువుని తన ఛాయలో ఇముడ్చు కొని గంభీరంగా ఉంది! చెట్టు మొదట ఒక బండరాయి అరుగువలె ఉంది. దానిపై ఆశీను డయ్యాడు వీరందొర—

వీరందొర వెదురు కోలల్ని తయారు చేస్తు న్నాడు. వాని చేతులు పనిచేస్తున్నాయి, కాని వాని హృదయం ఈ పనిలో ఇమడకుండా ప్రత్యేకమైన పని చేసుకుంటోంది.

అది (మనస్సు) ఒక మనోహర రూపాన్ని చిత్రీ కరణ చేసుకుంటూంది. ఆ మధుర చిత్రీకరణలో హృదయదర్పణగతమైన రూపంయొక్క ఒక్కొక్క అంగం ప్రతిఫలించింది. శరీరం పండిన నిమ్మపండు, దాంట్లో ప్రవహించే తరంగమాలినీ ఝరి అభ్ర గంగా సదృశం! ముఖం చంద్రసదృశమై మృదు మధుర కమనీయం!

కన్నులు తామర దళాలవలె మనోహర తేజో పూరిత రమణీయం! నాసిక కంఢ ఔన్నతిని చాటు టకై ఉన్నతమై గంభీరాకృతి దర్శనీయం! పెదిమలు పలుచనై మాణిక్య కాంతి సముజ్వలమై మకరందరస ప్రపూరితం!

వీరందొర మత్తెక్కిన చూపులు హృదయకుహ రంలో చిత్రీకృతమైన ఇటి రూపాస్వాదనలో లీనమై పోయాయి.

"మాఁ వా! మాఁ వా!" అని వెనుకనుండి ఒక కిన్నెర కంఠం వినిపించింది!

"బిగువుగా ఉండాల— సూస్తాంగదా సిలక సంగతి!" అని తనలో తలంచి నవ్వుకొన్నాడు వీరం దొర.

ఒక పడుచు వీరందొర వెనుక భాగానికి సమీ పంలో వచ్చి నిలుచుంది. ఆమెయే వాని హృదయ హృదయఫలకంలో చిత్రితమైన అందాల బాల.

"మాఁవ మా సెడ కోపంగా ఉండాడు — నాకేం పోతాదంట?" అని లోసల శబ్దించుకొంది రత్తి.

రత్తి మెల్లగా దొరని సమీపించింది. వాని దగ్గ రగ బండరాతికి చేరవేయబడిన విలు ని వంచి అందుకొంది! నెమ్మదిగా అంబులపొదిలోని వెదురు కోలని లాగింది! విలు ని వంచినారి ఎక్కుపెటింది బాణాన్ని వింట తొడిగింది!

దొర ఓర కంటిలో గమనించి, మందహాసం చేశాడు!

"మాఁ వా! ఓ కాసుకో! కోల దూసుక వస్తాది!" అంది రత్తి—

"కాసుకొనే ఉన్నానే సిలకా! ఆకోలకే!!" అన్నాడు దొర.

రత్తి కిల కిల నవ్వింది! దొర హృదయ వీణాతంతు వులు స్పందించాయి!

"మాఁ వా! ఓ., వెర్రి మా వా రత్తి కోల ఏం సులకనా?"

"కాదే, సిలకా! దాని వేగం నాకంటే ఏరికే తెలుసు?"

రత్తి విలు ని మర్రి ఊడకి తగిలించి, కోలని పొదిలో దోపి, దొరకి ఎడంగా ప్రక్కన మూతి ముడు చుకొని కూర్చుంది.

"ఏం రత్తీ కోపమాఁ?

"కాక మరేంది ? అనుమానం సిలకా సిలకా అంటావ్—"

"పోనీయే— 'రత్తీ' అని పిలుస్తానే!" అంటూ దొర రత్తికి దగ్గరగా వచ్చాడు—

"అదిగో, మాఁ వా! దగ్గర రాబోకు—"

"ఏమంటా ?" అని బిగుసుకొని కూర్చున్నాడు దొర.

"అదో, అప్పుడే కోపం! నాను కన్నెపిల్ల కాదా మాఁ వా!"

"రత్తీ మనం పెండ్లాడేద్దాం!"

రత్తి కిల కిల నవ్వింది. ఆ నవ్వులు ధాళ ధళ్యం దొర హృదయంలో వెలుగు పుట్టించింది!

"అయ్యో! వెర్రి మాఁ వా! మన పెండ్లి అయి పోయింది కాదా!"

"ఎప్పుడే రత్తీ!"

"దుర్గ గుళ్లో నాను పైటవేసిన రోజు. నాను నీ మెళ్లో మాలవేసా! నీవుండావే నా మెళ్లో మాలవేసి........!" అని సిగ్గుతో కుంచించుక పోయింది.

"మరి ఇంకేం?" రత్తి చెయ్యిని పట్టుకొని లాగాడు దొర.

రత్తి యాంౘ్రపడుతూ, " మాఁ వా! నీవు గండడివి కాదూ?" ప్రశ్నించిం!".

"అవునే! నూరు పాళ్లూనాది" అన్నాడు తన మాగు మీసాల్ని దువ్వి.

"గండడివైతే నా కోర్కె తీర్చి..... తరువాత... నీ ఇష్టం!" అని తలవంచుకొంది.

"రాణి కోరుతాది. రాజు తీర్చాలి! ప్రాణం ఇచ్చి తీరుస్తా,రత్తీ" అన్నాడు గుండె చరచుకొని దొర.

రత్తి దొర చెవిలో గుస గుసలాడింది—"మాఁ వా! అదే నాను కోరేది. నాలు చణాలు చాలు మాఁ వా సరా మాఁ వా" అని తన కోర్కెని వ్యాఖ్యానం చేసింది.

"అమ్మ దొంగా! ఎంతేసి కోరిక కోరావ్! తల పోయే పనే! నా రత్తి ప్రాణం ఇస్తానే!" అని దొర రత్తిని చంటి పిల్లనివలె తన గజ సుండాలోపమ బాహువుల్తో ఎత్తాడు!

రత్తిని వీరందొర తన గుండెకి అదుముకున్నాడు. నున్నటి చెక్కిళ్ళమీద తన ప్రతి బింబాన్ని చూచు కొని మురిసిపోయాడు! ఆమె కళ్లల్లో తన వెలుగుని చిలకరించాడు! ఉక్కువంటి తన శరీరంలో ఆ పుష్ప సుకుమార శరీరాన్ని నిర్దయంగా అదుము కొన్నాడు! రత్తి కొప్పు విడిపోయి క్రిందికి కాల సర్పంలా జీరాడింది. ఆమె కంఠంలోంచి తియ్యని నాదం, పొంగిన ఏటిలో బుడగలా గు ఉబికి శబ్దిం చింది.! ఆ నాదంలో వీరందొర శరీరంలో మధు రాను భూతి చెలరేగింది!

"మాఁ వా! చాలు మాఁవా! క్రిందికి దించేయి మాఁ వా" అని రత్తి దొర కంఠానికి తన బాహా వల లిని తగిలించి బుజ్జగించింది.

ఇంతలో టక టకమని గుర్రపు డెక్కల చప్పుడు వినిపించింది. రత్తిని మెల్లగా క్రిందికి దించి, వీరందొర చప్పుడు వచ్చిన వైపు పరికించి చూచాడు!

బాణాలవలె దూసుకుంటూ అశ్వదళం వస్తూంది!

* * *

పై సంభవం జరిగి పదిహేను రోజులు దొర్లి పోయాయి—

అప్పుడు సంజె చీకట్లు దట్టంగా నాలుగు మూలలా అలముకున్నాయి! సూర్యుడు అస్త్రాద్రి మరుగున వొచ్చిపోయాడు! అమావాశ్య మొదటి ముందటి రోజు కాబట్టి చుక్కలు పొడువలేదు. చుక్కల రేడు నింగిన పొడువలేదు. చుక్కలు మాత్రం నిర్మలాకాశంలో వజ్రపు తునకలవలె మెరుస్తున్నాయి!

చల్లని గాలి వేడి పువ్వుల పరిమళాన్ని తెచ్చి నలుమూలలా నింపుతూంది! దుర్గ గుడి వేపచెట్ల మధ్య ప్రశాంతంగా ఉంది.

ఒక జంట వేప చెట్టు క్రింద కూర్చొని మాట్లాడుకుంటోంది!

"మాఁ వా! నాకెంతో భయమేసింది,ఆ రోజు—" అంది రత్తి!

"ప్రక్కన రాజు నెట్టుకొని భయమేందేపిల్లా!" అన్నాడు వీరందొర.

"వూరిలోని వారంతా మన గుడిసెలపైపు పరి గెత్తుకుంటూ వచ్చేరేంది?"

"ఆడపిల్లవు నీకేం తెలుసు? యుద్ధమే, రత్తీ యుద్ధం—"

"ఊళ్లో వాళ్లు కొట్టుక చస్తుండారా,మాఁవా?"

"ఇజయనొగరం మారాజు మన కోటపై వచ్చిండు—"

"ఎందుకేంటి?"

"ఇజయ నొగరం మారాజుకి, గజపతి మా రాజుకి బెడిసిదంట— ఇజయనొగరంవోళ్లు ఊరు తీసికుండ్రు— కోటని చుట్టేశారు ఇజయనొగరం వోళ్లు. అది కోటకాదే, రత్తీ, ఉక్కు! ఉక్కు!! లోపకి వెళ్ళవొసమా? ఈళ్లకి నోరు సత్తువేకాని, జబ్బ సత్తువ లేదేపిల్లా!"

"అంఁతే, మాఁవా! నీవేంచి ఊరకుంటావ్ ? జబ్బ సత్తు చూపరాదా?"

"నా కోరికె ఇజయనొగరం మారాజు తీరుస్తే, నా సత్తువ చూపిస్తా. చిటికెలో కోట తలుపుల్ని తీసేయనా!"

"నీ కోరికేంటో?"

"నా కంటూ ఏ కోరికా లేదే పిల్లా! నీవేనే నా కోరిక! నీ కోరికే నాను కోరేది?"

"పో! మాఁ వా!" అని రత్తి దొర పోతాడేమో అని కాబోలు పెనవేసుకుంది.

వీరందొర రత్తి కౌగిట్లో కరిగిపోయాడు!

అప్పుడు ఇద్దరు మనుష్యులు వారి కెదురుగా వచ్చి నిలుచున్నారు! సింహంవలె లేచాడు వీరందొర! లేచాడోలేదో వాని చేతిలోని బాకు తళుక్కుమని మెరిసింది. రత్తి బుస్సు పెడుతూ కోడెనాగువలె లేచింది! ఆమె చేతిలోను బాకు మెరిసిపోయింది!

"యువదంపతులారా! మీ బాకులు మొలలో దోపండి. మేం మీకు విరోధులం కాం. మీ స్నేహి తులం—" అన్నాడొకడు.

దొర తన బాకుని మొలకి దోపుకున్నాడు రత్తి వాని చాటున నిలబడింది.

"వీరుడా! నీ పేరేమి?" మొదట మాట్లాడిన వాడు.

"చిత్తం! నాపేరు వీరందొరండి."

"వీరందొరా! మాకు కొండవీడు దుర్గాన్ని వశం చేయగలవా? నీవుకోరిన కోర్కె ఏదైనా సరే చక్రవర్తి గారు తీర్చగలరు—"

"పెరుభూ! రేపు అమావాశ్య! రాత్రి— కోడి తొలి కూత కూసేలోగా— నాను కోట తలుపుల్ని తెరుస్తా! దుర్రమ్మతోడు మారాజా! కాని మారాజులు నాను కోరింది........."

"తప్పకుండా తీరుస్తాం, వీరందొరా! నీ కోరిక ఏదో చెప్పు. అది డబ్బుగా ఉంటే ఇప్పుడే ఇస్తాం. ఎంతైనా సరే—"

వీరందొర గుండెల కడ్డంగా చేతులుపెట్టుకొని గంభీరంగా నిలబడి—

"పెరుభూ! డబ్బుకు విలువేందీ? నా ఎత్తు డబ్బుపోసినా నాకొదు మారాజా! ఇదిగో రత్తి ఇది నా గుండెకాయ! ఇది కోరింది తీర్చాల—"

"అదేదో చెప్పవోయ్!"

"మాఁ వా రహస్యంగా చెప్పు. సిగ్గేస్తాది!" అంది రత్తి.

వచ్చిన ఇద్దరూ నవ్వుకున్నారు. వారిలో రెండవ మనిషి ఇలాగన్నాడు. "వీరందొరా! రహస్యంగా నాతోరా! రహస్యంగా చెప్పు—"

వీరందొర కొన్ని అడుగులు వెళ్ళి తన ప్రేయసి కోర్కెని సన్నని స్వరంతో చెప్పాడు!

అతడు మేఘ గంభీరనినాదంవలె బిగ్గరగా నవ్వి—

"వీరందొరా ఇదేనా నీ ప్రియురాలి కోరిక! చక్రవర్తి తరఫున నేను వాగ్దానం చేస్తున్నాను, విను! తప్పకుండా నీ ప్రియురాలి కోరిక తీర్చబడు తుంది." అని వీరందొర చేతిలో చెయ్యివేసి చెప్పాడు.

ఆ చేతికున్న ఉంగరాల పొళ కాంతి జిగేలుమని మెరిసింది!

* * *

అమావాస్య రోజు—

మహారాజాధి రాజ, రాజపరమేశ్వర, మూరురాయర గండ, శ్రీ శ్రీ శ్రీ కృష్ణ దేవరాయల సేనావాహిని కొండవీడు దుర్గాన్ని అర చంద్రాకారంగా చుటు ముటి oది!

ఆ రోజు ప్రాతఃకాలంనుండి కోటని పడగొట్టే ప్రయత్నాన్ని విరమింప చేసాడు శ్రీకృష్ణ దేవరాయ చక్రవర్తి!

దాని కారణాన్నివూహించలేక తబ్బిబ్బులవుత న్నారు దండనాథులు! ఎవరికిని చక్రవర్తిని సమీ పించి కారణం అడిగే సాహసం లేదు!

గుడారాలో గానాలు, భరత నాట్యాలు,, గాన సభలు జరుగుతున్నాయి! సైనికులు మహో త్సాహంతో ఈ వేడుకల్లో పాల్గొన్నారు!

రాత్రి మొదటి జాము గడచింది. దళపతులు తమ తమ సైనికుల్ని ఈ విధంగా హెచ్చరిక చేస్తున్నారు!

"ఆంధ్ర వీరులారా! ఈ రోజు తెల్లవారేలోగా మన సైన్యం దుర్గ ప్రవేశం చేసి తీరాలని చక్రవర్తి ఆజ్ఞ! వారే స్వయంగా గజయూథాన్ని నడిపిస్తారట! దుర్గ ప్రవేశం ముందుగా చేసిన వారందరికీ విశేషంగా బహుమతులు ఇవ్వ బడుతాయి! మీరు, ఆంధ్రుల కీర్తి పతాకతోపాటు, విజయనగర వీరవరాహ పతాకని ఎగురవేసేరోజు ఇది. సూర్యోదయంతోపాటు మన వీర వరాహపతాకం కొండవీడు దురంపై ఉదయించాలి!"

ముట్టడి ప్రారంభమైంది!

చక్రవర్తి అధినేతృత్వంపై గజయూథం నల్లని మేఘమాలికలవలె పయనించింది! విజయ నగర విలుకాండ్రు వానజల్లువలె బాణం వర్షం

బురుజులపై కురిపిస్తున్నారు !

ఏనుగులు ముందుకి సాగుతున్నాయి! వాటిపైన ఉన్న విలుకాండ్రు విల్లు వంచి బాణాల్ని మెలకువతో వదులుతున్నారు!

సింహ పరాక్రముడు శ్రీకృష్ణ దేవరాయ చక్రవర్తి కోట సింహ ద్వారాన్ని ఏనుగుల గుంపుతో స్వయంగా ఢీకొన్నాడు! సింహ ద్వారాల ఇనుప మేకుల తాకిడిచే ఏనుగుల కుంభస్థలాలు చీలి రక్తపుటేరులు

# వీర ప్రేమ

ప్రవహిస్తున్నాయి.

సైనికులు బ్రహ్మాండమైన దూలాన్ని కోట తలుపులికి తాటించి బాదుతున్నారు. వీరి ప్రయత్నా సడలింపడానికి కోటలోని వీరబృందం సల సల మరుగుతున్న చమురు పైనుండి వంపుతున్నారు.

ముట్టడి భయంకర రూపం దాల్చింది!

* * *

వీరందొర చీకటి పడగానే తన్ను తాను ముస్తాబు చేసుకున్నాడు— ఒకచేత ఈటె, ఇంకొక చేత భయంకర కృపాణం, ధరించాడు— తోలు దట్టీని తొడుగుకున్నాడు. మొలచుట్టూ పంద్రెండు బాకులు పేర్చి పటకాబిగించాడు. చీమలు కరిచినా బాధించకుండా ఉండేటటు శరీరమంతా కొన్ని మూలికా ద్రవ్యాలతో వండబడిన చమురు పూసు కున్నాడు. తలకి నల్లని తలపాగా కటు కున్నాడు. కొన్ని విషహారమైన మూలికల్ని తలపాగాలో పదిలంచేసుకున్నాడు. రెండు బలమైన త్రాటి చుట్టల్ని వీపుకి కటు కున్నాడు.

ఇటి వేషంతో వీరందొర సింహ గమనంతో రత్తి ఉన్న గుడిసెకి దారి తీశాడు!

గడప ముందర రత్తి తల్లి దుర్గమ్మ కూర్చొని ఉంది!

"అక్కోయి! రత్తి ఉండాదా?"

"ఓలే! రత్తి మావ వచ్చిండు — " అని కేకవేసింది దుర్గమ్మ.

గుడిసెలోనికి దూరాడు వీరందొర.

"మాఁవా! ఇదేం వేషం?" అడిగింది.

"ఇదేనే, సిలకా, యుద్ద వేషం—" అన్నాడు వీరందొర.

రత్తి కండ్ల నీరు తిరిగింది! గత రాత్రి విషయం ఆమెకి గుర్తుకి వచ్చింది. అపాయం శకించింది ఆమె నిర్మల హృదయం — దుఃఖం పొంగి పొంగి వచ్చింది. దొరని కట్టుకొని బావురుమని ఏడ్చింది రత్తి!

వీరందొర కండు చెమ్మగిలాయి! ఆ ధీరుని విశాల వక్షం ఉబికింది! రత్తి కన్నీటిని పెదిమలతో తుడిచాడు! కురుల్ని నిమురుతూ అన్నాడు! "రత్తి ఏడవకు. నా గుండె పగిలి పోతుండాది! నన్ను చూచి నవ్వవే రత్తి! జనమ సాసువతం కాదే! మనం చేసే పనులే సాసువతమే రత్తి! ఈ శరీరం ఒకనాడు కట్టెమీద కాలిపోతాది! మన కర్మే నిలిచి ఉం టాది. నేను వీరుణి ! దొర బిడ్డని! చావుకి బయం, పొందమంటావా రత్తి? నీపై నాకు ఒల మాలిన మనసు! నీ కొరకే ప్రాపిరి వదుల్తున్నా! నీ కోరిక తీరుస్తానే రత్తి! నన్ను తిలకం పెట్టి పంపవా రత్తి! దుర్గమ్మ తోడు— మారాజుకి మాట ఇచ్చా ప్రాణం పోతే పోతాది కాని వీరందొర మాట పోదు." అన్నాడు వీరందొర.

"మాఁవా! నేనూ దొర బిడ్డనే మాఁవా! నీ రత్తి నీవెక్కడుంటే అక్కడే ఉంటుంది! ఇదిగో, నా ముద్దు— మాఁవా!" అని రత్తి నూనె ఓడుతున్న మావ శరీరాన్ని తనివి తీర కౌగలించు కొని వాని చెక్కిళ్లని మార్చి మార్చి ముద్దు పెట్టు కొంది.

ఆర్ద్ర నయనాలతో, గసప్రపూరితమైన సింధూరాధరములతో చక్కగా నవ్వింది! మొలలోని బాకుని తీసి తన కుడి బొటన వ్రేలిని సన్నగా చీరి — వీరందొర నుదుట బొట్టు పెట్టింది— వీరబాల రత్తి!!

వీరందొర మరొకసారు తన ప్రాణాధిక ప్రేయసిని బిగికౌగిలి సంభావించి గిర్రుమని తిరిగి కొండవీటి దుర్గం వైపు నడక సాగించాడు!

వీరం దొర తిన్నగా దుర్గ గుడికి వెళ్ళాడు. తాను తెచ్చుకొన్న కర్పూరాన్ని దుర్గ ముందర వెలిగించాడు!

సాష్టాంగంగా దుర్గకి నమస్కరించి నిలబడి చేతులు జోడించి అన్నాడు. "దుర్గమ్మతల్లో! నీ బిడ్డణి. దీవించు. నాను రత్తి కోరిక తీర్చేందుకు వెళ్తున్నా తల్లో! నాకు శక్తి పెసాదించు. నా రత్తిని కాపాడు."

కర్పూరపు జ్వాలలో దుర్గ కండ్లు జ్వలించాయి! చీకటి బాగా వ్యాపించింది.

వాతావరణంకూడా ప్రేయసి కోర్కెని తీర్చ డానికి వెళ్తున్న వీరందొరకి అనుకూలమయింది!

తూర్పు మెరిసింది. దాంతోపాటు ఉరుము దాన్ని అనుసరించి చండవాతం. వాతాన్ని అను సరించి కారు మబ్బుల కదలిక! నింగి అంతా అల్ల కల్లోలంగా ఉంది!

వీరందొర సముద్రంలో తిమింగలంవలె ఆ కారు చీకటిలో దూసుకొని వెళ్తున్నాడు!

దొర కొండ వెనుకనుండి ఎక్కడం ప్రారంభిం చాడు. ఒక ప్రక్క ఈటెతోను, మరొకప్రక్క కృపాణంతోను బలంగా నేలను గచ్చి ఒక్కొక్క అడుగు వేస్తున్నాడు.— వీరందొర!

ఒక నదును జాగాని చేరుకొని నిలబడి బలంగా చూచాడు! నున్నటి రాతిగోడ సహజ సిద్ధమైనది అడ్డు తగిలింది, ఆ మహా వీరునికి!

వీరందొరకి ఆ ప్రాంతమంతా కొట్టిన పిండి. అక్కడ ఉండే ఒక్కొక్కరాయి వానికి తెలుసు. ఒక మెరుపు మెరిసింది. ఆ వెల్తుర్లో తాను వచ్చిన స్థలం అనుకూలమయిందని పసిగట్టాడు!

వీపున కట్టుకొన్న త్రాటి చుట్టని తీసాడు. తన జానతో కొలచి త్రాటికి ఉరి వలయం బిగించాడు. కొన్ని గజాలు వెనక్కి తగ్గాడు. అప్పుడు మెరి సింది. వానికి కోట బురుజు నిటారుగా కన్పడింది. వలయాన్ని బలంగా త్రిప్పాడు. "జయదుర్గా" అని ఉచ్చరించి మీదికి త్రాడు విసిరాడు!

రివ్వుమని త్రాటి వలయం బురుజుకి తగు ల్కొంది! వీరందొరకి 'గురి' అన్నది జన్మ సిద్ధ మైన విద్య!

వీరందొర త్రాటిని లాగి చూచాడు. త్రాడు బురుజుకి బిగుసుకొంది! అంతే! వాడు తన లాఘవ మైన శరీరాన్ని త్రాడు పట్టుకొని మీదికి నెట్టు కొంటూ వెళ్లాడు!

కొన్ని నిమిషాలలో కోట గోడపై కాలు మోపాడు వీరందొర! వీరందొర దీర్ఘమైన నిట్టూర్పు వదిలి దుర్గకి చేతులెత్తి మొక్కాడు. క్రిందికి చూచాడు. కోటలోపలి హడావిడి వానికి కన్పించింది. వేలకొలది కాగడాలు కన్పించాయి. తాను నిలుచున్న చోటుకి తిన్నగా క్రిందికి చూచాడు. ఆ చోటు నిశ్శబ్దంగా చీకటితో మంతనం చేస్తూంది.

వీరందొర మరొక త్రాటి చుట్ట విప్పి బురుజుకి బిగించి క్రిందికి త్రాటిని వేసేసాడు! దాని సహా యంతో కోటలోపలి భాగానికి వచ్చి నిలుచున్నాడు మహా సాహసి దొరబిడ్డ!

గోడప్రక్కనే మెల్లగా అడుగులు వేసుకొంటూ నడిచాడు— దొర— కొన్ని గజాలు నడక సాగించాడు. ఎదురుగా కావలాదారు కవచధారియై వస్తుండడం గమనించాడు!

వీరందొర మొలలోని బాకుని తీసాడు! వస్తున్న సైనికుని గురి చూసి 'జయ్‌దుర్గ' అని బాకుని విసిరాడు! ఆ బాకుతో పాటు సైనికుడు క్రిందికి దొర్లాడు! వానిఊపిరి అనంతంలో కలిసి పోయింది.

ఆ సైనికుని దుస్తుల్ని తాను ధరించి కోటలోని సైనికుల మధ్య చొరబడ్డాడు— వీరందొర!

కోటలో 'హాహా'! కారాలు మిన్నుముట్టాయి! శత్రువులు! శత్రువులు! కుట్ర! కుట్ర!" అని ఎలుగెత్తి అరుస్తున్నాడు సింహద్వారాన్ని కాపాడు తున్న దళపతి!

వాని అరుపు హఠాత్తుగా ఆగిపోయింది! కారణం? వీరందొర అజేయమైన బాకు వాని కంఠనాళంలో లోతుగా గ్రుచ్చుకొంది దళపతి తోపాటు సైనికులు చెదరిన కుందేళ్ళలాగు "శత్రు శత్రువులు శత్రువులు కోటలోనికి వచ్చారు" అంటూ కేకలు వేస్తున్నారు!

వీరందొర మెరుపువలె నాలుగు ప్రక్కలా ఖడ్గచాలనం చేస్తున్నాడు! శిరస్సులు శరీరాల్నుంచి వేరగుతున్నాయి! వందలకొలది శత్రుసైనికులు కోటలో చొరబడ్డారని భ్రాంతిని పుట్టించాడు, ఆ ఆంధ్ర వీర యువకుడు!

వీరందొర సింహద్వారం యొక్క తలుపుల దగ్గరకి వచ్చాడు! పంటితో కత్తిని కరచుకొన్నాడు! కుడికాలిని ఒక బలమైన మేకకి దన్ను పెట్టాడు! తన భుజాన్ని తలుపుల అడ్డు దూలానికి ఆనించి 'జయ్ దుర్గ' అని మీదికి నెట్టాడు!

ప్రొడ్యూసర్ : మిస్టర్ నీ ఫొటో ఎప్పుడైనా పత్రికల్లో పడ్డదా?

యువకుడు : ఓ పడకేమండీ చిన్నప్పుడు నే తప్పి పోతే మా నాన్న పత్రికల్లో వేయించారు.

'మాధవ' (మద్రాసు)

ఫెళ ఫెళ శబ్దంతో అడ్డు దూలం మీదికెగసి క్రిందికి పడింది!! చేత్తో కత్తిని పట్టుకొని అడ్డు గొలుసుల్ని బలంగా మోదాడు వీరందొర! శత్రు సైనికులు తండోపతండాలుగా వీరందొరపై విరచుకుపడ్డారు!

తొలి కోడి కూసింది!!!

శ్రీ కృష్ణదేవరాయల గజయూథం కొండవీటి దుర్గంలోనికి చొరబడి పోయింది!!

గజయూథం వెనుక విజయనగర సేనావాహిని కృష్ణానదీ ప్రవాహంవలె చొరబడింది!

భయంకరమైన దొమ్మియుద్ధం చెలరేగింది! విజయనగర సామ్రాట్టు అన్ని మూలలా తానై సైనిక చాలనం కావించాడు!

వీరవరాహ పతాక జయఘోషల మధ్య కొండ వీటి దుర్గంపై రెప రెపలాడింది!!

* * *

చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయల వీరందొర ప్రక్క ప్రక్కన నిలబడి ఉన్నాడు! చుట్టూ దళపతుల అందరూ బారులు తీరి నిలబడి ఉన్నారు!

వీరందొర శరీరం అంగుళమైనా ఖాళీలేకుండా గాయాలతో నిండి మోదుగ చెట్టు పూచినట్లు బాలార్కుని కిరణాల్లో మెరిసిపోతూంది!

ఆ వీర యువకుని సుందర వదనంలో బాధతో కలిసిన హాసం నెలకొంది! "దండాలు....మా...రాజా! మాట.....ని....ల....బెట్టు....కొన్నా! మా....మాట మాట.....!!"అని పల్కాడు వీరందొర!

చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు మహామంత్రి అప్పాజీని చూచి— "అప్పాజీ! ఈ యువకుని త్యాగం నిరుపమానం! తన ప్రేయసి కోర్కెని తీర్చడానికై ఈ వీర మహావీర సింహం బలి ఐపో యింది! రత్తి కోర్కె చాల అల్పమయింది, కాని ఆమె ప్రియుని త్యాగం మహత్తరమైనది! వెంటనే ఏడువారాల నగలతోను, పట్టమహిషి ధరించే మణి మయ కిరీటంతోను, రత్తిని అలంకరించి వెంటనే తీసుకొని రండి! ఈ వీర సింహం తన ప్రియుని ఆ వేషంలో చూడడానికే శాశిస్తూంది!" అన్నాడు.

రత్తిని ఏడువారాల నగలతోను అలంకరించారు. బంగారు జరీ చీరని కట్టబెట్టారు!

ఆమె శిరస్సుపై నవరత్న ఖచితమైన కిరీటాన్ని ఉంచారు!

తన రూపాన్ని నిలువుటద్దంలో చూచుకొని మురిసిపోయింది, ఆ అమాయిక బాలిక—రత్తి!!

అప్పుడామె రూపం త్రైలోక్య సామ్రాజ్యాన్ని శాసించు ప్రచండ— చండి— ఇంద్రాణివలె అందరిని ఆశ్చర్యంలో ముంచింది!

"నా మాంవ ఏడుండాడు?" అని రత్తి ప్రక్కన ఉన్న చేటిని ప్రశ్నించింది!

అందరూ గుస గుసలాడుకొన్నారు!

"అమ్మగారూ! మీ బావ ఇక్కడే దగ్గరిలో ఉన్నారు—" అంది ఆమె.

ఇంతలో ఒక చేటిక పరుగు పరుగున వచ్చి— "రత్తమ్మగారిని ఏడువారాల నగలతో అలంకరించి వెంటనే తీసుకు రమ్మని మహామంత్రి తిమ్మరుసు గారి ఆజ్ఞ!" అని చెప్పింది.

రత్తి మనస్సు కీడుని శంకించింది!

ఆమె వెంటనే తన చిన్న బాకుని తీసుకొని తన గుండెల్లో లోతుగా గ్రుచ్చుకొని పైట కప్పు కొంది. క్షణ క్షణం వక్షోభాగం రక్తంతో ఎరు పెక్కుతూంది!

ఈ సంభవాన్ని ఎవరును గమనించలేదు!

* * *

"మాంవా! నున్ను చూడు మాంవా! ఏడు వారాల నగలతో వచ్చాను మాంవా! నా కోరిక నెరవేరింది మాంవా!" అని దొర దగ్గరగా నిలబడి ఆక్రోశించింది!

వీరందొర కండ్లు విప్పి మందహాసంతో—

"ర....త్తీ! వీరసరుగం వెళ్తున్నా! నా....అందాల అందాల....రాశిని చూ.....చా!! నీ....కోరి....కా మా......రాజు కో...రికా... నెరవే..ర్చా!!!" అని అన్నా అన్నాడు తృప్తిగా

"మాంవా! వీరసరుగం ఒంటరిగా పోమోక! నీ రత్తి నీ వెంట వస్తాది మాంవా! మా....వా అని ఎలుగెత్తి పలికి వీరబాల రత్తి, దొర గుండెలపై దొర్లి పడిపోయింది!!!

ఆ వీర మిథునం యొక్క ప్రాణాలు అనంతంలో కలిసిపోయాయి!!! చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు కొనగోటితో తన కన్నీటిని ఎగజిమ్మి ఆ వీర మిథు నానికి సైనిక అభివాదన కావించాడు!

అందరూ తమ ప్రభువుని అనుసరించారు! ★

# రకరకాల ఆవకాయలు

వి. హేమలతా కైలాసం

ఇప్పుడే చిన్ని చిన్ని మామిడి పిందెలు వచ్చేస్తున్నాయి. వీటితో ముందుగా కారం బద్దలతో మొదలు పెట్టి చివరకు ఊరగాయల వరకూ పెట్టుకు తినటం మన ఆంధ్రుల అలవాటే. ఈ ఊరగాయలు చాలా రకాలుగా పెట్టుకోవచ్చు. ఒక కిలో మిరపకాయలకి సుమారు శేరున్నర కారం అవుతుంది. శేరు ఆవాలకి సుమారు రున్నర ఆవగుండ అవుతుంది. ఆవకాయకి తొక్క దళసరి, కండలో కొంచెం పీచు, బాగా పులుపు, టెంకలో జీడిపుచ్చు ఉన్న మామిడికాయలు చాలా మంచివి.

ఇల్లాంటివి సామాన్య సైజుకాయలు పాతిక.

ఆవగుండ శేరు

కారం శేరు.

కొట్టిన ఉప్పు శేరు.

నూని మూడు శేర్లు (రెండు వీశలు)

అర్థపావు మెంతులు.

మామిడికాయలు ముక్కలు చేసుకుని జీడి ఉల్లిపొరతీసి శుభ్రం చేసి ఉంచుకోవాలి. ఆవగుండ, కారం, ఉప్పు, మెంతులు గుచ్చెత్తిన గుండలో రెండుశేర్లు నూని కొంచె కొంచెం పోస్తూ ముక్కలు కలిపి, జాడిలో ముందుకాస్త నూని వేసి ఎత్తుకోవాలి.

మూడో రోజు తిరగ కలిపి మిగతా శేరునూనె పొయ్యాలి.

ఇష్టమైన వారు ఒక తులం ఇంగువ పొడి చేసి ఆవగుండలో కలిపి ఎత్తుతారు. కొందరు అర్థశేరు సెనగలు రాయి, రప్పా లేకుండా చూసి ఆవకాయలో కలుపుకుంటారు.

పావు కిలో వెల్లుల్లిపాయలు విడతీసి నూని రాసి ఎండలో పెట్టి చాటలో చేత్తోరాసి చెరిగేస్తే తొక్కలు వచ్చేస్తాయి. ఆ వెల్లుల్లి రేకులు ఆవగుండతో కలిపి ఎత్తుతారు.

## నూపప్పు ఆవకాయ

అర్థశేరు నూగుండ

పావుశేరు కారం.

పావుశేరు ఉప్పు.

అర్థశేరు నూని.

నూపప్పు రాయీ రప్పా లేకుండా ఏరుకొని దోరగా వేయించి గుండ కొట్టాలి. పై కొలతల్లో నూగుండ, కారం, ఉప్పు గుచ్చెత్తి ఆవకాయలా కలుపుకోవాలి.



రెండో పెసరట్టు తేవడానికి మరీ యింతసేపా?? [illegible] ఆగాలేకపోయా!!

## పెసర ఆవకాయ

అర్థశేరు పెసరగుండ.

పావుశేరు కారం

పావుశేరు ఉప్పు.

అర్థశేరు నూని.

పెసరపప్పు బాగు చేసుకొని ఎర్రగా వేయించి మెత్తగా విసరాలి. పై కొలతల్లో పెసరగుండ, కారం, ఉప్పు గుచ్చెత్తి నూనితో ఆవకాయలా కలపాలి.

## కారపు ఆవకాయ

డజను మామిడికాయలు.

అర్థశేరు కారం.

అర్థశేరు ఉప్పు.

అరతులం ఇంగువ.

చారెడు మెంతులు

మూడు పావుల నూనె

కారం, ఉప్పు, మెంతులు గుచ్చెత్తాలి. మామిడి కాయను ఆవకాయ ముక్కల్లా తరిగి కారంలో నూనిపోసి కలుపుతూ ముక్కలువేసి జాడీలోకి ఎత్తి మూడు రోజులు వూరనియ్యాలి. నాలుగో నాడు ముక్కలు పిడిచి మూడు రోజులు ఎండ పెట్టి ఒక రోజు మగ్గాక మిగిలిన నూనిలో ఇంగువపొడి వేసి కాచి వూటలో ముక్కలు ఒగువ నూని వేసి కలపాలి.

## పులిహోర ఆవకాయ

ఆవగుండ పావుశేరు

కారం పావుశేరు

ఉప్పు పావుశేరు

నూని మూడర్థపావులు

చారెడు సెనగపప్పు, చారెడు మినపప్పు, కాసిని ఆవాలు, చిన్న ఇంగువ పలుకు, పచ్చిమిరప ముక్కలు, కరివేపాకు.

ఆవకాయ ముక్కల్లో చితికిన ముక్కలు తీసేసారే అవి పెచ్చుతో టెంకతీసి చిన్న చిన్న ముక్కలు తరుక్కోవాలి. ఆవగుండ, కారం, ఉప్పు, గుచ్చెత్తి నూనితో ముక్కలు కలిపి ఉంచుకోవాలి.

"స్టౌ" మీద మూకుడు పెట్టి పైన చెప్పిన పులిహోర పోపు వేయించి, చల్లారాక ఆవగుచ్చెత్తిన ముక్కల్లో వేసి కలపాలి.

కొందరు దీనిలో ములక్కాడ, దొండ, వంగ మొదలైన కూర ముక్కలు వేసి కలుపుతారు.

## మసాలా ఆవకాయ

మసాలా సరుకులు ఏడు తులాలు.

పైన చెప్పిన కొలతల్లో ఆవకాయ కలుపుకొని పులిహోర పోపు బదులు మసాలా సరుకులు వేయించి మెత్తగా గుండకొట్టి ఆవకాయలో కలపాలి.

## అల్లం ఆవకాయ

అల్లం ఏడు తులాలు.

మామిడికాయ పెద్ద ఆవకాయ ముక్కల్లా

తరిగి మసాలా బదులు అల్లం దంచి వేయించి పై కొలతల్లో కలుపుకోవాలి.

### ఆవ పచ్చడి

ఆవాలు పావుశేరు.
కారం పావుశేరు.
ఉప్పు పావుశేరు.
నూని పావుశేరు.

ఆవాలు బాగు చేసుకుని రోట్లో పోసి నీళ్లు జల్లుతూ మెత్తగా రుబ్బుకోవాలి. రుబ్బిన ఆవ పిండిని మంచి ఎండలో ఒక రోజు ఉంచి రాత్రి మామిడికాయ చిన్నచిన్న ముక్కలు తరిగి ఎండబెట్టి కారం, ఉప్పు, ముక్కల నూని ఆవపిండిలో వేసి కలపాలి.

మర్నాటి నుంచి వరసగా ఏడెనిమిది ఎండల ఎండనిచ్చి వేసుకొంటే చాలా రుచిగా ఉంటుంది. వీధిలోకి వచ్చే రాలుడుకాయి కొనిపెడితే చద్దన్నం తినే పిల్లలకి బాగుంటుంది.

మా ఆవకాయ నుంచి మిగిలినవన్నీ మూడు, నాలుగు నెలలకన్నా ఎక్కువ నిలవ ఉండవు.

### పచ్చ ఆవకాయ

పచ్చ మిరపకారం అర్థశేరు.
ఆవగుండ శేరు, మెంతులు అర్ధపావు
ఉప్పు శేరు, నూని మూడు శేర్లు.

పచ్చమిరపకాయలని బజారో అమ్ముతారు. వీటినే 'గొల్లపోలు' మిరపకాయలంటారు. పైన చెప్పిన కొలతల్లో కారం గుచ్చెత్తి ఉంచుకోవాలి.

మామిడికాయ ముందు అడ్డంగా తరువాత నిలువుగా ముచికి దగ్గర నుంచి తరుక్కోవాలి. కాయ విడకూడదు. కాయలోంచి జాగ్రత్తగా జీడి ఉల్లిపొర తీసి శుభ్రం చేసుకొని గుచ్చెత్తిన ఆవపిండిలో నూనె కొంచెంవేసి కలిపి కాయల్లో కూరుకొని జాడీలో కాస్త పోసి కాయలు పెట్టి పైన కాస్త నూనె పోసి మిగిలిన నూనె ఉంచాలి.

మూడోరోజు కాయలు చేత్తో పిడిస్తే పూట జారి జాడిలో పడుతుంది. అలా పిడిచిన కాయల్ని తొమ్మిది రోజులు ఎండలో పెట్టాలి. ఎండిన కాయలకి పైన పొక్కుల్లా వస్తయ్యి అవి చాకుతో గీకేసి పూట ఉన్న జాడీలో వెయ్యాలి. రెండో రోజు మిగిలిన నూనిపోసి మూడు రోజులు పూరనిచ్చి వేసుకోవాలి. తొమ్మిది రోజులూ పూట కూడా ఎండలో పెట్టాలి. ఈ కొలతలు పాతిక కాయలకి సరిపోతాయి.

ఏామూలు కారం కలిపిన ఆవగుండ కూడా ఇలాగే కాయల్లో కూర ముక్కల ఆవకాయ అడుగున వేసి ఉంచుతారు. ఈ కాయలు నెల, రెండు నెలలకి కాని పూరవు. కొందరు ఆవకాయ కమ్మదనానికి పావుశేరు ఆవపిండి ఎక్కువ పోస్తారు. ఇది నిలవ ఉంటుంది.

### మాగాయి

మామిడికాయకి తొక్కుతీసి పొడుగ్గా చీలికలులా తరిగి పాతికకాయల ముక్కలకి అర్థశేరు ఉప్పు, చారెడు పసుపు వేసి కలిపి మూడు రోజులు పూరనిచ్చి నాలుగోనాడు ముక్కలు పిడిచి ముక్కలు, పూట విడివిడిగా ఎండపెట్టాలి.

నాలుగోరోజున మూడు పావుల నూని కాచి అందులో తులం మంచి ఇంగువ పొడి, కాసిని మెంతులు, కాసిని ఆవాలు, కాసిని ఎండు మిర్చి ముక్కలు వేసి వేగు అర్థశేరు పోసి దింపి కలిపి చల్లార నియ్యాలి. ఈ కారం పూటలో కలిపి ముక్కలు కలపాలి. ఒక వారం రోజులు పూరాక వేసుకొంటే బాగుంటుంది. టెంకలు బాగుంటాయి. కదా అవి అన్నీ వేశారో పూట పీల్చేసి, అత్తిసరులా తయారవుతుంది.

### మెంతికాయ

మాగాయి ముక్కల్లా పూరపెట్టి ఎండ పెట్టిన పాతిక కాయముక్కలకి అరపావు మెంతులు ఎర్రగా వేయించి విసరాలి. మూడు పావుల నూని మరుగుతోంటే తులం ఇంగువ పొడివేసి వాసన వచ్చాక అరశేరు కారం వేసి కలిపి దింపి చల్లారాక పూటలో ఈ కారం మెంతిపిండివేసి బాగా కలిసేట్లు కలపాలి. కారం మెంతిపిండి కలిపిన పూటలో ఎండ పెట్టిన మామిడివేసి కలిపి వారం రోజు పూరనియ్యాలి.

### ఉల్లి మెంతికాయ

అర్ధపావు మెంతిపిండిలో అరశేరు కారం, అర్థ ఉప్పు కలపాలి. పావుకిలో వెల్లుల్లి వల్లి రేకులు మెంతిపిండిలో వెయ్యాలి. మామిడికాయ ఆవకాయ ముక్కలా తరిగి శుభ్రం చేసి అరశేరు నూనెతో మెంతి పిండి కలిపి మామిడి ముక్కలు వేసి ఎత్తుకోవాలి. ఇవి పాతిక కాయల కొలతలు.

### చెంప మెంతికాయ

పాతిక మామిడికాయలు చెక్కుగీసి ఆ చెంప ఈ చెంపా తరిగి ఉంచుకోవాలి. చెంపలు కాయ నించి విడకూడదు. అర్ధపావు మెంతులు కాసిని ఆవాలు, అరకిలో ఎండుమిరపకాయలు వేయించి అరశేర పావు ఉప్పువేసి మెత్తగా దంపాలి. దంపిన ఈ మెంతిపిండి కాయల చెంపల్లో కూరి జాడీలో పెట్టి మూడు రోజులు పూరనియ్యాలి.

నాలుగోనాడు కాయలు పిడిచి ఎండపెట్టి మర్నాడు తిరగేసి, ఆ మర్నాడు నుంచోపెట్టి ఎండనిచ్చి ఒకరోజు మగ్గనియ్యాలి. ఇల్లా మగ్గిన ఈ కాయలలో అరశేరు నూనిలో తులం ఇంగువ పొడివేసి కాచి చల్లారాక పోసి వారం రోజులు పూరనియ్యాలి.

### తొక్కుడు పచ్చడి

చెక్కుతీసి చిన్నచిన్న ముక్కలు తరిగి మాగాయి ముక్కలా పూరనిచ్చి ఎండ పెట్టాలి. నాలుగో రోజు ఈ చిన్న చిన్న ముక్కల్ని రోట్లోవేసి దంపి ఉంచుకోవాలి. అర్థశేరు నూని కాచి తులం ఇంగువ పొడి కాసిని ఆవాలు, కాసిని మెంతులు వేసి వేగాక అర్థశేరు పోసి కలిపి దింపి చల్లారాక పూటలో కలపాలి. దంపిన మామిడి ముక్కలు కూడా వేసి కలపాలి.

ఇష్టమైనవారు ఇంగువ బదులు పావు కిలో వెల్లుల్లి వల్లి నూనిలోవేసి వేయించి వేసుకోవచ్చు.

ఇంకో మాట నేను ఉప్పు అని చెప్పినది కొట్టి తాల్చిన మెత్తటి ఉప్పు. రాళ్ళది కాదు.

ఊరగాయలు తీసినప్పుడల్లా అడుగు నుంచీ కలిపి తీశాక పక్కల్ని లేకుండా సరిచెయ్యాలి. చేత్తో ఎప్పుడూ తియ్యకూడదు. తడి అసలే తగలకూడదు. చోటు ఆక్రమిస్తుందనుకొన్నా పూరగాయ కలిపి తీసుకుందుకు గుండ్రటి జాడీయే సులువుగా ఉంటుంది. ★

# వారఫలం

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| ర కు | బు గు | శు | రా |
| | వారఫలం | | |
| | | | |
| కే | చం | | |

మహేష్

3-4-1964 శుక్రవారము మొదలు
9-4-1964 గురువారము వరకు

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈవారం ప్రారంభంలో తగినంత కారణమేమీ లేకుండా మానసికాందోళన చెందుతారు. వృత్తి వ్యాపారాలలో పూర్తిగా ప్రోత్సాహం లభిస్తుంది. మీ అభిప్రాయాలను ఉన్నతాధికారుల కూడా గౌరవిస్తారు. ఉద్యోగంలో మీకు అనుకూలంగా చిన్న చిన్న మార్పులు జరుగగల సూచనలున్నాయి. కొన్ని సమయాల్లో అల్ప విషయాలకు కూడా అధిక వ్యయం చేయవలసి వస్తుంది. సోదరులతోగాని ముఖ్య బంధువులతోగాని భేదాభిప్రాయాల రావచ్చునుకాని అవి ఎట్టి విషమ పరిసి తికీ దారితీయవు. కోర్టు వ్యవహారాల్లో మాత్రం ఏ అభివృద్ధి కన్పించదు. వారం మధ్యనుంచి శరీరారోగ్యమూ, కుటుంబ పరిస్థితీ సంతృప్తికరంగా ఉంటాయి. సాంఘిక విషయాల్లో ప్రఖ్యాతి లభిస్తుంది. ప్రేమ వ్యవహారాల్లో ఎదురుచూడని ప్రోత్సాహాన్ని పొందుతారు. ఈ వారం చేసిన నిర్ణయాలు సరియైనవని భవిష్యత్తు నిరూపిస్తుంది.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ఈవారం బాగానే ఉంటుందిగాని మీ ప్రవర్తన ఇతరులకు అర్థంకాని పరిస్థితి ఏర్పడుతుంది. మీకు ఇష్టంకానివారికి అనుకూలంగాను, ఇష్టమైన వారికి ప్రతికూలంగాను వ్యవహరించవలసిన అవసరం ఏర్పడుతుంది. మీరు దూరదృష్టితో వ్యవహరించడం వలన కొన్ని అపోహలకు తాత్కాలికంగా గురి అవుతారు. వృత్తి వ్యాపారాల్లో వ్యతిరేకత ఉండదుగాని అన్ని వ్యవహారాలూ చాలా మందంగా ఉంటాయి. వారాంతానికి అన్ని విషయాలూ సక్రమంగా ఉన్నాయనే సంతృప్తి మీకు ఏర్పడుతుంది. రావలసిన డబ్బు అందుతుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో అనుకూలత లభించగల సూచనలున్నాయి. శుభమూలంగా ధన వ్యయం జరుగుతున్నది. స్పెక్యులేషను వంటి సాహస కార్యాల్లో స్వల్పలాభం రావచ్చును. ప్రయాణాలోచనలు రావచ్చునుగాని ప్రస్తుతం వాయిదా వేయడం మంచిది.

* * *

## మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఒడుదుడుకులు రాగల సూచనలున్నాయి. ప్రతిరంగంలోను మీరు తీవ్రమైన పోటీని ఎదుర్కోవలసి ఉంటుంది. ఆదాయం పెరుగుతుంది. ఆర్థికంగా బాగా ఉన్నా మానసికాందోళన తప్పదు. స్థిరాస్తి వ్యవహారాలకు భాగస్తులతో చేరి చేసే వ్యవహారాలకు ఇది మంచి సమయంకాదు. ప్రతి విషయానికి జాగ్రత్త చాలా అవసరం. ఎంత శ్రమపడి ప. చేసినా అధికారుల వల్ల ఆదరణా గుర్తింపూ లభించే అవకాశం లేదు. రాజకీయాల్లో ఏ మాత్రం అశ్రద్ధగా ఉన్నా పరాజయ ప్రమాదమున్నది. శుభకార్యాల విషయంలో మీ ఇష్టప్రకారం వ్యవహరించడం కన్న బంధువుల సలహా ప్రకారం నడవడం మంచిది. ప్రేమ వ్యవహారాల్లో అభివృద్ధి కన్పించదు. వారం మధ్య భాగం కంటే ఆద్యంతాలు బాగా ఉంటాయి.

* * *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

కొద్ది చికాకులు, శ్రమా కల్గినా మొత్తం మీద అనుకూలమైన కాలమని చెప్పవచ్చును. వ్యాపారస్తులకు ఆకస్మిక ధన లాభం కల్గుతుంది. ఉద్యోగస్తులకు అనుకూలమైన మార్పులకు అవకాశముంది. మీ అభిప్రాయాలు అమలు పరచడానికి అవకాశము, అధికారుల ఆదరణా, లభిస్తుంది. ఇతరులతో కలిసి చేసే వ్యవహారాలు బాగా ప్రోత్సాహకరంగా ఉంటాయి. వస్త్రాలంకార వస్తువులను కొంటారు. కుటుంబంలో ఆరోగ్యం, సంతోషం బాగా ఉంటాయి. మీకు ఇష్టులుగా నటిస్తున్న వారే మిమ్మల్ని మోసగించే అవకాశమున్నది. కాబట్టి శత్రువుల యెడలకంటె మిత్రులయెడ జాగ్రత్త అవసరం. ఇంతవరకు బంధువులలో ఉన్న భేదాభిప్రాయాలు తొలగి పోయి అందరూ మీ మాటను మన్నిస్తారు. నూతన విషయాల్ని తెలిసికొనడం ద్వారా మీ విజ్ఞానాన్ని పెంపొందించుకొంటారు. 8,9 తేదీలలో అనారోగ్యం.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

వృత్తి వ్యాపారాలు మామూలుగా జరిగి పోతాయి. పెద్ద మార్పులుండవు. ఆదాయం పెరగక పోయినా రావలసిన డబ్బు సమయానికి అందుతూ ఉండడం వలన ఆర్థికంగా బాగానే ఉన్నట్లు కన్పిస్తుంది. వ్యాపారస్తులు భారీయెత్తున మార్పులు ఇప్పుడు చేయడం కంటే యథాతథంగా ఉంచి వేయడం మంచిది. ఉద్యోగస్తులు ఉన్నత స్థానంకోసం చేసే ప్రయత్నం ఫలించవచ్చును. తటస్థంగా ఉందామని మొదట్లో ఎంత అనుకొన్నా స్నేహితుల వ్యవహారాల్లో జోక్యం కలుగజేసి కొనడం, అందువల్ల కొంత మందికి అసంతృప్తి కలుగజేయడం జరుగుతుంది. ఇదివరకు మీరు జరిపిన ఆర్థిక వ్యవహారాల్లో కొన్ని చిక్కులు రాగల సూచనలున్నాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ పరిస్థితులు సంతృప్తికరంగా ఉంటాయి. 3,4,5 తేదీలలో సంతోషం పుణ్య కార్యాచరణ.

* * *

### — ఈ వారము ధరలు —

కందులు, పెసలు, సెనగలు మొదలైన అపరాల ధరలో పెద్ద మార్పులుండవు. ధాన్యం ధరలో ఒడుదుడుకులు రావచ్చును. పసుపు బెల్లం ధరలు కొంచెం పెరుగుతాయి. నూనె, నువ్వుల ధర కూడా పెరగవచ్చును. అలంకార వస్తువుల ధరలు తగ్గుతాయి.

## కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారం మీరు ప్రయోజనం లేని శ్రమ పడవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో అవస్థ పడడం మీరు, అనుభవించడం మరొకరు అయే పరిస్థితి ఏర్పడుతుంది. ఆర్థికంగా పెద్ద మార్పులుండవు. కాని మిగిలిన వ్యవహారాల్లో ఏర్పడిన అననుకూల పరిస్థితి వలన సంతృప్తిని పొందలేరు. సాంఘిక కార్యాలు అనుకూలంగా ఉంటాయి. విద్యారంగంలో మీ బుద్ధి చురుకుగా పనిచేస్తుంది. కుటుంబ వ్యవహారాలు ఏ ఒడుదుడుకులు లేకుండా జరిగిపోతాయి. శుభ కార్యాల విషయంలో స్వల్పమైన అభివృద్ధిని సాధిస్తారు. ప్రేమ వ్యవహారాల్లో కొత్త వ్యతిరేకత కన్పిస్తుంది. ఆరోగ్యం గత వారం కంటే బాగుంటుంది. కాని జారి పడడంవంటి ప్రమాదం సంభవించగల సూచనలున్నాయి. చిన్న ప్రయాణాలు చేయవలసి వచ్చును. 6,7 తేదీలలో అనుకూల వార్త.

* * *

## తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

అన్ని విధాలా అనుకూలమైన సమయం. మీరు ఇదివరకు చేసిన కృషి కి తగిన ప్రతిఫలమును పొందుతారు. ఉద్యోగస్తులకు పూర్తిగా అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. ఇదివరకు చులకనగా చూసిన అధికారులే మీ శక్తి సామర్థ్యాలను గుర్తిస్తారు. ఉన్నత స్థానం కోసం ప్రయత్నం చేయడానికి మంచి సమయం. సాటి వారితో కొన్ని భేదాభిప్రాయాలు రాగల సూచనలున్నాయి గాని మీరు శాంతంగా ఉన్నట్లయితే మీ అభిప్రాయం ప్రకారమే అందరూ నడుచుకొంటారు. సాహస వ్యాపారాల్లో కొంచెం ఫలించే సూచనలున్నాయి. రాజకీయాల్లో మీరు

# అతి తేలిక
# మీకు
# కావలసిందల్లా




# మాత్రమే

## నేషనల్ అండ్ గ్రిండ్లేస్‌లో
## సేవింగ్స్ బ్యాంక్ అకౌంట్
### ప్రారంభించడానికి



బ్యాంక్ ఛార్జీలు లేవు - పైగా సాలీనా నూటికి రు. 3/-లు వడ్డీకూడా మీకు లభిస్తుంది.

నేడే మీకు సమీపంలోవున్న బ్రాంచికి వెళ్లండి:

## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

(యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది. మెంబర్ల బాధ్యత పరిమితం) NGB/61 TEL

బ్రాంచీలు: మద్రాసు: 3, నార్త్ బీచ్ రోడ్డు; 378 నేతాజీ సుభాస్ చంద్రబోస్ రోడ్డు, (టామిల్స్ బ్రాంచి); 6, ఆర్మీనియన్ స్ట్రీట్; 158, మౌంట్ రోడ్డు. హైదరాబాద్: అబీద్ రోడ్.

ఇంతవరకు వూహించని అనుకూల పరిణామాలు కల్గుతాయి. మీ ఆరోగ్యం బాగానే ఉంటుంది. కాని కుటుంబంలో మిగిలినవారి ఆరోగ్యం అంత బాగా ఉండదు. ముఖ్యమైన నిర్ణయాలు ఈ వారం చేయడం మంచిది.

* * *

## వృశ్చికం :

(విశాఖ 4–వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారం గతవారంకంటే బాగా ఉంటుంది. కాని పూర్తిగా అనుకూలమని చెప్పడానికి వీలు లేదు. ప్రతి పనిలోనూ ఏదో ఒక సంశయము కల్గుతూ ఉండడం వలన సాహసించి ఏ పని చేయ లేరు. వృత్తి వ్యాపారాల్లో మీ ప్రయత్నం ఏమీ లేకుండానే కొన్ని మార్పులు జరుగుతాయి. వాటి వలన ప్రస్తుతం మీకు ప్రయోజనం లేదు గాని ముమ్ముందు అవి బాగా ఉపకరిస్తాయి. రావలసిన డబ్బు చేతికి రావడం వలన ఇబ్బంది లేకుండా ఈ వారం గడిచి పోతుంది. విద్యార్థులు నూతన విషయాలును గ్రహించగల్గుతారు. శుభ కార్యాల విషయంలో మీ ప్రయత్నాలు దూరపు బంధువుల సహాయము వలన ఫలించగల అవకాశమున్నది. కొత్త వారితో పరిచయం ఏర్పడుతుంది. కొన్ని సందర్భాల్లో ఆడంబరం కోసం వ్యయం చేయవలసి వస్తుంది. 6,7 తేదీల్లో కుటుంబ సంతోషం ధనవ్యయం.

* * *

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

గత వారం వలెనే ఈ వారం కూడా ఉంటుంది. పెద్ద మార్పులేమీ జరుగవు. ఇది వరకు మీ వల్ల ఉపకారం పొందిన వ్యక్తులే మీకు వ్యతిరేకంగా ప్రవర్తించడం వలన వ్యాపారంలో కొంత విషమ పరిస్థితి ఏర్పడవచ్చును గాని మీరు ధైర్యంగా వ్యవహరిస్తే ఏ నష్టమూ లేకుండా తప్పించుకొన వచ్చును. ఉద్యోగస్థులకు కార్యభారం పెరుగుతుంది. మీకు సంబంధించని వ్యవహారాల్లోమీరు చిక్కు కొనడం వల్ల కొంత శ్రమ చెంద వలసి వస్తుంది. సాంఘిక కార్యక్రమాలు ఈ వారం వాయిదా వేయడం మంచిది. ఎంత శ్రమ పడినా రాణింపుకు రాదు. దగ్గర బంధువులకు అనారోగ్యం చేయ వచ్చును. సంతానానికి సంతోషం ఆరోగ్యం ఉంటుంది. ప్రయోజన శూన్యమైన ప్రయాణాలు చేయ వలసి వస్తుంది. వారాంతానికి అన్ని విషయాలూ అనుకూలంగా ఉంటాయి.

* * *

## మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా,
శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు.)

వృత్తి వ్యాపారాల్లో పరిస్థితులు పైకి ప్రశాంతంగా ఉన్నట్టు కన్పిస్తాయి గాని మీరు ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా నష్టం రాగల సూచనలున్నాయి. అన్ని వ్యవహారాల్లోనూ సత్పురుషుల సహాయం మీరు పొందగల్గడం వలన కొంత అభివృద్ధిని సాధిస్తారు. స్థిరాస్థి వ్యవహారాలు మీకు అను కూలంగా పరిష్కారము కావచ్చును. గృహ నిర్మాణాది కార్యక్రమాల్లో కొంత అభివృద్ధి సాధిస్తారు. రావలసిన డబ్బు సమయానికి అందక చిక్కుపడ వలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో మీకు పోటీగా ఉన్నవారికి కొన్ని చికాకులు కలగడంవలన మీకు వారివల్ల పోటీ, ఒత్తిడి తగ్గుతుంది. రాజకీయాల్లో మీ ప్రజ్ఞకు గుర్తింపూ, తగిన స్థానం లభిస్తాయి. విద్యారంగంలో ఆసక్తి పెరుగుతుంది. మొత్తం మీద పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది.

* * *

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం,
పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఇంతవరకు మీ వృత్తి వ్యాపారాల్లో ఉన్న అనిశ్చిత పరిస్థితి తొలగిపోయి క్రమక్రమంగా అనుకూలంగా మారుతుంది. కాని ఏ విషయంలోను ఇతరుల సహాయాన్ని నమ్మి భారీ ప్రయత్నాలు చేయడం మంచిది కాదు. కొత్తవారితో స్నేహం లభిస్తుంది. అధికారుల వలన జరుగవలసిన పనులు కొంచెం శ్రమమీద నెరవేరుతాయి. వైజ్ఞానిక కళా రంగాల్లో ప్రతిష్ఠ లభిస్తుంది. వృత్తిలో కార్య భారం పెరుగుతుంది. దానితోపాటు ఆదాయం కూడా పెరుగుతుంది. కుటుంబ పరిస్థితి మాత్రం అంత సంతృప్తికరంగా ఉండదు. ఎవరికో ఒకరికి అనారోగ్యం చేస్తూ ఉంటుంది. శుభ కార్యాల విషయంలో స్వల్పంగా అభివృద్ధి కన్పిస్తుంది. అలంకార వస్తువులుకొంటారు. 3, 4, 5 తేదీలలో ధనలాభం. మిత్ర సమాగమం.

* * *

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో గత వారం కంటే ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయడం మంచిది కాదు. ఆర్థికంగా ఈ వారం అంతా బాగానే ఉంటుంది గాని కొంత మంది మిత్రులకు సహాయపడడం వలన మీ కార్య క్రమంలో కొంత మార్పు రావచ్చును. ఉద్యోగస్థులు మార్పుల కోసం ఇప్పుడు ప్రయత్నం చేయడం మంచిది కాదు. స్త్రీ మూలంగా కలహం రావచ్చును. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. కోర్టు వ్యవహారాల్లో ఇంతవరకూ ఉన్న వ్యతిరేకత తొలగిపోతుంది. కుటుంబ సంతోషం, పుణ్యకార్యాచరణ జరుగుతాయి. అన్నిటికీ ధైర్యంగా వ్యవహరించవలసిన సమయం. 3,4 తేదీలలో వృత్తిలో అనుకూలమైన మార్పు.

# జన్మదినఫలం

## ఏప్రిల్–3

ఈసంవత్సరం మీరేమీ ఘన విజయాలు సాధించ లేకపోవచ్చునుగాని గత సంవత్సరంకంటే బాగా ఉంటుంది. అన్ని వ్యవహారాల్లోనూ క్రమాభివృద్ధిని సాధిస్తారు. వృత్తి వ్యాపారాల్లో ఇంతవరకూఉన్న క్లిష్ట పరిస్థితులు తొలగిపోతాయి. ఆదాయం పెరగ గకపోయినా మానసికంగా శాంతి లభిస్తుంది. కుటుంబ సమస్యలు పరిష్కారం కావడానికి ఇంకా కొంత కాలం పట్టవచ్చును. శుభ కార్యాల విషయంలో బంధువుల మూలంగా అనుకూలత సిద్ధిస్తుంది. రాజకీయాల్లో మీస్థానం నిలబెట్టుకొంటారు. ముమ్ముందు ఇంకా రాణించడానికి అవకాశమున్న పరిస్థితులు ఏర్పడతాయి. సంవత్సరం ప్రారంభం లోకంటే ఆఖరున బాగా ఉంటుంది. వైద్యులకు వ్యవసాయదారులకు మంచి కాలం. అక్టోబరు, నవంబరు నెలల్లో అనారోగ్యం.

## ఏప్రిల్–4

ఈ సంవత్సరం అనుకూలమైన కాలమని చెప్పవచ్చును. వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆదాయం పెరుగుతుంది. భాగస్థులతోచేరి నూతన వ్యాపారాలను ప్రారంభిస్తారు. అధికారులవలన జరుగవలసిన పనులు నెరవేరుతాయి. సాంఘిక కార్యక్రమాల్లోను, కుటుంబ వ్యవహారాల్లోను కొన్ని చిక్కులు కలుగవచ్చును. సాంఘిక కార్యాల్లో మాట పట్టుదలవల్ల మీకు ఆర్థికంగా నష్టం వచ్చే పరిస్థితి ఏర్పడవచ్చును. కాని మీ గౌరవాన్ని నిలబెట్టుకొనగల్గుతారు. కుటుంబంలో ఎవరికో ఒకరికి అనారోగ్యం చేస్తూ ఉంటుంది. ప్రేమ వ్యవహారాలలో ప్రోత్సాహం ఉండదు. ఉద్యోగస్థులు అనుకూలమైన స్థానమునకు మారగల సూచన లున్నాయి. వర్క్ షి వ్యాపారస్థులకు, ఇంజనీర్లకు ఈ సంవత్సరం బాగా రాణిస్తుంది. ఆగస్టు, సెప్టెంబరునెలల్లో యత్నకార్యసిద్ధి.

## ఏప్రిల్–5

ప్రతి వ్యవహారం హోరా హోరీగా పోరాడితేనేగాని అనుకూలపడదు. వృత్తి వ్యాపారాల్లో శారీరకంగాను మానసికంగాను శ్రమపడవలసిన అవసరం ఏర్పడుతుంది. వ్యాపారస్థులు లాభ నష్టాలు రెండూ పొందినా మొత్తంమీద లాభం సంపాదిస్తారు. ఉద్యోగస్థులు ఉన్నతస్థానం కోసం సంవత్సరాంతంలో ప్రయత్నం చేయవచ్చును. కోర్టు వ్యవహారాల్లో ఒడుదుడుకులు రాగల సూచన లున్నాయి. మొదటినుంచీ జాగ్రత్తగా ఉండడం అవసరం. రాజకీయాల్లో ప్రతిపక్షాల ఒత్తిడిని తట్టుకోవలసి వస్తుంది. కొత్తవారితో పరిచయం కలుగుతుంది. తద్వారా మీకు అన్ని విధాలా ప్రయోజనముంటుంది. బంధువులతో కలహం రావచ్చును. విద్యార్థులు మొదటినుంచీ కష్టపడి చదవడం మంచిది. దూర ప్రయాణాలు చేస్తారు.

## ఏప్రిల్–6

వృత్తి వ్యాపారాలు పైకి కనిపిస్తున్నంత ప్రశాంతంగా ఉండవు. మీరు ఏ మాత్రం అశ్రద్ధగా ఉన్నా నష్టం వస్తుంది. మీకు స్నేహితులుగా నటిస్తున్న వారే అపకారం చేయడానికి ప్రయత్నిస్తారు. వ్యాపారంలో భారీ ఎత్తున మార్పులు చేయడానికి ఇది సమయంకాదు. ఉద్యోగస్థులకు శ్రమ పెరుగుతుందిగాని

అధికారుల మన్ననా, గుర్తింపూ లభించవు. స్థిరాస్థి వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కావచ్చును. మీకు ఇష్టం లేకపోయినా ఆడంబరం కోసం ఖర్చు చేయవలసి వస్తుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగ ఉంటాయి. కళత్ర సౌఖ్యం, సంతానానికి ఆరోగ్యం ఉంటాయి. పుణ్యకార్యాలు నిర్విఘ్నంగా నెరవేరుతాయి. విద్యార్థులు సామాన్యంగా కృతార్థు లవుతారు. కళాకారులకు, ఆహార పదార్థ వ్యాపారులకు మంచి కాలం.

## ఏప్రిల్-7

జరిగిపోయిన మూడు నాలుగు సంవత్సరాలకంటే ఈ సంవత్సరం చాలా బాగుంటుంది. వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. రాదనుకొన్న డబ్బు కూడా వస్తుంది. దీర్ఘకాలానికి ఫలితాన్ని ఇచ్చే పెద్ద ప్రయత్నాలు ఇప్పుడు చేయడం మంచిది. అధికారుల వలన జరుగవలసిన పనులు శ్రమ లేకుండా నెరవేరుతాయి. ఉద్యోగస్థులకు తమ వ్యూహాలు అమలు జరపడానికి అవకాశం లభిస్తుంది. ఇన్నాళ్ళూ ఎదురుచూసిన ఫలితం ఇప్పుడు చేతికందుతుంది. సాంఘికంగా కీర్తి లభిస్తుంది. శుభ కార్యాల విషయంలో అన్ని పనులు మీరు అనుకొన్నట్లుగా జరుగుతాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులవుతారు. అన్ని విధాలా రాణించే సమయం. ప్రేమ వ్యవహారాల్లో అభివృద్ధి ఉంటుంది.

## ఏప్రిల్-8

ఈ సంవత్సరం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. ప్రతి వ్యవహారంలోను, ఎన్నో ప్రయత్నాలుచేసి నెరవేరక నిస్పృహ చెందిన తరువాతగాని ఏపనీ నెరవేరదు. వృత్తి వ్యాపారాల్లో సంవత్సరం మధ్యలో వ్యతిరేకత ఏర్పడవచ్చును. మిగిలిన వ్యవహారాలు ఎలా ఉన్నా, ఆర్థికంగా అంత ఇబ్బంది ఉండదు. ఏదో ఒక డబ్బు అందుతూ ఉంటుంది. వ్యయం కూడా పెరుగుతుంది. ఉద్యోగస్థులు అనుకూలమైన స్థలమునకు మార్చబడవచ్చును. కోరు వ్యవహారాల్లో ఏ అభివృద్ధి ఉండదు. కుటుంబంలో పెద్దవారికి అనారోగ్యం చేస్తుంది. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులవుతారు. సంవత్సరమంతా ఏదో ఒక విధంగా మానసికాందోళన ఉంటుంది. ఇది మీ ఓర్పుకు పరీక్షా సమయం. జనవరి, ఫిబ్రవరి నెలల్లో ధనలాభం.

## ఏప్రిల్-9

ఈ సంవత్సరం చాలా చిత్రంగా ఉంటుంది. మీరు ఎంతో ప్రయత్నం చేసినా పనులు నెరవేరకపోవడం ప్రయత్నం చేయని పనులు నెరవేరడం జరుగుతుంటాయి. వృత్తి వ్యాపారాల్లో పెద్ద మార్పులుండవు. అంతా యధాతథంగా జరిగిపోతుంది. ఆరోగ్యం గత సంవత్సరంకంటే బాగా ఉంటుంది. గాని జారిపడడం కాలడంవంటి ప్రమాదాలు కలుగతచ్చును. బంధువులలో కల్గిన అభిప్రాయ భేదాలవలన శుభకార్యాచరణకు ఆటంకం రావచ్చును. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలువైన వస్త్రాలంకార వస్తువులను కొంటారు. వైజ్ఞానిక కళారంగాల్లో మీ బుద్ధి చురుకుగా పని చేస్తుంది. మీ అభిప్రాయాలను అందరు గౌరవిస్తారు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులవుతారు. న్యాయవాదులకు వస్త్ర వ్యాపారులకు మంచి సమయం.

★






ఆ ఉగాదిని శేషగిరి ఎప్పుడూ మర్చిపోలేడు. ఎందుకంటే......

పూర్వం శేషగిరి నెప్పుడైనా, అంటే మేలు కున్నప్పుడైనా, నిద్రలోనైనా నీకు ఇష్టం లేనివి మూడు చెప్పమంటే, తన ఆటోమాటిక్ రిస్టు వాచీ, అత్తగారు చేసే ఆవడలు, అవి తినడానికి అత్తవారివూరి బస్సుస్టాండు నుంచి ఇంటిదాకా వెళ్ళడానికి ఉపయోగించే ఒంటెద్దు బండీ అని చెప్పేవాడు. అతని అయిష్టత అకారణమైనదికాదు. విధానం మీద అనుభవము మీద పెంచుకున్నది. ఇంటర్ పాస్ అవగానే అతను ముచ్చటపడు తున్నాడని వాళ్ల నాన్నగారు అది కొని ఇచ్చారు. అది ఆటోమాటిక్‌ది అవడంచేత రోజుకి కొన్ని గంటలైనా చేతినుంటే కాని పని చెయ్యదని ప్రజంటు చేస్తూ వాళ నాన్నగారు చెప్పారు. కొత్త చొక్కా మాసేదాకా విప్పకుండా చిన్న పిల్లలు వేసుకుని తిరిగే విధంగా అతను దాన్ని ఒక క్షణం గూడా విడిచి ఉండేవాడు కాదు. కాలం ఒక్కరీతిగా ఉండదు కదా! అతను ఇంజనీరింగ్‌లో చేరిన కొద్ది నెలలకే క్రికెట్ మాచీ ఆడుతుంటే బంతి తగిలింది రిస్టు వాచీకి. అది వాటర్ ప్రూఫ్, షాక్‌ప్రూఫ్ అని కొంచెం అశ్రద్ధ చేశాడు. కోతి వుండు బ్రహ్మరాక్షసి అయిందన్నట్టు అది రోజూ కొన్ని నిమిషాలు ఆగడంతో మొదలుపెట్టి, వారం అవ్వా తిరగకముందే రోజుకి కొన్ని గంటలు ఆటోమాటిక్‌గా ఆగిపోవడం మొదలు పెట్టింది. అందు కని రిపేరు కిచ్చాడు. రిపేరు అంటూ మొదలు పెట్టాలేగాని అవి ఆగకుండా అవిఘ్నంగా సాగి పోతాయని కొద్దికాలంలోనే గ్రహించాడు. అది క్లాసులో ఆగిపోతూ ఉండటం చెయ్యి విదల్చటం, వూడదీసి వూపడం, గట్టిగా కుదపటం, ఎగరేసి పట్టుకోడం ఇవన్నీ చేస్తూ ఉండేవాడు. మధ్య మధ్యలో ఎవరిచేతనైనా బాగుచేయిస్తూ ఉండేవాడు. ఒక వాచీ ఉండగా చూస్తూ చూస్తూ మరొకటి కొనలేడు గదా! ప్రాక్టికల్ పరీక్షలలో టైము ఆ వాచీలో నోట్ చేసుకోడం వల్ల సరియైన ఆన్సర్ రాకపోవటం తరువాత యధాశక్తి కిట్టించి పాస్ అవడం జరిగింది. ఇదంతా ఎందుకు చెప్తున్నా నంటే అతనికి ఆ వాచీమీద ఉట్టినే అయిష్టత కలుగ లేదని చెప్పటానికి. పెళ్ళిలో మామగారు కొత్తది యివ్వకపోతారా అనుకున్నాడు. ఆయన యివ్వకపోయారు, ఆయన మొహమాటానికి మాట వరుసకి కూడా కొత్తవాచీ కొనుక్కోవోయ్ అన లేదు. బహుశా అతనికి ఒకటి ఉందికదా అని అనుకుని ఉంటారు.

శేషగిరికి సాసం ఆవడలు యిష్టమే కాని అత్త గారు చేసేవి కావు. అతని భార్య శకుంతలని తీసు కుని ఎవర్నో స్నేహితుల్ని చూడ్డానికి అతనికి పెళ్లయిన కొత్తలో వెళ్ళాడు. వాళ్ళు ఆవడలు పెడ్తే తిని మరోరెండు అడిగి వేయించుకున్నాడు. ఆ విషయం శకుంతల వాళ్ళ అమ్మతో చెప్పినట్టు ఉంది. ఆవిడ శేషగిరి ఆవూరు ఎప్పుడు వెళ్ళినా ఆవడలు చేస్తుంది. అవి ప్రేమను తిరస్కరించే యువతి హృదయమంత గట్టిగా ఉంటాయి. సెలవు అడిగితే అధికారి అనే మాటలంత కర్కశంగా ఉంటాయి. ఈ మాట పైకి అనలేడు. ఆవడలు లోపలికి మింగనూ లేడు. శేషగిరికి తను చదువు కనే రోజులు గుర్తుకు వస్తాయి. తను చదువుకునే రోజుల్లో తన రూమ్మేట్సులో చాలా బాగా పాడగలిగిన ఒకతను ఉండేవాడు. తనెప్పుడైనా పాడితే "శేషగిరీ ఆ పాట నాకు చాలా ఇష్టమోయ్" అనే వాడు. "నీ కేమిటి నాకూ ఇష్టమే" అనే వాడు తను. "మరి అల్లా అయితే దాన్ని ఎందు కల్లా ఖూనీ చేస్తావోయి" అనే వాడు అతను. ఎవరికైనా ఇష్టమైనవి ఇతర్లు నామ రూపాలు పోల్చుకోలేకుండా చేస్తే ఎంత బాధ పడుతారో అత్తగారి ఆవడలు రుచి చూసాక శేషగిరికి తెల్సింది. అయినా శాంతియుత గృహజీవనంలో సర్దుకుపోక తప్పదు.

ఇంక మూడోది శేషగిరి అత్తవారి వూరు పశ్చిమ గోదావరిజిల్లాలో ఓ పల్లెటూరు. ఆ పల్లె టూరు చేరటానికి ప్రపంచంలో భూమి మీద నడిచే ఎన్ని ప్రయాణ సౌకర్యాలు ఉన్నాయో అన్నీ ఉపయోగించాలనేది అతిశయోక్తి గాదని శేషగిరి ఉద్దేశం. ఆ వూరు పేరు నేను చెప్తే ఆ వూరి వాళ్లకి కోపం వస్తుంది. కనుక పేరు మాట వదిలేద్దాము. కాని వెళ్లే విధానం చెప్తాను. మీరే పోల్చుకోండి. విశాఖపట్నం నుండీ వెళ్లే వాళ్ళు నిడదవోలులో రైలుమారి కొంత దూరం పోయి అక్కడ దిగి బస్సు ఎక్కి మరికొంత దూరం

వెళ్తే అది శేషగిరి అత్తవారి వూరికి సరిగ్గా రెండు మైళ్ల దూరంలో దింపుతుంది. అక్కడ్నుంచీ ఒంటెద్దు బండిలోనో, అదృష్టం వెంటాడితే గుర్రపు బండిలోనో శేషగిరి అత్తవారి వూరు చేరవచ్చును. అందుకని శేషగిరి, అత్తవారు రమ్మని పిలిచినా అడపా తడపా ఏదో వంకపెట్టి వెళ్లడం మానేస్తూ వచ్చాడు. పెళ్లయి మూడేళ్లు అయినా అతనికి సిగ్గు పోలేదు అనుకునేవారు శకుంతల తల్లీ తండ్రీని.

అందుకని ఉగాది ఇంకా వారం రోజులుందనగానే శేషగిరి బావమరది సారథి వచ్చాడు అన్నయ్యను, బావను, మేనల్లుణ్ణీ తీసుకు వెళ్దామని. వచ్చినవాడు దుమారంలా వచ్చి ఆఫీసుకు పోయి శేషగిరికి సెలవు దొరకడంలో పెద్ద ఇబ్బంది ఉండదన్న విషయం తెలుసుకుని మరీ వచ్చాడు. కనుక శేషగిరికి ఈ సారి అత్తవారి వూరికి ప్రయాణం కట్టక తప్పలేదు. శకుంతలకి తన స్నేహితురాళ్లంతా కూడా పండుగలకి పుట్టిళ్లకి వస్తే చూద్దామని మహా సరదా పడింది. పెద్ద పెట్టున సర్దడాలు సాగించింది. ఉండే మూడు రోజులకీ తనకి, భర్తకి, రెండేళ్ల కొడుక్కీ కలిపి మూడు పెట్టెల సామాను సర్దింది. తక్కువ సామాను. ఎక్కువ ప్రయాణ సుఖం అన్న విషయం గురించి శేషగిరి చిన్న ఉపన్యాసం ఇచ్చాడు. అత్తవారి వూరు వెళ్లవలసి వచ్చినందుకు కలిగిన కోపం ఇందులో మేళవించి.

"అదేమిటండీ మా వూరు వెళ్తే ఎంతో మందిని చూడాలి. ఒక్క చీర ఒకసారికంటే ఎక్కువసార్లు కట్టుకుంటే ఈవిడకు ఇంక చీరలు లేవు కాబోలు అనుకుంటారు. వాడేమో నిముషానికి వోసారి బట్టలు మాపేస్తాడు. ఇంకపోతే మీ బట్టల పెట్టె కావాలంటే తేవడం మానేస్తాను. అయినా వెళ్లేది అత్తవారి వూరు. పైగా ఇంజనీరు అంటే మా వూళ్లో చాలా పెద్ద ఉద్యోగం అనుకుంటారు. మీరు శుభ్రమైన బట్టలైనా వేసుకోకపోతే ఎల్లా ?" అంది.

శేషగిరి ఆ వాగ్ధోరణికి నిరుత్తరుడయ్యాడు. ఎసెంబ్లీల్లోను, పార్లమెంటులోనూ అందరూ ఆడవాళ్లే అయితే .... అతను వూహించుకోలేకపోయాడు. బయటికి వెళ్లి రిక్షాలు తెచ్చాడు. సారథి సామాను ఎక్కించి మేనల్లుణ్ణి తీసుకుని బండీ ఎక్కేసి "మీరు వెనక నుంచీ రండి" అని కేక పెట్టాడు.

శేషగిరి శకుంతల వెనకాతల రిక్షాలో స్టేషను చేరేసరికి బావమరిది టిక్కెట్లతో సహా ఎదురయ్యాడు. "ఆహా ! మావగారు ఎంత ఉదారులో కదా" అని అనుకుని శేషగిరి ఉషారుగా ఈల వేయబోయే సరికి ఈలోపల గార్డు ఈల వేశాడు. కూలీల కోసం చూడకుండా సారథి ఒకటి శేషగిరి మరొకటి పెట్టెలు తీసుకుని శకుంతలకి పిల్లాణ్నిచ్చి పరిగెత్తి రైలెక్కేసి కుంతల్నీ పిల్లాణ్ణీ లోపలికి లాగేసి అమ్మయ్య అంటూ కూర్చున్న శేషగిరి అయ్య బాబోయి అంటూ లేచాడు రైల్వే వారి పెంపుడి నల్లి ముద్దు పెట్టుకోడంతో. జన సామాన్యం ఎక్కే మూడో తరగతిలోనే కాని, ఎక్కువగా రైల్వే ఉద్యోగులతోను, వారి బంధువర్గంతోను కిటకిటలాడే పై తరగతుల్లో నల్లులుంటాయా! అని మనం ఆశ్చర్యపడక్కరలేదు ఏ మూడో తరగతి ప్రయాణీకుడో జనసమ్మర్దం వోర్చుకోలేక గాని, ఇతర్ల డబ్బు అవటం చేతకాని ఒక్కొక్కప్పుడు క్రింద తరగతి నుంచి టిక్కెట్టు మార్చుకుని వస్తాడు. అతనితోపాటు అతని బట్టలకున్న నల్లులు కూడా దిగుమతి అవుతాయి. ఇంతకు కథలో నల్లులవేట మానేద్దాము. అయ్య బాబోయి అని లేచిన శేషగిరి చెరో కాలో చెరో పెట్టా తన్నాడు. చెరో చేత్తో చెరో కాలు తడుముకున్నాడు. ఉన్నాయో వూడాయో చూసుకోడానికి. కాళ్లు ఉన్నట్టు, మూడు పెట్టెల్లోను ఒకటి లేనట్టు గుర్తించి—

"గొలుసెక్కడ" అని అరిచాడు.

"అవును ఏది ? ఏది ? బాబూని కాసేపు పట్టుకోండి చూస్తాను." అని పిల్లాణ్ణి శేషగిరికిచ్చి కాసేపు గాబరాపడి "అయ్యో నా మతి మరుపా పెట్టెలో పెట్టానండీ భద్రంగా" అంది శకుంతల.

"అబ్బ, ఎంతసేపూ నీ సొదే ! నీ గొలుసు మాట ఎవడడిగాడు. రైలాపాలి మూడు పెట్టెల్లోను రెండే ఉన్నాయి. మూడోది స్టేషనులో మర్చిపోయాము." అన్నాడు.

"మూడెక్కడివండీ. మీరు సామాను ఎక్కువన్నారుకదా ! అని మీ బట్టలు నాలుగు తీసేసి బాబువన్నీ మీ పెట్టెలో సరేసాను." అంది శాంతంగా.

"నీ పెట్టెలో సర్దుకోలేకపోయావ్" అన్నాడు కోపంగా.

"ఇది బాగుంది పండుగంతా నేనేం కట్టుకోవాలి, అన్నీ వాడి బట్టలే పెడితే" అంది గునుస్తూ.

"అదేమిటి నాయనా ఆడపిల్ల ఆ మాత్రం బట్టలు లేకుండా ఏం చేస్తుంది ?" అంది ఎదురుగా పరుచుకుని కూర్చున్న ముత్తైదువు.

శకుంతల్ని మింగేద్దామన్నంత కోపం వచ్చింది శేషగిరికి. పక్కన సారథి ఉన్నాడు. వెళ్ళబోయేది అత్తవారి వూరు. అనువుకాని చోట అధికుల మనరాదు. అన్న నీతిసూత్రం వంట బట్టిన వాడవటం చేత శకుంతల్ని బదులు కోపాన్ని మింగేశాడు. మాట వరుసకి బాబుని చేతికందించిన శకుంతల మళ్లీ అడిగి తీసుకోలేదు. వాడు శేషగిరినంత ఇబ్బంది పెడుతున్నాడు. కొంచెం దూరంగా సారథి కెదురుగా కూర్చున్న రెండు జడల కళ్ళజోడు అమ్మాయి శేషగిరి బాధ చూసి నవ్వింది. బాగుండదు ఆడపిల ఏమన్నా అనుకుంటుంది తనుకూడా నవ్వకపోతే అని సారథి కూడా నవ్వాడు. శేషగిరి బాబూని శకుంతల చేతికివ్వబోయాడు. శకుంతల చూడలేదు.

శకుంతల ఇవన్నీ గమనించే సితిలో లేదు. ఆమె మనస్సు అప్పుడే వాళ్ళ వూరు వెళ్ళిపోయింది. ఈ సారి పక్కింటి జానక్కి తను కొనుక్కున్న కొత్త చీర చూపించాలి. వాళ మద్రాసులో కూడా ఇల్లాంటిది దొరకదని అనిపించుకోవాలి. అయినా అది పండుక్కి వస్తుందో లేదో ! దాని మొగుడు ఒక తీరుబడి లేని ఆఫీసరు. "అత్తవారి వూరికి." అంటే సెలవు దొరకని మానవుడు. ఈ సారి సీతమ్మపిన్ని గారింటికి వెళినప్పుడు అమ్మా తనూ ఒకే రంగు చీర కటుకుని వెళాలి. ఇద్దరికి ఏ రంగుంది చెప్మా ! కనకాంబరపు పట్టు చీరలున్నాయిగా అన్నయ్య పెళ్ళికి నాన్న కొన్నవి. వీలైతే ఉషతో కలిసి చిన్నప్పుడు ఆడుకున్న స్థలాలన్నీ చూడాలి. బాబు ఫరవాలేదు. అమ్మమ్మ దగ్గర ఉంటాడు. కాకపోయినా వాళ్ళ నాన్నగారు ఇంటోనే ఉంటారుగా ఆయన అక్కడికి వెళ్తే అసలు ఇలు కదిలి బయటికి వెళరు బాబూ !

మన రైళ్ళు, ఆంధ్రప్రదేశ్ వారి బస్సులు, శకుంతల మనస్సంత వేగంగా ఎలాగో గమ్యం చేరవు. అవి న్యాయంగా తీసుకోవాల్సిన టైముకు మరి కొంత కొసరు వేయించుకొని మెల్లిగా గమ్యం చేరాయి. బస్సు దిగి శేషగిరి ఇటూ అటూచూసి అక్కడ ఒక్కటే ఒక్కబండీ ఉండటం అదీ ఎద్దుది అవడం చూసి గతుక్కుమన్నాడు. "ఇక్కడ గుర్రపు బండీ అన్నాలేదు. ఈ కుడితింజను ఎన్నింటికి తీసుకు వెళ్తుందో ? రేవు తెల్లారే లోపల వెళ్తుందేమోలే" అన్నాడు సారథితో.

"కాసేపు ఆలోచిస్తూ కూర్చుంటే ఈ కుడితింజను కూడా దొరకదు. అప్పుడు కాఫీ ఇంజన్ను పని చెయ్యాల్సి వస్తుంది. రండి, రండి" అంటూ తొందర చేశాడు బావమరది.

"ఎక్కండి బాబు" అన్నాడు బండీవాడు సామాను సర్దేసి"

"ఎక్కకేం చేస్తాంలే" అని విసుక్కున్నాడు శేషగిరి.

"నడవ్వచ్చునండీ" అని అందించాడు సారథి చక్రం మీద కాలువేసి బండీ ముందరవేపు ఎక్కుతూ.

మెల్లిగా బండీ నడుస్తోంది. అసలే ఇండియాలో రోడ్లు. అందులో పల్లెటూరు మట్టిరోడ్డు. గతుకులకి వళ్ళు హూనం అయిపోతుంటే శేషగిరి "ఏమోయి సారథీ . ఆ మధ్య రాముల వారు దండకారణ్యంలో తిరుగుతూ మీ వూరు వద్దామనుకుంటున్నారని తెలిసి ఆ నాటి మీ గ్రామ స్వపరిపాలకులు వేయించినటు న్నారు ఈ రోడ్లు" అని కుతూహలంగా ప్రశ్నించాడు.

"అదేం మాటండీ, మొన్న మా బావగారు వస్తున్నారని మాట వరుసకి మా వూరి పెద్దలతో అంటే పూనుకుని అప్పటికప్పుడు వేయించారు." అని సమాధానం ఇచ్చాడు సారథి. బండీవాడు ఆ గుబురు మీసాల చాటున నవ్వాడని శేషగిరికి అనుమానం వేసింది.

ఎలా గైతేనేం మావగారి ఇల్లు చేరింది బండీ. బండీ ఆగగానే మావగారు బయటికి వచ్చి "వచ్చావుటోయి చాలా సంతోషం. ఒరేయి రాముడూ సామాను లోపల పెటు . ఏ రోయి వెధవా ! అప్పుడే ఎంత ఎదిగావురా. అమ్మాయి వంట్లో ఎలా ఉంటోంది ? ఆ మధ్య జ్వరం వచ్చిందని వ్రాసావు. ఏంవోయి ! శేషగిరి ! చిక్కిపోయి నట్టున్నావు. మీఉద్యోగమే అంతలే" అంటూ ఆహ్వానిస్తూనే పేరుపేరునా పలుకరించి ప్రశ్నించారు.

"ఆ బాగానే ఉన్నాను. ఏదో కొంచెం జలుబు, జ్వరం వచ్చిందంతే" అంది శకుంతల లోపలికి పోతూ.

"ఉద్యోగం ఏం చేసింది పాపం. అంతా మీ అమ్మాయి వంట చలువ" అని లోపల అనుకుని బయటకు నవ్వేసాడు.

రాత్రి భోజనాలయ్యాక పక్క చూపించి వెళిన శకుంతల మళ్లీ పొద్దున్న కాఫీ గాసుతో

కనిపించింది. రాత్రంతా శకుంతల ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూసిన శేషగిరి "ఏమండీ ఇక్కడో అభాగ్యుడు ఉన్నట్టు ఇప్పుడా తమరికి గుర్తుకు వచ్చింది" అన్నాడు కోపంగా.

"అదేమిటండీ మనవి రోజూ చూసుకునే మొహాలే కదా. నిన్న రాత్రంతా మా అమ్మ నన్ను వదలందే. నన్ను చూసి ఏడాది అయిందా! మనవూరి విశేషాలు, మన బాలు అల్లరి ప్రతివాళ్ళకి విడివిడిగా వర్ణించే సరికి నా ప్రాణం పోయింది. మీకేం హాయిగా నిద్రపోయి ఉంటారు. అర్థరాత్రి అమ్మకి మెలుకువ వస్తే నన్ను లేపింది ఎందుకో అనుకున్నాను. "ఏమే నా మనవడు నన్నెప్పుడైనా తలుచుకుంటాడా" అని అడిగింది. నీ మనవడి మాట తెలియదు కాని నీ అల్లుడు గారు మాత్రం రోజూ నీ ఆవడల్ని, నిన్నూ తలుచుకుంటూ ఉంటారు. అన్నాను." అని జవాబు యిచ్చింది శకుంతల.

"కొంపదీసి నిజంగా అన్నావేమిటి" అని అడిగాడు శేషగిరి అసలు విషయం మర్చిపోయి హడలి పోతూ.

"అనలేదులెండి. దానికేంగాని దొరగారు బెడ్ కాఫీ తీసుకుంటారా ? యింకా ముఖమైనా కడుక్కోలేదు."

"దొరగారు, మీ నాయనమ్మగారు. ఒకేసారి ముఖం కడుక్కున్నారు. దొరసానిగారు బారెడు పొద్దెక్కి లేస్తే ఏం తెలుస్తుంది." అని కాఫీ తీసుకునాడు.

# మరుపురాని ఉగాది

"సరేకాని తొందరగా రండీ, తలంటే అది అయ్యాక ఉగాది పచ్చడి తినాలి." అంటూ కాఫీ గ్లాసు పుచ్చుకుని వెళ్లిపోయింది.

అట్లా వెళ్లిపోయి మళ్ళీ భోజనాల దగ్గర కనిపించింది. ఏదో వడ్డించటానికి వచ్చి, 'ఏమిటి' అని అడిగాడు శేషగిరి.

"ఆవడలు" అనిచెప్పి నవ్వు ఆపుకుంటూ వద్దంటు ఉంటే వినకుండా మరోరెండు వడ్డించి వెళ్లిపోయింది.

గట్టిగా కోప్పడుదామనుకున్నా, యిటుమావగారు, అటుపక్క బావమరిది, అల్లుడు ఎల్లా ఉన్నాయంటాడో అని వంటింటి గుమ్మానికి ఆనుకుని నిల్చున్న అత్తగారు కనిపించే సరికి ధైర్యం చెయ్యలేక పోయాడు.

"తాంబూలం యివ్వటానికి వచ్చిన శకుంతలతో మీ అమ్మగారు ఉక్కుముక్కల్లా ఆవడల్ని చెయ్య గలగటంలో ఉన్న రహస్యం ఏమిటో తెలుసుకో వచ్చా." అంటూ అమాయకంగా మొహం పెట్టి అడిగాడు.

"పెద్దవాళ్ల గురించి హాస్యాలు ఏమిటి." అంది ఉడుక్కుని.

"ఏయ్ పిల్లా. ఆటలో అరటిపండు. ఉడుక్కోడాలు లేవు." అన్నాడు.




"అల్లా ఉడుక్కుని వెళిపోయిన శకుంతల సాయంత్రం కాఫీ టిఫిన్ పట్టుకుని ప్రశాంతంగా వచ్చింది. టిఫిన్ తీసుకుంటూ ఉంటే పక్కన కూర్చుని సాయంత్రం ఏం చేద్దామనుకుంటున్నారండీ ?" అని అడిగింది.

"ఏం చెయ్యమంటావు ?"

"ఎందుకండీ అంతవిసురు. మీరు, మా తమ్ముడు అలా షికారు వెళ్లిరండి. నేనూ, అమ్మ అల్లా సీతమ్మ పిన్ని గారింటికి వెళ్లి వస్తాము. రాత్రేమో పాండవోద్యోగ విజయాలు నాటకం ఉంది అందరం వెళ్దాము."

"అల్లాగే మీ పిన్నిగారింటికి వెళ్ళిరా. తరువాత చూదాం."

పర్మిషన్ తీసుకుని శకుంతల వెళ్ళిపోయింది. వెళ్ళేది ఒక్కతీ వెళ్లక పిన్నిగారికి చూపించటం కోసం బాబుగాడ్ని తీసుకుని మరీ వెళ్ళింది. తనకి ఊళ్ళో తోచేది ఎల్లా! సాయంత్రం ఇంకా యింట్లో సారధి ఉంటాడా! ఎక్కడో రొమాంటిక్ కార్నరులో బీట్‌కొట్టి ఉంటాడు. మావగారితో మాట్లాడుదామా అంటే ఎన్నోసంట ఏ భూమి మీద ఎంత వస్తుందో ఆ విషయం పైనగాని, దైవభక్తి లేక ప్రస్తుతం ప్రపంచం ఎల్లా వెడి పోతుందో ఆ విషయం పైనగాని ఉపన్యాసం యిస్తారు. ఇంట్లో రేడియో అన్నా లేదు. చేసేది లేక ఒక్కడూ బయల్దేరాడు. ముక్కూ మొహం తెలియని వాళ్లు కనపడి "నువ్వు ఫలానా వారి అల్లుడివి కదోయ్! ఏం చేస్తున్నావు ? ఎంతమంది పిల్లలు" అంటూ నిలదీయటం మొదలు పెట్టారు. ఇక్కడ ఫలానా వారి అల్లుడు,ఫలానా శకుంతల మొగుడు అనేగాని తన వ్యక్తిత్వానికి విలువ లేదు. అందుకని తొందరగా తిరుగు ముఖం పట్టాడు.

రాత్రి భోజనం తరువాత శకుంతల వచ్చి "నాటకాని వెళ్దాం తయారవండి" అంది శేషగిరితో.

"మీరు కావాలంటే వెళ్ళండి నేను రాను నాకు జలుబు చేస్తుంది" అన్నాడు ఎక్కిరిస్తూ.

"ఇందాక వస్తానన్నారు"

"వస్తాననలేదు. చూస్తానన్నాను. బాబుని వదిలేసి కావాలంటే నువ్వు వెళ్ళు"

"ఏమే అమ్మాయి వస్తున్నావా ?" అని అత్తగారి ప్రశ్న.

"రావోయి శేషగిరి అసలే తోచడం లేదనుకుంటున్నావు" అన్నారు మావగారు.

"అబ్బే నేను రానండీ నాకు నిదర వస్తోంది" అన్నాడు ప్రయత్నంచేసి ఆవులిస్తూ శేషగిరి.

"మంచి నాటకం భారత భాగం. ఏంటే భారతం వినాలన్నారు. రాకపోడమేమిటోయి" అన్నారు మావగారు, ఆయన సినిమాలో దేవుడు కనిపిస్తే లేచి నిలబడి చేతులు జోడిస్తాడు, సాష్టాంగ పడే చోటు ఉండదు కనుక.

"నేనూ రానమ్మా" అంది శకుంతల. అందుకని వీళ్లను వదిలి మిగిలిన వాళ్ళు వెళ్ళారు. వెళ్లిన వాళ్లల్లా గంటలో తిరి వచ్చారు. ఎందుకనో అని చూస్తే అత్తగారు అవసోపాలు పడుతున్నారు. నాటకంలో కాసేపు బాగానే ఉన్నారుట. తరువాత ఉన్నట్టుండీ కడుపు నొప్పి

56వ పేజీ చూడండి

# సంపెంగ పొదలు



సి. ఆనందారామం

### జరిగిన కథ

గిరి, హరి, హరి చెల్లెలు దుర్గ బాల్య స్నేహితులు. హరి, ఉమల మధ్య అనురాగం నెలకొంటుంది. గిరి చూపే భాతృవాత్సల్యాన్ని, దుర్గ హర్షించ లేకపోతుంది, దూరపు బంధువు శంకర్‌ను గిరి తన ఇంటికి ఆహ్వానిస్తాడు. గిరి సలహాపై దుర్గ శంకర్‌ని హృదయ పూర్వకంగా ప్రేమిస్తుంది. వారిద్దరు వివాహం చేసుకొంటారు. హరంటే ఇష్టంలేనట్లు ఉమ ప్రవర్తిస్తుంది. హరి కృంగిపోతాడు. శంకర్, దుర్గల వైవాహికజీవితంలో చెలరేగిన కలతలను సరిదిద్దటానికి గిరి ప్రయత్నం చేస్తూ వుంటాడు.

## 16

అనుకోకుండా వచ్చిన ఉమను చూసి ఆశ్చర్య సంభ్రమాలతో ఉక్కిరిబిక్కిరయ్యాడు హరి. అతని ఆశలు ఆకాశాన్నంటుకున్నాయి. హౌసు సర్జను కూడా పూర్తిచేసిన ఉమ, ఇక శాశ్వతంగా తనది కావటానికే ఇలా వచ్చిందనుకున్నాడు. ఆమె ముఖంలోని నీలి నీడలు, కన్నులలోని నిరుత్సాహమూ, చిరునవ్వులోని పేలవత్వమూ, పొంగిపొర్లే హరి ఉత్సాహానికి ఆనకట్టలు కాలేకపోయాయి. హరి ఉత్సాహాన్నీ, ఆనందాన్నీ చూసిన ఉమ మరింత కృంగిపోయింది. పసిపిల్లాడిలాంటి ఈ నిర్మలమూర్తికి తాను చెప్పదలచుకున్నది ఎలా చెప్పటం? తననింత గాఢంగా ప్రేమించిన హరి, తనకోసం తహతహతో ఐదేళ్లు నిరీక్షించిన హరి, వూహలు తెలియని పసితనంనుంచీ తనమీద సర్వాధికారాలూ చెలాయించిన హరి, ఈ ఆశాభంగాన్నెలా ఎదుర్కొంటాడూ? అతి సున్నితమైన హృదయమూ, అత్యంత ఉద్రిక్తమయిన స్వభావమూ కల తన బావ ఈ దెబ్బకు తట్టుకోలేక ఏమయినా అయిపోతే? ఆ పాపమంతా ఎవరికి చుట్టుకుంటుందీ? అలా అని హరిని అంగీకరించటం తనను తాను మోసం చేసికోవటమేగాక, హరినికూడా మోసం చేసినట్లే అవుతుంది. హరి కోరుతున్నది తన అనురాగాన్ని కానీ, తన శరీరాన్నికాదుగదా! అలా అనుకుంటే హరి కోరితే, తనకంటే అందమైనవాళ్లు అతనికి భార్యగా దొరకరా?

వెనుకనుండి తన కనులు మూయబడటంతో ఉలికిపడి ఆలోచనలలోంచి తేరుకుంది. ఆ కనులు మూసిన ఆ చేతులనూ, ఆ స్పర్శనూ, తేలికగానే గుర్తించగలదు ఉమ. ఏ విధమయిన చంచలనమూ లేకుండా ప్రశాంతంగా "చేతులు తియ్యి బావా!" అంది.

ఉమ ప్రశాంత గంభీర స్థిర స్వరం హరికి, ఉమ ప్రసన్నతగా భాసించింది. చిరునవ్వుతో చేతులుతీసి ఆమెమీదకు వంగబోయాడు—ఉమ చటుక్కున లేచి "బావా! నన్ను ముట్టుకోకు" అంది స్థిరంగా.

ఇప్పటికి హరి తెల్లబోయాడు. అంతలో తేరుకుని నవ్వుతూ, "ఇంకా ఎన్నాళ్ళు ఇలా నన్ను దూరంగా ఉంచగలవో చూస్తాగా! అప్పుడు నా కసి అంతా తీర్చుకుంటాను" అన్నాడు.

"నన్ను క్షమించు బావా! నిన్ను ఒకప్పుడు దగ్గిర చేసుకుందామనే కోరిక నాలో ఉంటే, ఇప్పుడే నిన్ను దగ్గిర చేసుకునేదానిని. నిన్ను శాశ్వతంగా నాకు దూరంగా ఉంచాలనే నా నిశ్చయం. నాకు వివాహంమీద కోరికలేదు. నీకు తగిన ఎవరినైనా, చూసుకుని పెళ్ళిచేసుకో! నన్ను మర్చిపో!"

హరి నోట మాటరాక, పిచ్చివాడిలా అలా ఉమ వంకే చూస్తూ నిలబడిపోయాడు. ఆ చూపులకు ఉమ గుండెలు అవిసిపోతున్నాయి. ఆపుకుందామని ఎంత ప్రయత్నించినా ఉమ కన్నీళ్లు ఆగటంలేదు. హరి దగ్గరగావెళ్ళి భుజాలు పట్టుకుని కుదుపుతూ "బావా!" అంది ఆందోళనగా — హరి ఉమ చేతులు విదిలించి వెనకువెళ్ళి "నన్ను ముట్టుకోకు" అన్నాడు అన్నాడు కసిగా.

ఉమ నవ్వింది. "నువ్వు మనసారా ఆ మాట అనగలుగుతే అదృష్టవంతురాలిని."

"నవ్వుతున్నావా? అవును. నీకు నవ్వులాటగానే ఉంటుంది అయితే నువ్వు ఎం. బి. బి. ఎస్.లో చేరటానికి కూడా కారణం ఇదే కదూ! ఈ ఉద్దేశం మనసులో ఎన్నడో కలిగింది కదూ! నువ్వు నాకంటే అందగాణ్ణి, గొప్పవాణ్ణి, ఎవణ్ణో ప్రేమి ప్రేమించి ఉండాలి. అందుకనే నన్ను అసహ్యించుకుంటున్నావు. ఛీ! ఏం ఆడవాళ్ళు! ఎంత చంచలమైన మనస్సూ?"

హరి ఉద్రేకంతో వూగిపోతున్నాడు. ఉమ కన్నీళ్ళను ఆపలేకపోతూంది.

"ఇంకా తిట్టుబావా! భాషలో ఉన్న పదాలన్నీ ఉపయోగించి తిట్టు. ఎంతటి తిట్లకయినా నేను అర్హురాలినే. కానీ, నేను నిన్ను అసహ్యించుకోవటం లేదు -- బావగా నిన్నెప్పటికీ అభిమానిస్తూనే ఉంటాను. నా భర్తగా మాత్రం నిన్ను చూడలేను."

"నిన్ను తిట్టడానికి నే నెవర్ని ఉమా! నీమీద నాకేం హక్కుఉందీ? నీ పెళ్ళి ఎప్పుడో చెప్పు. వచ్చి మీ ఇద్దర్నీచూసి సంతోషిస్తాను."

"నే నసలు పెళ్ళి చేసుకోనుబావా! నాకు దేశ సేవ చేద్దామని ఉంది. అందుకనే డాక్టరునయ్యాను. ప్రస్తుత దేశపరిస్థితినిబట్టి ఎందరో డాక్టర్లు యుద్ధంలో గాయపడినవారికి అవసరం. నేను తేజ్ పూర్ హాస్పిటల్‌లో అప్పాయింట్ అయ్యాను. డ్యూటీలో చేరడానికి నిశ్చయించుకున్నాను. వెళ్ళబోయేముందు మిమ్మల్నందరినీ ఒకసారి చూడాలనిపించి వచ్చాను.

హరి ముఖం పాలిపోయింది. చాలాసేపటివరకూ, అతను మాట్లాడలేకపోయాడు. చివరకు "ఉమా! ఎందుకింత కసి నామీద నీకు?" అన్నాడు.

ఉమ వంచిన తల ఎత్తలేకపోయింది.

"క్షమించుబావా! క్షమించు. ఈ స్వార్థపరురాలిని నిర్లక్ష్యం చేయుటం నేర్చుకో! నీ బ్రతుకుబాట నువ్వు దిద్దుకో!" అంది చివరకు.

హరి సమాధానం చెప్పలేదు. చాలాసేపు ఆ ఇద్దరిమధ్య నిశ్శబ్దం రాజ్యం చేసింది. హరిలేచి నిలబడి "ఈ లోపమేదో నా జాతకంలోనే ఉంది. నా ప్రాణంలా అభిమానించిన దుర్గ తానే స్వయంగా నా ఇంటికి రావద్దంది. నా సర్వస్వంగా భావించిన నువ్వు నాకు దూరంగా పోవటమేకాక, ఈ లోపు

బంధాలకు కూడా దూరంగా పోవాలనుకుంటున్నావు. వదు ఉమా! నేను నిన్నేవిధంగానూ బాధించను. నాకు భయపడి ఆ యుద్ధరంగంలోకి పారిపో వదు. నీకెలా సంతోషమైనా, అలాగే ఉంటాను. నీ సంతోషంలోనే నా సంతోషాన్ని వెతుక్కుంటాను. అక్కడికి వెళ్ళవని మాట ఇయ్యి" అన్నాడు.

ఉమ తన ఆవేదన నణచుకోవటానికి విశ్వ ప్రయత్నం చేస్తోంది.

"నువ్వు దేవతవి బావా! నీ ప్రేమకు అర్హురాలివి కాలేకపోవటం, నా దురదృష్టం. కానీ నా నిశ్చయాన్ని మార్చటానికి ప్రయత్నించకు. ఇలాంటి అవకాశం మాత్రం ఎంతమందికి వస్తుంది బావా! ఇది బ్రతుకును సార్థకం చేసికోవటంకానీ వ్యర్థం చేసికోవటంకాదు. నాకు సంతోషం ఇందులో ఉంది గనుకనే ఇలా నిశ్చయించుకున్నాను."

హరి అక్కడినుంచి వెళ్ళిపోయాడు. ఉమ బరువుగా నిశ్వసించింది. ఆమె గుండెలమీదనుండి ఎవరో పెద్ద కుంపటిని దింపినట్లయింది. ఆవేదనతో గుండెలు కరిగి కన్నీరుగా ప్రవహించినా, ఈ కన్నీటిలో కొంత సంతృప్తి ఉంది.

రెండు రోజులు గడిన తరువాత ఉమ తన మొహమాటాన్ని అణచుకుని, "బావా! గిరినిచూసి వద్దామా?" అంది. హరి నిర్లిప్తంగా "పద?" అన్నాడు.

ఏదో పత్రిక చదువుకుంటూన్న గిరి హరి, ఉమలను చూసి చిరునవ్వుతో ఆహ్వానించాడు. నీరసంగా నిరుత్సాహంగా ఉన్న హరిని చూసి "ఏమయ్యా పెళ్ళికొడుకా, అలా ఉన్నావ్" అని వేళాకోళం చేశాడు. ఈ వేళాకోళం హరి మనసునూ, ఉమ మనసునూ కూడా కలతపరిచింది. హరి నిర్లిప్తంగా నవ్వి, "ఉమ యుద్ధంలో గాయపడిన వారికి వైద్యం చెయ్యడానికి తేజపూర్ వెళ్తోంది. మనకందరకూ "గుడ్‌బై చెప్పడానికి వచ్చింది" అన్నాడు.

గిరి స్థాణువులా అయి, "ఏమిటీ?" అన్నాడు నమ్మలేనట్లు—ఉమ నవ్వుతూ ... "ఈమధ్య సరిగా వినబడటంలేదా" అంది. గిరి తిరిగి నవ్వలేకపోయాడు — ఉమ నిశ్చయానికి కారణమేమిటో అతనికి చక్కగా తెలుసు—అంతులేని ఆవేదన అతని కళ్ళలో సుడులు తిరిగింది—అతని పెదిమలు కదిలాయి. కానీ మాటలు పైకి రాలేదు.

అతని ఆవేదన గమనించిన ఉమ తృప్తిగా నిట్టూర్చింది. "ఇది చాలు" అనుకుంది.

గిరిబాధ పడుతున్నాడని గ్రహించిన హరి, ఆది తనమీది సానుభూతిగా అర్థం చేసుకుని. "ఎందుకు గిరి, అలా బాధ పడతావ్! మనలో ఒకరైనా ఇలాంటి మంచిపని చేస్తున్నందుకు మనం గర్వపడాలి" అన్నాడు.

గిరి దిగాలుగా "దేశసేవ చేయాలనే దీక్ష సహజంగా ఉంటే చాలా మంచిదే! కానీ, వేరుకారణాలేవైనా దీనికి దారితీస్తే మాత్రం......" అని ఆగిపోయాడు.

ఉమ ఊరుకోక "కారణమేదైతేనేం? జరుగుతున్నది మంచిదేగా" అంది.

గిరి, హరి వంక చూస్తూ, "కానీ, ఒక అనురాగభరిత హృదయాన్ని క్షోభిల జేయటం మాత్రం క్షమింపరాని నేరం" అన్నాడు.

ఉమ కొంటెగానవ్వి "నిజంగానా?" అంది.

ఆ ఎత్తిపొడుపు మాటిగా గిరి గుండెల్లో గుచ్చుకుంది. ఆ తరువాత ఎంత ప్రయత్నించినా, ఆ ముగ్గురిలో ఎవ్వరూ సహజంగా ఉండలేకపోయారు. ప్రతిఒక్కరి మనసులోనూ ప్రచండమైన తుపాను చెలరేగుతూంది. కొంతసేపు ఎలాగో కృత్రిమమైన మాటలతో గడిపి హరి, ఉమ, సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

## 17

తన ఇంటికి వచ్చిన జానకిని పది క్షణాల పాటు ఎగాదిగా చూస్తూ నిలుచుంది దుర్గ—దుర్గ చూపులలోని భావం గ్రహించిన జానకి, కృత్రిమ కోపంతో బొమలు ముడిచి నవ్వుతూ, "దృష్టిబొమ్మలా అలా చూస్తావేం? నా ముఖాన కోతులాడుతున్నాయా?" అంది కూర్చుంటూ, దుర్గ తను కూడా జానకి ప్రక్కన కూర్చుని. "నీ అలంకరణ నిజంగా దృష్టి కొట్టేలాగే ఉంది ఎంత టైం పట్టింది నీకు? ఇంక ఇంటో వేరే పనులేవీ ఉండవా?" అంది.

జానకి చెక్కిళ్ళు కొంచెం ఎఱ్ఱబడగా. "ఏం చెయ్యను? ఇలా అలంకరించుకోక పోతే ఆయన చంపేస్తారు." అంది. "అలా చెప్పు! ఇదంతా మా బావగారి కళా ప్రావీణ్యమన్న మాట." దుర్గ కిలకిల నవ్వింది. జానకి తను కూడా నవ్వి "ఆయనకి అలంకరణ విషయంలో ఎంత చాదస్తమనుకున్నావ్. ఎక్కడా ఏ లోటు ఉండడానికి వీలు లేదు. చీరా, జాకెట్టు, గాజులూ, పువ్వులు, లాకెట్టు అన్నీ ఒక దానితో ఒకటి శ్రుతి కలిసి తీరవలసిందే! లేకపోతే అప్పటికప్పుడు బజారునుంచి కొని తీసుకువస్తారు. అంతేకాదు పేరంటాలకి ఒకలాగ, డిన్నర్లకు ఒకలాగ, పార్టీలకు మరోలాగ అలంకరించుకోవాలి—నిజంగానే నువ్వన్నట్లు నా టైమంతా ఈ అలంకరణకి వృధా అవుతుంది. నాకొక్కొక్కసారి విసుగొస్తుంది కూడా! అయినా ఆయన మనసుని కష్టపెట్టలేను." అంది.

దుర్గ కనుబొమ్మలు ఆశ్చర్యంగా పైకి లేచాయి. "అయితే నువ్వు తరచుగా క్లబ్బులకూ, పార్టీలకూ, సినిమాలకూ వెడుతూంటావా?"

"అయ్యో బాబోయ్! తరచుగా ఏమిటీ? ఇంచుమించు రోజూ ఏదో ప్రోగ్రాం ఉంటుంది. ప్రతి రోజూ నేను నిద్ర పోయే సరికి పన్నెండు, ఒంటి గంట అవుతుంది. అప్పుడప్పుడు మేం కూడా పార్టీలిస్తూ ఉంటాము— ఇంటి పనులు నువ్వన్నట్లుగానే నాకేమీ లేవు, అజమాయిషీ తప్ప— అయినా, ఈ వ్యాపకాలన్నింటితో ఉక్కిరి బిక్కిరిగా ఉంటుంది."

"నీకు బాగుందా, ఇలా?"

"బాగుందా. అంటే ఏం చెప్పను? ఆయనకిలా చాలా ఇష్టం— ఒక్కొక్కసారి నాకు ప్రశాంతంగా ఇంటి దగ్గరే ఉండాలనిపిస్తుంది— కాని తను నన్ను వదలరు. తప్పించుకోవాలంటే ఒకటే మార్గం— ఏ తలనొప్పి అనో, కడుపు నొప్పి అనో వంక పెట్టాలి— అప్పుడు నేను వస్తానన్నా తను తీసుకుని వెళ్ళరు. కాని ఇంకా ఇబ్బంది వస్తుంది. తను కూడా అన్ని వ్యాపకాలు, మానుకుని నానా కంగారు పడుతూ. నాదగ్గరే కూర్చుంటారు. డాక్టరుని పిలిపిస్తారు. ఎంత గొడవ జరగాలో అంతా అవుతుంది. ఇంతకంటే ఆయనతో కలిసి బయటకు పోతేనే మేలనిపిస్తుంది."

అప్రయత్నంగా దుర్గ భారంగా నిట్టూర్చింది. "ఎంత అదృష్టవంతురాలివే నువ్వు జానీ!" జానకి పకపక నవ్వింది. "అవును! నా అదృష్టాన్ని నువ్వుపొగుడుతే విని ఆనందిస్తాను."

"అదేం? ఇంతకంటే అదృష్టమేం కావాలి?"

నవ్వుతున్న జానకి ముఖం క్షణంలో నల్లగా అయిపోయింది. భారంగా, "పోనీవే! అదృష్టవంతురాలినే అనుకో!" అంది— దుర్గ ఆశ్చర్యపోతూ "నాకు చెప్పకూడని రహస్యమేమయినా ఉందా?" అంది—

"అసలు రహస్యమే కాదు— కాని అనుకోవటానికి చాలా కష్టంగా ఉంటుంది. మొన్నీ మధ్యనే మా ఆయనకు గుండె జబ్బు ఉన్నట్లుగా తెలిసింది. ఏ క్షణంలోనైనా నా ఈ స్వర్గమంతా అంధకారంలో కరిగి పోవచ్చు— దుర్గా! నా అదృష్టాన్ని మెచ్చుకుంటావా? నన్ను చూసి జాలి పడతావా?"

దుర్గ నిర్ఘాంత పోయింది— మూఢురాలిగా జానకి ముఖం వంక చూస్తూ ఉండి పోయింది. చైతన్యానికి మారు పేరులా ఉండే జానకి, సృష్టిలో విలాసము రూపు ధరించి వచ్చిందా, అని జానకి, తన గుండెల్లో ఈ ఆరని కుంపటిని ప్రజ్వలింప జేసుకొంటూ పైకి పకపక నవ్వ గలుగుతుందా?

ఎప్పుడూ నవ్వుతూ ఉండే జానకి కళ్ళ నీళ్ళు దుర్గ గుండెలను పిండి చేసాయి. అప్రయత్నంగా జానకి చేతిని తన చేతిలోకి తీసుకుని "పాపిష్టి దానిని—నవ్వుతూ వచ్చిన నిన్ను ఏడిపిస్తున్నానే నవ్వు. కన్నీళ్ళు నీకు తగినవి కాదు—" అంది.

జానకి పెదవుల పైకి పేలవమైన చిరు నవ్వు మెరిసింది. "నిజం దుర్గా! కన్నీళ్ళు నాకు తగినవి కావు. నా గురించి నాకు ఏమీ బాధ లేదు. కానీ అంతరాంతరాలలో ఆయన పడే క్షోభ చూస్తుంటే నా గుండె పగిలి పోతుంది— —

"ఈ సంగతి ముందే గుర్తించకుండా, నిన్నన్యాయం చేశాను. నన్ను క్షమించగలవా జానకీ?" అని ఆయన అంటూంటే ఏం సమాధానం చెప్పాలో తోచదు. "నాకు ముందే ఈ సంగతి తెలిసినా, మిమ్మల్ని ఒదులుకునే దానిని కాను." అంటాను. ఆయన దరిదాపులకు విషాద మేఘాలు రాకుండా నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను. అయినా తన అంతరంగంలో ఆవేదన తుడిచి వెయ్యటం నా తరం కావటం లేదు—"

దుర్గ మనసు కరిగి పోతోంది. జాలిగా జానకి వంక చూడటం కంటే ఏమీ మాట్లాడలేక పోయింది. జానకి ఇంకా ఏదో చెప్ప బోయేటంతలో శంకర్ రావటంతో ఆగి పోయింది— శంకర్ జానకిని చూసి "హలో! జానకీ! ఈ మధ్య బొత్తిగా కనబడటం లేదే." అన్నాడు. జానకి నవ్వింది.

"నేను రాకపోతే పోనీ, మీ ఇద్దరూ రాకూడదా? మీరూ అసలు కనపడటం లేదు."

"వద్దామనే అనుకున్నాను. రెండుసార్లు దుర్గా, నేనూ బయలుదేరి కూడా, ఏవో అవాంతరాలవల్ల ఆగిపోయాం. అయినా, మీరు కనబడకపోతే మాకేం తోచదు."

"అవునా, దుర్గా!" అంటూ జానకి దుర్గ వంక చూసింది. తన భర్త ఈ లేనిపోని అబద్ధా

ప్రక్కన పేజీ చూడండి

# పగటి వేషాలు



బుడబుడక్కలవాళ్లు

ఎన్. రామకృష్ణ



కృష్ణుడు, నారదుడు

పగటివేషాలు వేసేవారు నాట్యకళ అభ్యాసకులు. ఊరూరా తిరిగి ఈకళలో తమకి ఉన్న నైపుణ్యాన్ని ప్రదర్శించి పొట్ట గడుపుకుంటారు. వారికి పాట, నాట్యం, సంగీతం అన్నింటిలోనూ ప్రవేశం ఉంటుంది.

రంగు రంగుల దుస్తులలో పురాణాలు, బుర్రకథలలోని ఘట్టాలునాటకాలుగా వేస్తారు. భాగవత, రామాయణ, మహాభారతాలకథలు ఎక్కువగా వాడుకుంటారు. పాత్రధారులందరూ మగవారే. కాని, అందరూ తమ కుటుంబాలతోనే పర్యటిస్తారు. సాధారణంగా ఒక్కొక్కచోట పది రోజులుదాకా మకాం చేస్తారు. ఊరువదిలి వెళ్లేముందు చందాలు పోగుచేసుకుంటారు. ఒక ఊరికి మూడు నాలుగు వందలదాకా సంపాదిస్తారుట !

తెలుగు ప్రదేశాలలో 'పగటివేషాలు'గా చలామణి అవుతున్న

వీరిని అరవదేశంలో 'పగల్వేషం' వారని పిలుస్తారు.

ఈ పేజిలోని ఫోటోలలో వీరి ప్రదర్శనలలోని దృశ్యాలు కొన్ని చూడొచ్చు. వీరు పురాణకాలంలో వ్యక్తులలాగా మాత్రమే గాక నిత్య జీవితంలో చూసే వారిలాగా కూడా వేషాలు వేసుకుంటారు.

ఎవరయినా అతిగా 'వేషం' వేసుకుంటే 'పగటి వేషం'అని వెక్కిరిస్తారు. దీనినిబట్టి పగటి వేషాలకు ప్రజల మనస్సులో ఎటువంటి స్థానం ఉందో గ్రహించవచ్చు!

నేడు సినిమావంటి కాలక్షేపాలు ఎన్నో అందరి అందుబాటులోఉన్న ప్పుడు పగటివేషాలు ఇంకా ప్రజాదరణ పొందుతున్నాయంటే సంతోషించ తగ్గ విషయం. నాటకాలు, వీధిభాగవతాలు, తోలుబొమ్మలు, యక్షగానాలు మొదలయిన వినోదాలతో బాటు పగటివేషాలుకూడా ప్రాచీన కళాస్వరూపాలు; ప్రజా సామాన్యానికి తరతరాలుగా ఆహ్లాదాన్ని కలిగించిన వినోదాలు.



భీముడు, ద్రౌపది

నేడు స్కూళ్లలో, కాలేజిలలో ప్రదర్శించే 'ఫాన్సీడ్రెస్ కాంపెటిషన్'లు సయితం ఒక రకమయిన పగటివేషాలేగా?

నటన, అభినయం, అనుకరణ మానవ స్వభావంలోనే దాగి ఉంటాయి. వీలయినప్పుడు, అవి చేసేవారికే కాక, ఇతరులకు కూడా సంతోషం కలిగించటంవల్లనే ఇన్ని కళాస్వరూపాలు ఇన్ని విధాలుగా వ్యాపారంగా, పరిశ్రమలుగా వర్ధిల్లుతున్నాయి. ★



భీముడు, ఆంజనేయుడు

# సంపెంగపొదలు


31 వ పేజీ తరువాయి


...న్నీ ఎందుకు చెప్తున్నాడో అర్థంకాని దుర్గ అయోమయంగా తల ఊపింది.

శంకర్ "దుర్గా! జానకికి కాఫీ అదీ ఏమైనా ఇచ్చావా, లేదా?" అన్నాడు.

కబుర్ల సందడిలో ఆ మాటే మర్చి పోయిన దుర్గ హడావుడిగా లేవబోతుంటే జానకి దుర్గను బలవంతాన కూర్చో బెట్టి "నాకు కాఫీ అలవాటు లేదు. ఎవరింటికైనా వెడితే మర్యాదకోసం తాగుతాను. ఇప్పుడు తాగాలని లేదు." అంది.

"అబ్బ! మీకెంత మంచి అలవాట్లండీ!" అన్నాడు శంకర్. జానకి నవ్వి ఊరుకుంది.

పంచెం సేపు కూర్చుని అది ఇదీ మాట్లాడాక జానకి వెళ్తానని లేచింది. దుర్గ ఇంకా కాస్సేపు కూర్చోమంది. కానీ, జానకి పని ఉందని లేచింది.

"వీలైనప్పుడల్లా కన్పిస్తూ ఉండండి." మళ్ళీ ఒకసారి హెచ్చరించాడు శంకర్.

జానకి వెళ్ళంగానే తనలో తను నవ్వుకుంటున్న శంకర్‌ను చూసి ఆశ్చర్యంగా "ఏమిటీ?" అంది దుర్గ.

"మీ జానకిని తల్చుకుని నవ్వుకుంటున్నాను. అదీ ఒక ఆడదేనా? చేతులు లేని ఆ జాకెట్టు, లిప్‌స్టిక్, హైహీల్సు, జుట్టంతా అలా గావాలని రింగులు తిప్పుకోవటం, ఎవడితో పడితే వాడితో అలా పిరగబడి మాట్లాడటమూ! - ఆ మొగుడు వెధవని అనాలి - పెళ్ళాన్ని ఇష్టం వచ్చినట్టు ఊరేగనిచ్చి ఆడముండలా చేతులు నలుపుకుంటూ కూర్చున్నాడు. హ హ హ . . . ." శంకర్ వికటమైన నవ్వు దుర్గ చెవులకు శూలపు పోటులా తగిలింది. బాల్య స్నేహాన్ని మరువని జానకి స్నేహశీలతనూ, స్నేహితురాలి భర్తగా శంకర్ కిచ్చే గౌరవాన్ని, పెకిలి తనం క్రిందా రాజారాం విశాల హృదయాన్ని ఉలిక పితనం క్రింద, వ్యాఖ్యానించే భర్త మాటలకు కలుక్కుమన్నట్లైపోయింది దుర్గ. జానకి మీద విషం కక్కినట్లైన ఈ అభాండాల్ని సహించ లేక పోయింది. "మరి, అటువంటి జానకితో మీరంత స్నేహంగా ఎలా ఉండగలుగుతున్నారో?" రోషంగా అడిగింది దుర్గ.

"నీ తెలకాయ. స్నేహమేమిటీ? నా అందం చూసి అది వెంటబడింది. పోనీయ్ లే! నాకు మంచి కాలక్షేపమని నేనూ సరదా పడ్డాను."

ఇలె గిరి పోయేలా నవ్వాడు శంకర్.

భరించలేని విరక్తితో దుర్గ నవనాడులూ మండాయి. "ఛీ! ఏం మనుష్యులూ? ముఖమెదురుగా ఎంతో స్నేహాన్ని చూపించి కనుచాటు కాంగానే ఇంత నీచంగా మాట్లాడటమా?"

"నీచమైన వాళ్ళను గురించి నీచంగా మాట్లాడక ఇంకెలా మాట్లాడతారు? ఈవిడ నీచత్వాన్ని కప్పిపెట్టడానికి, ఆ మొగుడు వెధవ అడ్డున్నాడని నన్నిప్పుడు పతివ్రత అనమంటావా?"

"అవును — భార్యను అనురాగంతో చూస్తూ ఆమెను విశ్వసించే స్వాతంత్ర్యాన్ని ఇవ్వటం చేతకాని తనం. క్షణక్షణానికి తన ఆధిపత్యాన్ని గుర్తు చేస్తూ భార్యకు వ్యక్తిత్వమనేదే లేకుండా పశు బలంతో అణచి ఉంచడం మొగతనం."

శంకర్ రుద్రుడయ్యాడు. లేత తమలపాకు వంటి దుర్గ చెంప చెళ్ళుమని ఉబ్బింది. మళ్ళీ అన్నాడు రోషంగా—

దుర్గ మనసు మండి పోతోంది— అవమానమూ, భయమూ, కాదా కలగటానికి మారుగా రోషమూ, కసి పెరుగుతున్నాయి.

"నేను అనడమెందుకూ? మీరే బుజువు చేసుకుంటున్నారు."

శంకర్ యుక్తా యుక్త విచక్షణా జ్ఞానం పోగొట్టుకున్నాడు. వెర్రి ఆవేశంతో తన చేతినీ, కాళ్ళనూ కూడా దుర్గ మీద ప్రయోగించసాగాడు.

దుర్గ ప్రతిఘటనైనా లేకుండా కనీసం కన్నీరైనా రాకుండా, తన శరీరాన్ని శంకర్ మూర్ఖత్వానికి కప్పగించి తనీ లోకంలో లేని దానిలా నిల్చుంది. ఈ మొండితనం శంకర్ ఆవేశాన్ని మరింత రెచ్చగొట్టగా తీవ్రమయిన రోషంతో మిగాలమున్న కర్ర పైకెత్తాడు. కర్ర ఎత్తిన అతని చెయ్యి అలాగే దృఢంగా పట్టుకోబడింది. శంకర్ ఆశ్చర్యంతో వెనక్కు తిరిగి వెంటనే పాలి పోయాడు. గిరి కళ్ళలో నిప్పులు కురుస్తున్నాయి. అతని దృఢమైన బంధంలో శంకర్ చెయ్యి ఇరుక్కుంది. గిరిని చూడగానే దుర్గ గిరి పాదాల మీద వాలి "గిరీ! నాకింత విషమియ్యి. అదే! అదొక్కటే నేను నిన్ను కోరుకుంటున్నాను." అంది.

గిరి కడుపు తరుక్కు పోయింది. "ఇదంతా నీ ప్రయోజకత్వమే! అని ఎవరో తనను దెప్పినట్లనిపించింది. పటుక్కుని శంకర్ వంక తిరిగి "నీ భార్య ఏదో అడుగుతుంది విన్నావా? తెచ్చి పెట్టు. అందరి సమస్యలు తీరి పోతాయి." అన్నాడు.

శంకర్ వంచిన తల ఎత్తలేదు. ఆ మాట్లాడినది గిరికాక, ఇంకొకరైతే అతడు ఘాటైన సమాధానం చెప్పేవాడే! అతడు ప్రపంచంలో అందరికన్న అధికంగా ప్రేమించి, గౌరవించే వ్యక్తికి సమాధానమూ ఇయ్యలేకపోయాడు.

"దుర్గా! నువ్వు వానేసి విశ్రాంతి తీసుకో! వెళ్ళు" అన్నాడు గిరి దుర్గ నీళ్ళు నిండిన తన పెద్ద కళ్ళతో నిరాశగా గిరివంక చూస్తూ "ఒకటే విశ్రాంతి" అంది దీనంగా.

"నా మాట విని వెళ్ళు" అన్నాడు గిరి మళ్ళీ. దుర్గ వెళ్ళిపోయింది. గిరి శంకర్‌ను చెయ్యి పట్టుకుని తన దగ్గర సోఫాలో కూర్చోపెట్టుకుని "శంకర్! నేను నిన్ను స్వంత తమ్ముడిలాగ అభిమానిస్తాననీ, మనసారా నీ సుఖం కోరుకుంటానని నమ్ముతావుగదా" అన్నాడు. శంకర్ తలవంచుకుని "నువ్వు నా పాలిట దేవతవి" అన్నాడు.

గిరి నిరసనగా నవ్వి "అంత స్తోత్రం వద్దులే! ఇది విను—నీకు ఈ సమస్యలన్నింటికీ చక్కటి పరిష్కారమార్గం చెప్పనా?" అన్నాడు.

"అంతకంటేనా? చెప్పు."

గిరి సాధ్యమైనంత శాంతంగా నవ్వుతూ "దుర్గ సూచించిన మార్గమే! ఎలాగో ఒకలాగ దుర్గను, ఈ లోకంలో లేకుండాచేస్తే నువ్వు హాయిగా నీకు నచ్చిన మరో స్త్రీని పెళ్ళి చేసుకుని సుఖంగా ఉండవచ్చును. నీమీదకు ఏ కేసులూ రాకుండా నేను చూస్తాను" అన్నాడు.

శంకర్ ముఖం పాలిపోయింది.

"గిరీ! దుర్గ నన్ను రెచ్చగొడుతుంది. అవమానకరంగానూ మాట్లాడుతుంది. కొట్టాను. కొట్ట

డంతప్పే అనుకో! కానీ ఆ వెఱ్ఱి ఆవేశంలో నాకంత ఆలోచన ఉండదు— అంతేకానీ, దుర్గ చావాలని నేను కోరుకుంటానా?"

"నువ్వు కోరుకోవుగానీ, నేను కోరుకుంటున్నాను. దుర్గకు అదే నయం."

"వద్దు గిరీ! అలా మాట్లాడకు—ఆ భావనేనా మనసుకు కష్టం కలిగిస్తోంది. నేను దుర్గను ఎంత అభిమానిస్తానో మీ కెవ్వరికీ తెలియదు. దుర్గ లేకుండా నేను క్షణం కూడా ఉండలేను. తనకోసం ఏం చెయ్యమన్నా చేస్తాను—కానీ నన్ను చులకనచేస్తే సహించలేను."

గిరి శంకర్ ముఖంలోకి తేరిపార చూశాడు. శంకర్ ముఖంలోనూ ఆవేదన స్పష్టంగా కనిపిస్తోంది. గిరికి కొంత సంతృప్తిని కలిగింది.

శంకర్ చేతిని తన చేతిలోకి తీసికొని మృదువుగా నొక్కుతూ "నువ్వు ఉత్త అమాయకుడివి! శంకర్" అన్నాడు. శంకర్‌కు గిరి ధోరణి అంతా తమాషాగా ఉంది. గిరి ముఖంలోకి ఒకసారి చూచి వూరుకున్నాడు.

"లేకపోతే ఏమిటి చెప్పు. నువ్వు దుర్గ నింత ప్రేమిస్తూ కూడా, మీ జీవితంలో ఇంత కలతలు రేగుతున్నాయంటే, ఏమనాలి? పోనీ, ఇట్లాంటి పరిస్థితి నీకు సుఖంగా ఉందా? ఈ గొడవలూ, చికాకులూ, నీ మనసుకేమీ కష్టం కలిగించటం లేదా?"

"ఎందుకు కష్టం కలిగించటంలేదూ? నువ్వు దుర్గను చేసుకో మనంగానే నేనెంతో సంతోషించాను. అప్పట్లో దుర్గ వినయమూ, అణకువా నన్నెంతో ఆకర్షించేవి. ఒక్కనీతో తప్ప నాతోనైనా ఎక్కువ మాట్లాడేదికాదు. నా సంసారం స్వర్గమే అవుతుందని ఆశపడేవాణ్ని. ఇప్పుడు ఇంచుమించు నాకు పిచ్చెక్కినట్లు ఉంటూంది."

"ఉండదూ మరి?" ఎవరైనా భార్యతో సరదాగా గడపాలని ఆశపడతారుకానీ, గొడవ పెట్టుకు కూర్చోవాలనుకుంటారా? కానీ, శంకర్ ఇంకొక్క విషయం గూడా అర్థం చేసికోవటానికి ప్రయత్నించు కాస్త—మనం పెళ్ళి చేసుకునే సజీవమైన మనుష్యులముకానీ, యంత్రాలముకాము గదా! ప్రతి ఒక్కరికీ, వారివారి ఆలోచనలూ వారి వారి కోరికలూ ఉంటాయి. ఒక్కొక్కప్పుడు భార్య భర్తలమధ్య ఈ భావాలలో వైరుధ్యం కూడా కన్పించవచ్చు — అట్లాంటప్పుడు పరస్పర సహకారంతో ఇద్దరూ, ఒకదారికి రావాలి. కానీ ఇద్దరిలో ఒకరు బలవంతాన తమ అభిప్రాయాలు ఇంకొకరి నెత్తిమీద రుద్దటం ఎలా సాధ్యమవుతుంది చెప్పు? దుర్గ విధిలేక నువ్వు చెప్పినట్లు పడి ఉండటం నీకు ఇష్టమా? లేకపోతే, తానై సంతోషంతో నిన్ననుసరించటం నీకు ఇష్టమా? దుర్గ మనసును చిత్రవధ చేసాక, ఆ శరీరాన్నుండి నువ్వేం పొందగలవూ? జీవంలేని యంత్రంగా దుర్గ మారిపోయిందంటే, నువ్వాపరిస్థితిని ఒక్కక్షణంకూడా భరించలేవు. మానవుడెవడూ ఏకాంతాన్ని భరించలేడు. నువ్వు నీకు తెలియకుండానే దుర్గను, నీ కనుగుణమైన యంత్రంగా మార్చుకుంటున్నావు. అప్పుడు చివరకు మానసికంగా నీకేకాంతవాసం లభిస్తుంది. హృదయాన్నే నాశనంచేసిన తరువాత స్పందన నశించిన ఆ హృదయం శరీరాన్ని ఎలా ఉత్తేజపరుస్తుంది? ఉద్రేకరహితమైన ఆ శరీరాన్ని నువ్వేం చేసుకుంటావూ?"

శంకర్ ఆశ్చర్యంగా వింటున్నాడు. అతని అంతరాంతరాలలో ఆ మాటలన్నీ అక్షరాలా నిజమేననిపించింది. "ఇంకొక సంగతి శంకర్—నువ్వు దుర్గనెంతో ప్రేమిస్తున్నావు. ఆ ప్రేమను ఆమె గుర్తించేలా చెయ్యి. స్త్రీ పురుషునికి తన సర్వస్వమూ ధారపోస్తుంది. ప్రతిఫలంగా, ఆమె కోరుకునేది లాలనా, అనునయమూ మాత్రమే! నీ అధికారంలో ఎదురు తిరిగే ఆమె హృదయం నీ లాలనలో సర్వమూ మర్చిపోతుంది. తన వ్యక్తిత్వాన్ని కూడా మరిచి, నీ వ్యక్తిత్వంలో తానుగా లీనమవుతుంది. ఆనాడు నీ కోరిక సఫలమౌతుంది. ఇంకొక విధంగా నీ కోరిక నెరవేరదు సరికదా, నీ జీవితాన్ని నువ్వే నాశనం చేసుకున్నవాడవౌతావు.

"మనుష్యులంతా ఒకవిధంగా ఉండరు. ఇనుప స్తంభమూ, వీణ తీగెలూ, ఇనుమునుండే చేయబడ్డాయి— మొదటిది ఎంత దెబ్బకైనా, తట్టుకోగలదు. దానినుండి 'డండం' ధ్వనులుతప్ప ఇంకేమీ పొందలేవు. ఏ కాస్త చిన్న దెబ్బకైనా తెగిపోయే వీణ తీగెలను సున్నితంగా మీటినపుడు లోకాన్నే మరపించేసే మంజుల మధురనాదాన్ని అందిస్తాయి. మనుష్యుల స్వభావాల్లో కూడా ఇంతటి వైవిధ్యం ఉంది. అర్థం చేసికోగలిగితే, ఆనందాన్ని అనుభవించగలం. గుడ్డిగా ప్రవర్తిస్తే సృష్టికర్త మన కందించిన ఎన్నో వరాలను వ్యర్థం చేసుకున్నవాళ్ళమవుతాము. నేను దుర్గను సమర్థిస్తూ, ఈ మాటలన్నీ చెపుతున్నాననికానీ, నీకు నీతులు చెప్పుతున్నాననికానీ అనుకోకు—నీ సుఖంకోరి మాత్రమే ఇలా చెపుతున్నాను. నువ్వే ఆలోచించుకో! నేను వెడుతున్నాను."

శంకర్ సమాధానానికి కూడా ఎదురు చూడకుండా గిరి వెళ్ళిపోయాడు. (సశేషం)



మొదట్లో కాసేపటికి భరించలేనంత అయితే ఆవిడని ఇంటికి తీసుకువచ్చారు. "డాక్టర్ని పిలవనా అని అడిగితే" "ఈ భాగ్యానికి డాక్టరెందు" కని అర్ధరాత్రివరకూ అవస్థపడి నిద్ర పోయారు.

ఆ హడావిడిలో శేషగిరి తలుపు గడియ పెట్ట కుండా నిద్రపోయాడు. పొద్దున్న లేచేసరికి రిస్టువాచీ, పరుసు ఎవరో ముచ్చటపడి శేషగిరితో చెప్పకుండా రాత్రికి రాత్రే పట్టుకు పోయినట్టు తెలిసింది. శేషగిరికి దొంగని చూస్తే జాలి వేసింది. శకుంతల శేషగిరికి ఎంతడబ్బు అవసరము అను కుంటుందో అంతకు మించి పరుసులో వెయ్యదు. కనుక ఒకటో రెండో రూపాయలుకి మించి ఉండదు డబ్బు. ఇంక ఆ రిస్టువాచీ రెండు రోజుల్లో రిజిష్టరు పోస్టులో దొంగ తిరిగి పంపించినా తను ఆశ్చర్య పడడు. అందుకని పాపం ఈ చౌర్యంలో శ్రమే తప్పించి ఫలితం ఉండదు. శేషగిరి తృప్తిగా మనస్సులో నవ్వుకుని బయటికి బావుండదని "నిక్షేపంలాంటి వాచీ ఎనిమిదేళ్లబట్టీ వాడు తున్నాను." అని ఇద్దైపోయాడు.

"నాటకమా ఏ ముచ్చటా ! నాకే కడుపు నొప్పి నిన్ననే రావాలా ! నా వల్ల ఖంగారులో

# మనోహరానిఉగాది

28వ పేజీ తరువాయి

ఆయన తలుపు వేసుకోవడం మర్చిపోయి ఉంటారు. అర్ధరాత్రి వరకు హంగామా చేస్తే నిద్ర ముంచుకురాదూ ! ఆయన రాక రాక వస్తే నిక్షేపం లాంటి వాచీ పోయింది. ఇంక ఆయన బతిమాలినా వస్తారా ! వెధవ ఆవడలు ! వాటివల్లే నాకీ నొప్పి వచ్చింది. ఇంక అవి నేను చేస్తే ఒట్టు" అని అత్తగారు హడావిడి చెయ్యడం శ్రవణా నందంగా వినిపించింది శేషగిరికి.

రిస్టు వాచీ పోయినందుకు అత్తగారు ఒట్టు పెట్టుకున్నందుకు ఎంతో ఆనందించినా శాయ శక్తులా విచారం నటిస్తూనే కూర్చున్నాడు. ఇంతలో మామగారు పూళ్లో పని చూసుకో డానికి వెళ్లిన వారు వచ్చి శకుంతల్ని పిలిచి "అమ్మాయి ! ఎవరో బాకీ ఉన్నవాళ్ళు ఇప్పుడే బజార్లో కనిపించి ఇవ్వాల్సిన డబ్బు ఇచ్చారు. ఎన్నాళ్లబట్టో అనుకుంటున్నాను. ఈ డబ్బు పెట్టి మీ ఆయన్ను వాచీ కొనుక్కోమన్నానని చెప్పి ఇయ్యి. నేను ఇస్తే పుచ్చుకోడు అసలే మొహ మాటస్తుడు." అన్నారు. అది పక్క గదిలోంచి విన్న శేషగిరి ఆనందంతో మరో పది కేజీలు బరువు పెరిగాడు.

ఇంతలో సారథి దుమారంలా వచ్చి "మన రెండిళ్లవతల ఉన్న వీరయ్య చౌదరి కొత్త సంవత్స రంలో కొత్త వ్యాపారం మొదలు పెడతాడట డుట. ఓ పది సైకిల్ రిక్షాలు కొని అద్దెకిస్తాడు. మన బావగారికి ఒంటెద్దుబండి బాధ తప్పి పోయింది అక్కయ్యోయ్." అంటూ ప్రకటిం చాడు.

శేషగిరికి ఆనందంతో వూపిరాడలేదు. అంత సులభంగా అతని బాధలన్నీ కొత్త సంవత్సర ములో కొట్టుకు పోయాయి. శేషగిరికి మరి కొత్త సంవత్సరము అతిః బ్రహ్మాండంగా మొద లైంది.

శేషగిరి కొత్త వాచీ పని చేస్తుందా ? అత్త గారు మనసు మార్చుకునే అవకాశం లేదా ? వీరయ్య చౌదరికి పెట్టుబడి సమకూడిందా ? అన్న అనుమానం మీకు కలగవచ్చు.

జవాబులు : చేస్తోంది, ఇప్పుడప్పుడే లేదు, సమకూడింది.

. . . . . . . . . . . . అందుకని

# చదువర్రావు

వి. వి. సత్యమూర్తి









మీ కృషియే దేశానికి సౌభాగ్యం
మీ పొదుపే రక్షణనిధికి మదుపు



# మీవంటి ఉత్సాహవంతులైన యువకులకు

# ఫిలిప్స్

## సైకిల్ అవసరము

అందంగా ముద్దులొచ్చే ఫిలిప్స్ సైకిల్ మీవంటి నేటి ఉత్సాహవంతులైన యువకుల ఆవశ్యకతలకు అనుగుణ్యంగా నిర్మించబడినది. ఎంత చెడతొక్కినా తట్టుకోనేటట్టు అచ్చమైన టెంపర్ ఉక్కుతో తయారైంది. ప్రపంచమంతటా 70 యేళ్లు బట్టీ ప్రశస్తమైన ఫిలిప్స్ సైకిళ్లు టి. ఐ. సైకిల్స్ వారి అధునాతన ఫ్యాక్టరీలో నిర్మింపబడుతున్నాయి.




PHILLIPS

టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు—మద్రాసు

JWT.TIC-PH-305Te




## 25

రావణుడు యింకనూ యిట్లు పలికెను—

"అంగదా! నీవు నన్నేమిగా ఊహించి ఇట్లు తృణీకరించి పలుకుచుంటివి? రాహువు చంద్రుని కాంతి హరించు విధముగా నేను దిక్పాలుర గర్వ మడంచిన సంగతి నీకు తెలియదా! నా హస్త కమలములపైన కైలాస పర్వతము ఒకప్పుడు ఆకాశములో హంసవలె పైకి లేచిన విషయము నీవు వినియుండలేదా! జగములను గజగజ లాడించిన ఈ మనుజనాథుడు ఇపుడు మీ నరవానరులకు భయపడి, దోసిలొగ్గవలెనని తలంచుచుంటివి. ఓయీ వనచరా! నిజము చెప్పుము, వాస్తవములో నన్నెదుర్కొనగల యోధుడు మీలో ఎవరున్నారు? రాముడు భార్యా వియోగి, అతని తమ్ముడు—అన్న అవస్థకు ఎన్నడో దిగులుగొని దీనుడై యున్నాడు. ఇకపోతే నీకును సుగ్రీవునకును గల జ్ఞాతి వైరము, జగద్వితము. నా సోదరుడు విభీషణుడంటి వాడొక పిరికిపంద. ఇక మిగిలినవారిలో నలనీలురు కేవలము శిల్ప ప్రవీణులు. జాంబవంతుడు జరాభారముచే బలముడిగినవాడు. కానీ నన్నెదుర్కొన గల వీరుడు మీలో ఒక్కడే మిగిలియున్నాడు. వాడు మా లంకకు నిప్పుబెట్టిన మర్కట యోధుడగు ఆంజనేయ నామధారి."

అని చెప్పుచుండిన నిశాచరనాథుని మాటల కడ్డుపడి కపిపుంగవుడు ఫక్కున నవ్వి ఇట్లనెను—

"రాజా! ఆ వానరుని గురించి నీవేమో గొప్పలు చెప్పుచున్నావు. వాడు మా సేనలో కనిష్ఠ బలుడు మాత్రమే. శీఘ్రగామియని వానిని సుగ్రీవుడు లంకకు పంపియుండెను. కానీ, శ్రీహరి ఆజ్ఞ లేనిదే వాడు లంకను దహించి యున్నందున భయపడి ఎక్కడనో దాగుకొనియున్నాడు. నేటివరకు వాడు మా కంటబడలేదు. ఆ పిల్ల కోతిని గురించి నీ వింతగా పొగడుచుండుట వింతగా నున్నది. నీ బల ప్రతాపము లేపాటివో దీనివలననే చక్కగ తెలియుచున్నవి. మా కటకములో నిన్నెదుర్కొనగల వీరుడు లేడని వాక్రుచ్చితివి. కొంతవరకు నీవు చెప్పినది కూడ వాస్తవమే. ఏమన, క్షత్రియకుల సంజాతుడగు శ్రీరాముడు నీబోటి బ్రాహ్మణ వంశీయునిపై చేయి చేసుకొనుటకు వెనుకాడుచుండుట నిక్కము. అయిననూ పరస్త్రీని హరించిన నీబోటి పాతకిని వధించుటకు వెనుకాడదగదు.

ఓ దశగ్రీవా! రావణుడు నీతివంతుడు, బలవంతుడు. వివేకవంతుడని విని ఇంతదూరము శ్రమపడి నిన్ను జూడ వచ్చితిని. ఇంతకూ నీ వెవ్వరో ఇప్పటికీ నాకు బోధపడకున్నది. ఒకప్పుడు బలి చక్రవర్తిని జయింపబోయి పరాభవమొందిన రావణుడు, మరొక సమయమున కార్తవీర్యార్జునిని కారాగృహమున బంధింపబడిన రావణుడు ఒక మారు మా తండ్రి చేతులసందున చిక్కుకొని నలిగి నీలిగి బయటపడిన రావణుడు వీరిలో నీ వెవ్వరో నాకు తెలియరాక తికమక పడుచున్నాను."

అని అంగదుడు ఆశ్చర్యము ప్రకటించెను. వానరదూత వ్యంగ్యోక్తులు సురవైరికి ములుకులవలె తగిలెను. రావణుడు రోషకషాయనేత్రుడై రొప్పుచూ దూత కిట్లు ప్రతివచనములు పలికెను—

"అంగదా! వాచాలత్వము కట్టిపెట్టుము. గతములోనే జేసిన ఘన కార్యములు, నా వైభవ ప్రాభవాదులు తెలియక నీ విట్లు పొరబడుచున్నావు. లోక భీకరుడగు ఈ రావణు డెవరైనదీ నీకు తెలియగ తెలియదా! కైలాసము కదలించిన భుజబలుడు, శిరో పుష్పములచే శివుని ఆరాధించిన ఉగ్రతపస్వి, దిక్పాలురను దిక్కులపాలు జేసిన ధీరుడెవరైనదీ నీ కింకనూ తెలియకున్నదా! ఎవని వజ్ర సన్నిభ వక్షస్థల కాఠిన్యమును చవిచూచి దిగ్గజములు వెరగొందెనో, ఎవని ఘనగర్జనలకీ బ్రహ్మాండము గడగడ లాడియుండెనో, ఎవడు దిక్పతులచేత తన ఇంటి పనులు చేయించ కొనుచుండునో, ఎవరికి ఇంద్రజిత్తు, కుంభకర్ణులవంటి మహావీరులు సోదరులుగా నున్నారో, ఆరణధీరుడు, శూరుడు ధైర్యధురంధరుడగు రావణుడు నేనేయని ఇప్పటికైనా గుర్తించుము.

మూర్ఖుడా! నీ యజమానిని గురించి ఏమేమో గొప్పలు చెప్పుచుంటివి. సేతువుగట్టి సముద్రమును దాటుటకూడ ఒక ఘన కార్యమా! గువ్వలు గూడ కడలిని దాచుండుట మన మెరుగమా! ఇంట నుండి గెంటివేయబడినవాడు, భార్యను పోగొట్టుకొన్నవాడు, దిక్కులేక చెట్టు పుట్టక దిరుగాడుచున్నవాడు, అసమర్థుడై, కోతుల గుంపువెంట బెట్టుకొని కేకలు వేయుచున్న బైరాగివానికి భయపడి ఈ లోక రావణుడు త్రాహి యనవలెనా! సీతను సమర్పించుకొనవలెనా! ఆ నిరాశ్రయునికి నేను పాదాశ్రయుడు కావలెనా! ఓరీ పశువా! బుద్ధిహీనుడవై ఈ మాటలు చెప్పుటకేనా నీవు పని గట్టుకొని నా వద్దకు వచ్చినది!" అని దనుజపతి అంగదుని దట్టించి పలికెను.

"రావణా! నీ స్థైర్య ధైర్యములు, బలప్రతాపములు జగత్తునకు తెలియనివికావు. అహంకారముతో ఆత్మస్తుతులు చేసుకొని అజ్ఞానమున బడుచున్నావు. నీ ఇరువది చేతులను, పది తలలను వరములను, సోదరులను, సుతులను మాటి మాటికి పేర్కొని ఏల ప్రేలెదవు. ఇవి ఏమియు కోసలపతి ఖరతర బాణశిఖలను ఎదుర్కొనలేవు. వానరులను పురుగులక్రింద పరిగణించి పరిహసించుట నీ హ్రస్వదృష్టికి తార్కాణము. నిన్ను అర్థించుటకు లేక నీతో సఖ్యము చేయుటకై బ్రతిమాలమని రాఘవుడు నన్ను ప్రయత్నించి పంపలేదు. రామాజ్ఞను లోకమర్యాదను గౌరవించి యూరకున్నాను గానీ, నీ బల దర్పములకు భయపడిగాదు. లేకుండిన ఈపాటికే నిన్ను సంహరించి లంకతో సహా జానకిని తీసుకొనిపోయి నా స్వామికి సమర్పించుకొని యుందును."

అని గర్జించి కపిరాజు క్రుద్ధుడై భూమిని గ్రుద్దెను. ఆ మర్కట వీరుని ముష్టి ప్రహారమునకు భూమి దద్దరిల్లి కంపించిపోయెను. సభికులు భయకంపితులైరి, ఆ కుదుపుకు రాక్షసరాజు ఆసనమునుండి దొర్లి క్రిందబడెను. అప్పు డతని మణి కిరీటములు పదీ నేల దొర్లెను. వానిలో నాల్గింటిని తీసుకొని అంగదుడు వాటిని శ్రీరాముని చెంత పడునట్లు ఎగజిమ్మెను. ఆ వజ్ర కిరీటములు సూర్యకాంతికి తళతళ మెరియుచూ వెళ్ళి ఉల్కాపాతమువలె శ్రీహరి చరణములవద్ద పడెను.

భూకంపనకు ధరాగతుడైన దనుజనాథుడు తటాలున పైకి లేచి రోషోద్దీపితుడై పండ్లు పటపట గీటి—'రాక్షస వీరులారా! ఈ దూతను త్రాళ్ళతోకట్టి బంధింపుడు, వానరులపై బడుడు, రామ లక్ష్మణులను భక్షింపుడు, ఇది నా యాజ్ఞ!" అని వెర్రెత్తిన హానివలె కేకలిడుచూ నరవానరులను దుర్భాషలాడజొచ్చెను.

అసురేశుని అవినీతికి అంగదుడు ఆగ్రహోదగ్రుడై భుజమప్పళించి "ఓరీ నిశాచరా! అంత్యకాలము సమీపించినందులకే నీ విట్లు నీతి న్యాయములను నిర్జించి, నీచోక్తులాడి, నైచ్యమునకు ఒడిగట్టుచున్నావు. ధర్మబద్ధుడనై యున్నందున నీ కిప్పుడే తగు పాఠము చెప్పలేనందుకు నా కెంతయు చింతగా నున్నది. ఇదిగో! కేకలు కట్టిపెట్టి నా ఈ కాలు కదిలించినచో చాలు మీరు శ్రీరాముని జయించినట్లే" అని ప్రతిజ్ఞా పూర్వకముగా పలికి, అంగదుడు తన ఎడమ పాదమును భూమిపై మోపెను. రాక్షసులాప్రకటనకు భయభీతులైరి.

తదుపరి భీమబలులైన పలువురు జాతుధానులు ముందుకువచ్చి ప్లవంగ వీరుని పాదము కదలించు

టకు బహు విధముల ప్రయత్నించి చూచిరి. సత్పురుషుని సన్మార్గమునుండీ తప్పింపజాలనట్లు రాక్షసులెంత బల ప్రదర్శనము చేసిననూ అంగదుడి కాలు కదపలేక భంగపడిరి.

''తృణకుల్శిశ, కులిశ తృణ కరంయా
గరువ సుమేరు రేణు సమతాంయా''

అన్నట్లు దైవ బలమున్నవాని నెవరేమి చేయగలరు!

దశగ్రీవుడీ పరాభవమును భరించలేకపోయెను. రోషావేశుడై రావణుడు తానే ముందుకువచ్చి—అంగదుని కాళ్ళుపట్టి పైకెత్తి క్రిందవేసి చితుక గొట్టవలెనని సంకల్పించెను.

అంగదు డది జూచి ''రావణా! నీవు నా తండ్రికి సమకాలికుడవు, కాబట్టి నీవు నాకు పితృ సమానుడవు. నీవు నా పాదములు పట్టుకొనుటకై ఉద్యమించుట భావ్యముగాదు. జగదారాధకుడగు ఆ శ్రీపతి చరణములు స్పర్శించినపుడే నీకు ముక్తి లభించునని విశ్వసింపుము'' అని తుదిసారిగా బోధించెను. ఇవ్విధముగ అంగదుడు శత్రువుల దర్పమడించి, ధీర గంభీరుడై రావణుని కొలువుకూటములనుండి మరలి దశరథాత్మజుని చెంతకుపోయెను.

అంగదుడు వచ్చిపోయిన పిమ్మట, లంకేశుడు లజ్జావమానములు భరించలేక కృంగిపోయెను. అప్పుడతని ముఖము పగటి చంద్రుని పగిది కళా కాంతులుడిగి వెలవెలబోయెను. పరాభాగ్ని భరించలేక లంకేశుడా క్షణమందు వికలచిత్తుడై తలలు బాదుకొనుచూ విలపించెను. దుస్సహమగు ఆత్మ క్షోభకు అసురేశుని హృదయము కళవళపడెను. దయామయుడైన దాశరధికి ద్రోహము తలపెట్టిన దుష్టునికి మనశ్శాంతి యెట్లు లభించగలదు!

## మండోదరి హితబోధ

అట్లు వ్యసనవ్యగ్రాంతుడై ఇంటికి వచ్చిన సురారి మనస్సు మార్పించుటకై మండోదరి ఇట్లు బోధించెను.

''నాథా! రఘురాము సాకేతవాసుని యెడల నీ శత్రుభావము ద్విగుణీకృతమగుచున్నందుకు నాకు విచారకరముగా నున్నది. సాక్షాత్ జగదారాధకుడగు కాకుత్స తిలకుని మాయా మహిమ గ్రహించ నేరక అతనితో పగ సాధించుటకు ప్రయత్నించుట మంచిదికాదు. నారాయణ స్వరూపుడగు రాముని వరుడని విశ్వసించుట నిశాచరజాతి నశించుటకు హేతువగుచున్నది. రాఘవుని బాణ ప్రభావము చవిజూచిన మారీచుని మాటలనైనా మన్నించక పోవడం మరీ విచారకరము. జనకుని సభలో మీ యందరి సమక్షమున శివచాపము ఖండించిన దీతడేకదా! కాకాసురుని కన్ను గ్రుడబెరికి అతని గర్వ మడంచినది ఈ కోసలవీరుడేగదా! మీ చెల్లెలి ముక్కు చెవులు కోసినది, ఖరదూషణ త్రిశిరులను కడతేర్చినది ఈ రాఘవుడేకదా! వాలిని ఒక్క కోలతో గూలనేసి, విరాధుని వధించి, కబంధుని నిర్జించినది ఈ దశరథ రాముడన్న సంగతి మరచితిరా! అవలీలగా అంబుధిదాటి, సాగరోత్తర తీరమందు సేనా సమేతముగా తిష్ఠవేసి కూర్చొని యున్నది ఈ అవధేశుడుగాక మరెవ్వరనుకొంటిరి! అతని తమ్ముడు ఒకప్పుడు గీచినగీటు కూడ నీవు దాటజాలకపోయిన విషయము విస్మరించితివా! అతని సేవకు డొకడు నీ నగరమునకువచ్చి నిర్భయుడై నిప్పుబెట్టిపోయిన దృశ్యము ఇప్పటికీ కంటికి గట్టినట్లగపడుచున్నదే! నేడు మీ సభకు వచ్చి, మీ బల దర్పములను భంగపరచిపోయిన అంగదుడు సైతము ఆ స్వామి సేవకుడేగదా! అట్టి అమేయ బల సంపన్నుడగు అవతార పురుషుని సామాన్య మానవుడని భ్రమించి మృత్యువు నాహ్వానించుకొనుచున్నావు. ఆ జగదీశుని శక్తి స్వరూపమును గుర్తించక తృణీకరించుట అన్ని అనర్థములకు హేతువగుచున్నది. నాథా! రాజ్యగర్వముచే కన్నుగానక నే బట్టిన కుందేటికి మూడేకాళ్లని మూర్ఖించి మనసు మార్చుకొనిన ఎడల దనుజ కులము సర్వ ధ్వంసము కాకమానదు.'' అని ఆమె శత విధముల బోధించి, చూచెను. కానీ, ఆమె ఆత్మఘోష అసురేశుని యెడల అరణ్యరోదనమయ్యెను.

## మైథిలిని మోసపుచ్చుట

వినాశకాలే విపరీత బుద్ధి. అట్టి వాని దృష్టి ఎప్పుడూ వక్ర మార్గమునుబట్టి పోవుచుండును. రావణుడు విద్యుజ్జిహ్వుడను రాక్షసుని రప్పించి—''ఓరీ మాయావీ! రాముని తలను అతని ధనుర్బాణములను కృత్రిమముగా కల్పించి తీసుకొనిరమ్ము, వానినిజూచి జానకి తన భర్త మరణించెనని విశ్వసించవలెను'' అని ఆజ్ఞాపించెను. విద్యుజ్జిహ్వుడు స్వల్ప వ్యవధిలోనే ఒక శిరము ధనుర్బాణములు సృష్టించుకొనివచ్చి సురవైరి కిచ్చెను. అవి అచ్చు గుద్దినట్లు శ్రీరామునితలను, ధనుర్బాణములను పోలియుండెను.

దశగ్రీవుడు వానిని తనవెంట తీసుకొని అశోక వాటికయందున్న సీతను సమీపించి....''సీతా! ఇంకనూ రామునిపై ఆశ పెట్టుకొని ఏల దుఃఖించెదవు! యుద్ధములో నరవానరులు నిశ్శేషమయ్యిరి. అవధేశుడు ఆహవమున అసువులు బాసెను. సౌమిత్రి మాత్రము ప్రాణావశిష్టుడై తప్పించుకొని పారిపోయెను. నీకు నా మాటలపై నమ్మకములేని ఎడల ఇదిగో! నిజపలభుని శిరసరచాపములనైనా గుర్తించి నిజము గ్రహింపుము'' అని పలికి, వైదేహికి నరాంతకుడు శరచాపములు, శిరమును చూపించెను. సీత శ్రీరాముని శిరముజూచి, రావణుని మాటలు నిజమని నమ్మి ఒక్కపెట్టున ఆక్రందించి—''ఓ వీర పుత్రుడా! నీవు మరణించితివా!'' యని కేకబెట్టి నేలబడి మూర్ఛిల్లెను.

ఇంతలో రక్షోనగరమును ముట్టడించి రామదండు చేసిన రణగొణ ధ్వని రావణుని చెవులబడెను. సురాంతకు డంతట అశోక వనము వదలిపెట్టి హుటాహుటి రాజ సభకు పోయెను. అప్పుడు విభీషణ పత్ని సరమ సీత పద్దకు వచ్చి ఆమె దైన్యస్థితికి జాలిగొని ఇట్లు హూరడించెను:—

''అమ్మా జానకీ! ఈ రావణుడు లోక వంచకుడు. వాని మాయా మాటలు సత్యమని భ్రమపడి నీవు చింతించకుము. కపట వ్యూహముచే దశాననుడు నిన్ను భయపెట్టి లోబరచుకొనుట కిట్లు కుట్రబన్నెను. దేవీ! రామ లక్ష్మణులు క్షేమము. వారు సేనా సమేతముగావచ్చి లంకకు ఉత్తరతీరమున విడిది చేసియున్నారు. రాముని బలమిప్పుడే లంకను ముట్టడించి జయధ్వానములు చేయుచున్నది. ఆ సంగతి తెలియగనే అసురేశ్వరుడు నిన్ను విడిచి ఆత్రముతో పరుగెత్తిపోయెను. అమ్మా! కోసల కుమారుల రాకకు లంక తల్లడిల్లుచున్నది. త్వరలోనే రామునికి జయము నీకు శుభము కలుగుట తథ్యము.''

మైత్రీ పూర్వకముగ పలికిన సరమ మాటలు అమృతప్రాయములై సీత మనోవేదన శాంతింపజేసెను. సరమ సదయ హృదయ. ఆమె స్నేహ సౌశీల్యమునకు ముగ్ధురాలై వైదేహి వేయి విధముల కృతజ్ఞత తెలుపుకొనెను.

## లంక ముట్టడి

అచ్చట సాకేతపతి అంగదునివలన లంక సమాచారమంతయు సాంతముగ తెలుసుకొని యువరాజుతో—''అంగదా! లోక విద్రావణుడగు రావణుని బల ప్రభావము జగద్విదితముగదా! అట్టివాని కిరీటములను నీవు నావద్ద కెట్లు పంపగలిగితివి?'' అని ప్రశ్నించెను. అందుకు వాలి సుతుడు వినమ్రుడై ఇట్లు విన్నవించుకొనెను—''సర్వజ్ఞా! ఇందులో మీకు గ్రాహ్యముగాని రహస్యమేమున్నది! నిశాచరుని ఆ నాల్గు మకుటములు సామదాన భేద దండోపాయములనంబడు నాలుగు రాజ ధర్మములకు ప్రతీకములు. నాస్తమునకవి కిరీటములుగావు. ఆధర్మ చతుష్టయము, నీతిబాహ్యుడగు నిశాచరుని విడనాడి మీబోటి ధర్మ ప్రభువును ఆశ్రయించెను.''

అవధనందనుడా ప్రత్యుత్తరమునకు సంతుష్టుడై అంగదుని సమయస్ఫూర్తిని, అతని వాగ్వైచిత్రిని ప్రశంసించి అభినందించెను.

పిమ్మట అంగదుడు రావణుని మనోస్థైర్యాని, మూల బల రహస్యము, వారి యుద్ధ వ్యూహరచనా విధానము, రక్షోపురి రహస్య మార్గములు, మున్నగు శత్రువులకు సంబంధించి తాను గ్రహించిన విషయములన్నీ శ్రీరామునికి వివరముగా తెలియజేసుకొనెను. రాఘవుడు, సుగ్రీవ, జాంబవంత, నీల, నల, హనుమంత, విభీషణాది ప్రముఖులతో సమర సన్నాహములను గురించి సాకల్యముగ చర్చించి, లంకను నలువైపులనుండీ ముట్టడించుటకు సుగ్రీవునాదేశించెను. అవధేశుని అనుమతి లభించిన మరుక్షణమే సుగ్రీవ జాంబవద్విభీషణులు మువ్వురూ కార్య నిమగ్నులై తమ సేనను నాల్గు విభాగములుగా విభజించిరి.

దుర్గమము, దుర్భేద్యమగు లంకకోటలను నాలుగు దిశలనుండీ ఒక్కుమ్మడి ముట్టడించి భేదించుటకుగాను యూథములు, యూథపతులు నిర్ణయింపబడిరి. లంకాపుర పూర్వద్వారము రక్షించుచున్న అతికాయుని ఢీకొనుటకు నీలుడును, దక్షిణ ద్వారము గాపాడుచున్న మహోదరునిపై బడుటకు అంగదుడును, మేఘనాథునిచే రక్షితమైయున్న పశ్చిమ ద్వారమును భేదించుటకు మహావీరుడును, ఉత్తర ద్వారమును రక్షించుచున్న రావణుని సేనను స్వయముగా రఘువీరుడే ఎదుర్కొనునట్లున్నూ నిర్ణయింపబడెను. ఇటు సమరమునకు సర్వాయత్తమైన సాకేతనాథుని వానర భల్లూక సేన సమద్ధి కోత్సాహముతో—

''జయతి రామ జయ లక్ష్మణ
జయ కపీశ సుగ్రీవ''

యని జయ నినాదములు చేసి లంక కోటల వైపుగా ముందుకు నడిచెను. ఉద్దండమైన రామ దండు చేతికందిన చెట్లు గుట్టలు రాళ్లు కుప్పలు పెకలించి

# రామచరితమానస్

పైకెగరవేయుచు, శత్రు భయంకరముగ సింహనాదము చేయుచూ, ముందుకురికి నిరీక్ష వ్యూహ ప్రకారము లంకాపుర దుర్గమును నలువైపుల నుండి ముసురుకొనెను. ఉక్కు పిండములాంటి లక్షోప లక్షల మర్కట వీరులు 'జయరామ జయ సుగ్రీవ' యను నినాదములు చేయుచూ కోట బురుజుల పై కెగబ్రాకిరి.

## తొలినాటి యుద్ధము

కోటలపై కెగబ్రాకిన వానర సేన గర్జన భరనలకు లంక దద్దరిల్లి కలగుండు చెందినట్లయ్యెను. ఈ వార్త కు రక్షోనాథుడుగ్రుడై మండిపడి జాతుధానుల నవలోకించి— "ఓసురాంతక వీరులారా! కోతి మూకలు క్రొవ్వుచే కన్ను గానక మన కోట బురుజులపై కెగబ్రాకుచున్నవట. వంటయింటికి కుందేలు వచ్చినట్లు ఈ వానర మూకలు కాలునిచే ప్రేరితులై మనకాహారమగుటకు లంకలోనికి ప్రవేశింప ప్రయత్నించుచున్నవి. మీరు తక్షణమే నలుదెసలకు క్రమ్ముకొని, వానర భల్లూకములను నిశ్శేషముగా భుజించి సంతృప్తులు కావలసినది." అని గర్వితుడై నిర్లక్ష్యముతో పలికెను.— "ఓగిరిజా! ఆకాశము క్రింద బడునేమోయని తీతువు పిట్ట ఒకప్పుడు తన కాళ్ళను అడ్డు పెట్టెనట. అవ్విధముగ రావణు డజ్ఞానముతో రాఘవుని బలసంపన్నతను తూష్ణీభావముతో నిరసించెను." — అని చంద్రమౌళి ఉమతో పలికెను.

తదుపరి రావణప్రేషితమైన రక్షోవాహిని రణసన్నాహముతో ముందుకు నడిచెను. పరశు పట్టిస పరిఘ శూలముద్గర ఖడ్గాది క్రూరాయుధంబుల పైకెగర వేయుచూ, భేరిఖాంకారాది భయదధ్వానంబుల దిశల ప్రతిధ్వనింప జేయుచూ, పిశితాశనులు కాలాంతకుల పగిది ప్లవగ సేన నెదుర్కొనుటకు సర్వ సన్నద్ధమై చనెను. మేను పర్వత శిఖరములపై ఆవరించు మేఘరాశివలె రావణసేన కోట కొమ్మలపై కెక్కి 'రావణకీ జయ్' అని శత్రువులకు ప్రతి నినాదములు చేసి దిక్కులు పిక్కటిల్లజేసిరి.

ఇట్లు రామ రావణ సేనలు ఒండొరుల నెదుర్కొని పోరాటమునకు తలపడెను. రాక్షసులు దుర్గముల పైనుండి వానరులు కోటక్రింది భాగమునుండీ, యుద్ధము చేయసాగిరి. మర్కట యోధులు తమ పర్వతములతో ముష్కరులను మర్దించుటకుపక్రమించిరి. మహా మారణాస్త్రములు ప్రయోగించి రక్కసులు రామ దండు నెదుర్కొనుచుండిరి. ఇట్లుభయ పక్షముల మధ్య ఘోర సంగ్రామము జరిగెను. పిశితాశనులు ప్రాకారములనుండి త్రోయుచున్న గుండ్లను, బండ్లను క్రింద బడక మునుపే కపి వీరులు వాని నొడిసి పట్టుకొని తిరిగీ రాక్షసుల పైననే ప్రయోగించుచుండిరి. భయద భీకరులగు నిశాటుల ప్రచండోత్సాహమును లెక్కించక కోటాను కోట వనచర వీరులు ప్రాణములకు తెగించి ప్రాకారములపై కెగబ్రాకిరి. ఇట్లు చీమల పుటలు పగిలినట్లు అసంఖ్యాక వానరసేన కోట కొమ్ములపై కెక్కి— 'జయత్యతిబలో రామః' అని సింహనాదములు జేసి రాక్షసుల పై విరుచుక పడెను. కొందరు రాక్షసులను కోటలనుండి క్రిందకు పడద్రోసి మరి కొందరిని ముష్టి ఘాతములతో మర్దించి, మరి కొందరిని కాళ్ళుపట్టి గిరగిర త్రిప్పి నేలకేసికొట్టి, ఇంకొందరిని చేతులతో కాళ్ళతోనూ నుగ్గునూచ జేసి శత్రువధ చేయసాగిరి. అంతకంతకూ పెరిగిన సంఖ్యాబలముతో ఉక్కు పిండముల వలె ఉద్దండులై తండలు తండలుగా మీదికొచ్చుచు శాఖాచరుల తీవ్రధాటికి నిలువలేక నిశాచరులు వెన్నిచ్చి పారి పోయిరి. వానరులు విజయోద్దీప్తులై వైరి దళములను వెన్నంటి తరిమి, వైరి భయోత్పాతముగా వానర లోక ప్రమోదముగా విజయధ్వానములు చేసిరి.

కపివీరుల విజయారావము లంక ప్రతిధ్వనించెను. ఉప్పెనవలె నురుగులు గ్రక్కుచూ మీదికి వచ్చి పడుతున్న వానర వాహినీ ఉధృతము నెదురించలేక నిశాచరులు భయాక్రాంతులై పరుగెత్త సాగిరి. దశకంఠు డదిచూచి ఉగ్రుడై పండ్లు పటపట గీటి పారి పోవుచున్న సైన్యమును నిలువరింపజేసి — "ఓరీ పిరికి పందలారా! నిరంతరము భోగపరాయణులై యున్నందున పౌరుషాభిమానములు చచ్చి నిర్వీర్యులై యున్నారు. ఇదిగో, సిగ్గు లేక వైరికి వెన్నిచ్చి పారిపోవువారిని నా వజ్రాయుధమునకు బలి పెట్టెద—" నని హుంకరించి భయపెట్టెను. నిర్దయుడగు నిశాచనారథుని చేతిలో దుర్మరణము చెందుటకంటె యుద్ధములో వీర స్వర్గమలంకరించుట శ్రేయస్కరమని భావించి పిశితాశనులు వెనుదిరిగి పునః యుద్ధోన్ముఖులైరి. రాత్రించరులీమారు రెట్టించిన రోషముతో ప్రళయకాల సముద్రమువలె పెలుబికి వైరి బలముల తాకెను. ఆవేశపూరితులగు అసురవీరులు చిచ్చర పిడుగులవలె రాఘవసేనపై విరుచుక పడిరి. క్రోధోద్దీపితులై పునః ప్రకోపించిన నరాంతకులను మార్కొనలేక కపిసైన్యము కలగుండు జెంది కకావికలయ్యెను.

పవనసుతుడపుడు పశ్చిమద్వార రంగమున మేఘనాధునితో పోరాడుచుండెను. ఎంతసేపటికిని ప్రవేశ ద్వార మతని అధీనము కాకుండెను. మహావీరు డందులకు కినిసి రోష భీషణ స్వరూపుడై సింహగర్జనచేసి నగర ప్రాకారముపైకి కుప్పించి ఎగిరెను. ప్రాకార శిఖరోపరిభాగమున నిలబడి పవనాత్మజుడు పర్వతఖండము నొకదానిని పైకెత్తి దానితో మేఘనాధుని హయ రథ సారధులను నుగ్గునూచ అగునట్లు చేసెను. అక్కడనుండీ కుప్పించి మేఘనాధుని పైకి దూకెను. ఒక్క ఒక్క తీవ్ర ప్రహారణము దేవాంతకుని రొమ్ముపై ప్రయోగించి రక్తము గ్రక్కుచూ నేల కొరుగునట్లు చేసెను. మేఘనాదు డటు మూర్ఛాగతుడగుటజూచి మర్కటోత్తముడు రోదోంతరాళములు ప్రతిధ్వనించునటుల జయగర్జన చేసెను.

పవనతనయుడు పశ్చిమ ద్వారము భేదించెనని తెలుసుకొని అంగదుడు ఔత్సాహితుడై అంగలలో వచ్చి ఆంజనేయుని కలుసుకొనెను. బలవిక్రమోపేతులగు ఆ యోధాగ్రగణ్యు లిరువురు ఒక్కటై విజృంభించి, ప్రాకారములను పడద్రొన్ని, దుర్గ ద్వారములను పగులగొట్టి, బురుజులను కూలద్రోసి, శాత్రవ సమూహము పరితక తమగునటుల వీర విహారము చేసిరి. వారిచే హతులైన దనుజుల తలలు కుప్పలు కుప్పలుగావచ్చి రావణుని చెంత బడుచుండెను. ఇట్లు వైరిదళములను కకావిక

లగునటు పారద్రోలి, నాటికి దినాంతమగుటచే ఆ వీరులిద్దరు తమ స్వామివద్దకువచ్చి చేరుకొనిరి. దాశరథి ప్రసన్నదృష్టి ప్రసరించగనే వారికి శరీర శ్రమ శాంతించి చిత్తమునకు స్వస్థత కలిగెను.

రక్కసులకు రాత్రులందు బలమెక్కువ. రాత్రించరుల శక్తి సామర్థ్యములకు అది అనుకూల సమయము. ప్రదోషకాలము ప్రవేశించగనే పౌలస్త్యుని సేన బలము పుంజుకొని పునఃప్లవంగ వీరులపై వచ్చిపడెను. నిమేషకాలములో మరలా మహా సంగ్రామము ప్రారంభమై శరత్కాల మేఘములచందము ఒండొరులు విక్రమించి దాడ్కొనిరి. ఉభయులకు బాహాబాహి ముష్టాముష్టి హోరాహోరి యుద్ధమారంభమాయెను. అతికాయ అకుంపనాది అసుర వీరులు ఆరితేరిన మాయా యుద్ధ ప్రవీణులు. వారు దశ దిశల అంధకారమును మరింత దట్టముగా వ్యాపింపజేసి వానరులపై రక్తశిలావృష్టి వరి ంపజేయ దొడంగిరి. రక్కసులు ప్రళయకాల మేఘ గర్జన లంబోలె పెడబొబ్బలిడుచూ చీకటి చాటున వానర భల్లూక యూథములపైబడి చేతికందిన శత్రువులను చీల్చుచూ, చెండాడుచూ, భక్షించుచూ పిశాచముల పగిది నానా భీభత్సము చేసిరి. ఆగాఢాంధకారమందు వానరులు స్వపరపక్షము లెయ్యవో గుర్తించనేరక, తమ యూథపతుల సంకేత సందేశములను అందుకొనజాలక తికమక పడి దిగులుపడిపోయిరి.

రాఘవుడు ఆహవమున తనవారికి కలుగుచున్న ఆపత్తును అప్రమత్తుడై గమనించెను. తక్షణమే దాశరథి విల్లెక్కుపెట్టి వైరి దళములపైకి ఆగ్నేయాస్త్రము ప్రయోగించెను. కాకుత్స్థమణి కోదండమునుండి వెలువడిన శిలీముఖాగ్నిజ్వాలల దీప్తికి అంధకారము పటాపంచలయ్యెను. జ్ఞానోదయముచే అజ్ఞానము నశించు భంగి అసురలచే కల్పించబడిన అంధకారము వైదొలగి రంగస్థలము ప్రకాశవంతమై భాసించెను. ఈ యవకాశముం వానర వీరులు పరాక్రమించి ముష్కరులను ముట్టడించి మారణహోమము చేయసాగిరి. రోషోద్దీపితులై రొప్పుచూ కాలాంతకులవలె కదన రంగమున విజృంభించిన కపిసేన ధాటికి తాళజాలక రక్కసిమూకలు ప్రాణార్తులై లంకలోనికి పరుగులు దీసిరి. ఈ ప్రకారము ఆనాటికి రణాంగణమున రక్కసుల ప్రుక్కడించి రాముని సేన దిశలు ఘూర్ణిల్లునట్లు జయధ్వానములు చేసుకొనుచూ స్కంధావారము చేరుకొనెను.

## మాల్యవంతుని హితబోధ

ప్రప్రథమముననే పరాజయము సిద్ధించినందుకు సంక్షిప్తముఖుడు బహుళముగా దుఃఖించెను. ఆరాత్రి దశముఖుడు తన సచివసేనాపతు లందరిని సమావేశపరచి, వారితో "ఓ యోధాగ్రగణ్యులారా! నిన్నటి పోరులో మనకు లభించిన పరాజయ, పరాభవములకు మనలో ప్రతిఒక్కడు బాధపడుచుండును. వెంటనే ఇందుకు ప్రతిచర్య తీసుకొని గత గౌరవమును కాపాడుకొనుటకు దీక్షాబద్ధులము కావలెను. సమరాంగణమున శత్రు నిశ్శేషమొనర్చి జయలక్ష్మిని చేపట్టుటకుగాను భావి కార్యక్రమమును యోచింపుడు"— అని పలికెను.

మాల్యవంతుడు రావణునికి మంత్రి, మాతామహుడు మరియు వయోవృద్ధుడు. అప్పుడా సాత్వికుడు సభలో నిలబడి సురారి నిట్లు సంబోధించెను.

"రావణా! ప్రస్తుతము రామునితో వైరము మనకు ఎవ్విధముగానైననూ వాంఛనీయముగాదు. నీవు వర గర్వితుడవై విజ్ఞత కోల్పోయి శత్రువుల శక్తి సామర్థ్యములను సైతము గణించక ఉపేక్షించుచున్నావు. అదిగాక శ్రీరాముని సామాన్య మానవునిగా వూహించుకొనుటయందే నీవు అజ్ఞానము నాశ్రయించితివి. దశాననా! జగదంబ జానకిని హరించి లంకకు తెచ్చిననాటినుండియే మన కన్నియూ దుర్నిమిత్తములే తోచుచుండుట ఈ సందర్భమున విస్మరింపజాలము. సాకేతవీరుడు సాక్షాత్ విష్ణ్వంశ సంభూతుడు. హిరణ్యాక్ష హిరణ్యకశిప మధుకైటభాది సురాంతకులను సంహరించి దేవజాతికి నిరపాయ సుఖంబు ప్రసాదించినది ఈ రాఘవోత్తముడేయన్న సత్యము విస్మరింపకుము. బ్రహ్మ మహేశాది దేవతలకు ఆరాధ్యస్వామి ఆ ఆదినారాయణమూర్తి కాల స్వరూపుడై అవతరించి దుష్ట శిక్షణకు పూనుకున్నాడు. లంకేశ్వరా! హితా హితములను గుర్తించి పెద్దల బోధనలు పెడచెవిని బెట్టవలదు. జాతి శ్రేయస్సు లోకక్షేమమాశించి, జానకిని శ్రీరామునికి సమర్పించుకొని సుఖించుట సంప్రతి మనకు శ్రేయోదాయకమైన మార్గము."

మాల్యవంతుని మాటలకు దనుజనాథుడు క్రోధ వివశుడై మండిపడెను. అతడత్యంతోగ్ర మానసుడై పండ్లు పటపట గిటి— "ఓరీ జరాగ్రస్తుడా! శత్రువును శ్లాఘించు నీబోటి శఠునకిక్కడ స్థానములేదు. వయోవృద్ధుడవని నిన్ను క్షమించి విడిచిపుచ్చుచున్నాను. లేకుండిన ఈ పాటికి నీవు యమలోక యాత్ర చేసియుందువు." అని ధిక్కరించి తూలనాడెను. త్వోత్కర్ష ప్రియుడు, స్వబల గర్వితుడగు శఠ మూర్ఖునితో సంభాషించుట భావ్యముగాదని తలంచి మాల్యవంతుడు సురారి భవదలిపెట్టి స్వగృహమునకు పోయెను.

మాల్యవంతుడు నిర్గమించగనే రావణుడు ద్విగ్నమానసుడై చిరచిరలాడజొచ్చెను. చిత్తశాంతిని గోల్పోయి చీకాకుతో సభలో అటూ ఇటూ తిరుగుచున్న తండ్రిని సమీపించి మేఘనాథు డిట్లు ధైర్యము పలికెను.

"నాయనా! దేవతలను దిక్కులకు తరిమి వారి నాయకుని జుట్టు పట్టుకొని నీ ఇంటికి దెచ్చిన ఈ వీరపుత్రుడు ఇంద్రజిత్తు ఉండగా! నీవు అధైర్యపడుట భావ్యముగాదు. ఓ తండ్రీ మాటలతోగాక రేపు చేతలతో సమరాంగణమున నా శక్తి సామర్థ్యములను ప్రదర్శించి నీ మన్ననల నందుకొనగలవాడను". పుత్రుని వీరోచిత ప్రతిజ్ఞకు సంతోషించెను. రావణుడుత్సాహితుడై కుమారుని అక్కునజేర్చి, అతని పౌరుష ప్రతాపమును అభినందించి తన హర్షము ప్రకటించెను. రావణుడా రాత్రంత్రయు తనయునితో, దళపతులతో సంప్రదించుచూ గడిపెను.

## మేఘనాధుని యుద్ధము

వానర భల్లూక సైన్యము తిరిగి దైత్యపురిపై విజృంభించెను. అనుకల కలముతో భలున తెల్లవారెను. ఇంద్రజిత్తు కనక రథంబారోహించి శస్త్రాస్త్ర సేనా సమేతుడై కాలాంతకుని పగిది కదనభూమికి కదలెను. ఆ దేవాంతుకుని వెంట దనుజయోధు లనేకులు హయరథ గజాశ్వాది వివిధ వాహనారూఢులై, తోమర ముద్గర పరశు పరిఘపట్టిస శూలాద్యాయుధపాణులై, భేరీభాంకర నినాదంబుల భూనభోంతరాళములను ప్రతిధ్వనింపజేయుచూ, ఆగ్రహోదగ్ర స్వరూపులై ముందుకురికి వైరిబలమును ఢీకొనిరి. రెండు మహా సముద్రములు సంఘర్షించునట్లు ఇరుదళములకు ఘోర సంగ్రామము జరిగెను. వానర భల్లూక వాహిని ఉద్రేకోద్వేగముతో వెల్లువికి జాతుధాన సమూహమును ముంచెత్తెను. కపివీరులు పర్వతములను, శిలలను, వృక్షములను రక్కసుల పైరువ్వసాగిరి. నిశాచరులు ఖడ్గ శూలాద్యాయుధములతో వానరుల నెదుర్కొని భయంకరముగ పోరాడిరి. మాయా యుద్ధ ప్రవీణుడు, లోక భీకరుడగు రావణ తనయుడు రోషావేశుడై ముందుకురికి "—ఓరీ కోసల కుమారులారా! ఓరీ నలనీల అంగద హనుమంత సుగ్రీవ విభీషణాది వానర వీరులారా! మీరెక్కడ దాగియుంటిరి!" అని వీరా



# రామచరిత మానస్

లాఘవము చేయుచూ ధనుష్టంకారముచేసి శాత్రవ సమూహాముపై బాణములను కురిపించెను. వాని శరపరంపరలు చిచ్చర పిడుగులవలెవచ్చి వానర సేనపై వర్షింపసాగెను. వానరులు ఎటువైపు చూచిననూ, ఎక్కడి పోయి మేఘనాధుని బాణములు రెక్కలున్న సర్పములవలె పుంఖాను పుంఖములుగావచ్చి మీదబడుచుండెను. ఆ అపూర్వ శర వృష్టికి సమరాంగణ మంతయూ కప్పబడిపోయెను. నరాంతకుని ఖరతర నారాచ ప్రయోగ ధాటికి కపికులము తికమకజెంది గగ్గోలుపడెను. మేఘనాధుని బాణ ప్రవాహములకు వెరగొంది దిక్కులు జూచుచున్న తనవారి దురవస్థ గ్రహించిన ఆంజనేయుడు ఆగ్రహోదగ్రుడై ఒక మహా పర్వతమును పెకలించుకొనివచ్చి దానిని మేఘనాధునిపై విసరికొట్టి సింహనాదము గావించెను. ఇంతలో ఇంద్రజిత్తు చటుక్కున రథమునుండి పైకెగసి రెప్పపాటులో పర్వతమును తప్పించుకొనెను. కానీ ఆ పర్వతపాతమునకు వాని రథ హయ సారథులు నుగ్గునూచయిపోయెను వాయుపుత్రుని బల వీర పరాక్రమములు ఇంద్రజిత్తుకు ఇంతకుపూర్వమే తెలుసును. అందుచే అతడు మారుతి మార్గమును యుక్తియుక్తముగ తప్పించుకొనిపోయి రఘురాముని దాకెను. సాకేతవీరుడు అవలీలగా సురాంతకుడు ప్రయోగించిన సాయకములను తుత్తునియలుగాజేసి, ప్రతి బాణములతో వాని శరీరమును తీవ్రముగా గాటవేసెను. రఘువీరునితో ముఖాముఖి యుద్ధము జేయుట నిరర్థకమని భావించి ఇంద్రజిత్తు పైకెగసి మేఘములను చాటు చేసుకొని మాయా యుద్ధమునకు పూనుకొనెను.

నిముషములో గగన పథమంతయు మేఘాచ్ఛన్నమై కటి చీకటులు క్రమ్ముకొనెను. ఆ గాఢాంధకారములో పైనుండీ కపిసేనపై రక్త మాంసముల మాత్రములు వర్షింపసాగెను. మరొక ప్రక్క భూత ప్రేత పిశాచములు స్వేచ్ఛగా విహరించి వింత వింత బ్రమలతో వైరి గుండెలకు దడ బుట్టించెను. కటికచీకటి, పైనుండీ రుధిర ధారలు, పిడుగుల వర్షము, పిశాచముల భయంకరారావములు, వానరులు ప్రళయ మేదో రానున్నదని భయాక్రాంతులై భీతిల్లజొచ్చిరి. రఘువీరుడంతట రోషావేశముతో ఒక్క మహాస్త్రము నుపయోగించి మేఘనాదుని మాయా ప్రభావమును పటాపంచలు చేసెను. ఆ ముష్కరుడా దెబ్బతో మేఘముల చాటునుండీ బయటపడి ప్రత్యక్ష యుద్ధమునకు పూనుకొనెను.

రావణజిత్తులకు కోపోద్రిక్తుడై యున్న రామానుజుడు హనుమంతాది వీరులను వెంటనిడుకొని ముందుకువచ్చి ముష్కరుని దాకెను. అసమాన ధనుర్విద్యాపారీణులు, అతి బల విక్రమోపేతులగు లక్ష్మణ ఇంద్రజిత్తులకు ముఖాముఖి యుద్ధము ముమ్మరముగా ప్రారంభమాయెను. ఇంతలో దశగ్రీవుడు తనయునికి తోడుగా ఉద్దండులగు అనేక యోధానుయోధులను యుద్ధభూమికి ఉరికించెను.

రామకీజయ్—రావణకీ జయ్—యని సింహనాదములుచేసి వనచరులు, రాత్రించరులు ఉగ్రులై ఒండొరుల ఢీకొని భీకరముగా పోరాడసాగిరి. నిశాటులు నానావిధ మారణాస్త్ర ప్రయోగములతో మర్కటులను మర్దించిరి. వానరులు పర్వత తరు పాషాణములతో నరభక్షకులను ప్రహరించిరి. వానర రాక్షసులకు జరిగిన ఆ అపూర్వ యుద్ధగతిని దేవ గరుడ గంధర్వాది దివిజులు విమానారూఢులై తిలకించుచుండిరి.

దుష్కరమగు ఆ దొమ్మియుద్ధము వర్ణింప శక్యముగానిది. రక్తము మడుగులుగట్టి రణాంగణమంతయూ రక్తార్ణవమయ్యెను. ధూళిచే కప్పబడిన రుధిరభూమి నివురుగప్పిన నిప్పువలె కన్పించసాగెను. క్షత విక్షతమై రుధిర ధారలు స్రవించుచున్న యోధుల శరీరములు పుష్పిత పలాశ వృక్షముల చందమున శోభించుచుండెను.

పౌరుష ప్రతాపబల వీర్యములందు సరిసమానులగు రామానుజ రావణాత్మజులు పరస్పర విజయకాంక్షులై ప్రాణపణముగా పోరాడిరి. ధూర్తుడగు ముష్కరుని మాయోపాయములకు లక్ష్మణుడు నిముసములో అటకట్టించెను. అట్లు మేఘనాదుడు కూడ సౌమిత్రి శరచాప కౌశలమును వమ్ముజేసెను. సౌమిత్రి అంతకంతకు శత్రు దుర్నిరీక్షణ తేజోవిరాజితుడై నిశిత సాయకములు ప్రయోగించి రాక్షసయోధుని రథహయ సారథులను ధ్వంసము చేసి వానిని విరథునిగా జేసెను. మేఘనాదు డంత రోషోద్దీపితుడై మండిపడి, అంగదాది వానర వీరులను శర విద్ధాంగుల జేసెను. అతుల బల విక్రమోపేతులగు ఆ ఇరువురు ఒకరింకొకరికి తీసిపోక పరాక్రమించి పోరాడిరి. ఆ సంకుల సమరమునకు రంగస్థలి అంతయు మాంసశోణిత మండితంబై మహా భయంకరముగా నుండెను.

తన యుక్తి ప్రయత్నములన్నియూ వైరి ఎడ విఫలమగుచుండుటకు క్రుద్ధుడై మేఘనాదుడు తుదకు వీరఘాతిని శక్తిని చేతికి తీసుకొనెను. బ్రహ్మదత్తమగు ఆ మహాస్త్రమును అభిమంత్రించి సౌమిత్రికి సూటిగా తగులునట్లు ప్రయోగించెను. ఘాతుకమగు ఆశక్తి సూటిగా వచ్చి వక్షమున దాకుటచే లక్షణమూర్తి తక్షణమే మూర్ఛిల్లి నేలకొరిగెను. ధరాశాయియై పడియున్న లక్ష్మణుని ఎత్తుకొనిపోవుటకై దనుజులు ప్రయత్నించిరి. అయితే, వారెంత ప్రయత్నించిననూ శేషావతారుని శరీరమును ఇంచుకంతయూ కదలించలేక విఫల మనోరథులై వెనుకకు మరలిపోయిరి. ఇంతలో సంధ్యాసమయమగుటచే ఉభయ పక్షములవారు పోరు విరమించి తమ తమ స్కంధావారములకు విశ్రమించిరి. (సశేషం)

## కథ కాని కథ

### ఎవరికి ఎవరు కాపలా?

రమా వారికి స్నేహితు డొక డుండే వాడు. ఆ అబ్బాయి అక్కయ్య బొంబాయిలో ఉండేది. ఒకసారి వేసంగి సెలవుల్లో అతనికి వాళ్ళక్కయ్యను చూచి, నాలుగు రోజులుసర్దాగా బొంబాయిలో కాలం గడిపి రావాలనిపించి బొంబాయికి వెళ్లేడు. ఒకరోజు మధ్యాహ్నం ఏదో ఫలహారం చేద్దామని కొబ్బెర, చక్కెర అన్నీ దగ్గర పెట్టుకొని కూర్చుంది. వాళ్ళ అక్క. ఆమెకు ఒకపక్క తమ్ముడు కూర్చుని ఏమేవో కబుర్లు చెపుతున్నాడు. ఇంకోపక్క వాళ్ళ కుక్కపిల్ల కూర్చుని రమణనే చూస్తూ వుంది.

ఇంతలో ఆవిడయేదో గుర్తు వచ్చినట్టు లేచి "ఒరే కొబ్బరి తురుముపీట పక్కింటి వాళ్ళ నడిగి తెస్తాను గాని అంతవరకు కొబ్బరిని కుక్కపిల్ల ముట్టకుండా చూస్తూవుండు రెండు నిమిషాల్లో వచ్చేస్తా" అని బయలు దేరింది. అక్కడ కబుర్లల్లో పడి ఆవిడ వచ్చేసరికి పదిహేను నిమిషాలయింది.

ఇక్కడ రమణకు కొబ్బరి ముక్క తినాలని బుద్ధి పుట్టింది. సరే అని కొబ్బరి చిప్ప తాకేసరికి అక్కడే కూర్చున్న కుక్క భౌయ్యమని వాడి మీదికి లేచింది. ఎన్నిమాట్లు ప్రయత్నించినా కొబ్బరి ముక్కను మాత్రం తాకనివ్వలేదు ఆ కుక్క. ఇంతలో వాళ్ళక్క తిరిగి వచ్చింది. వస్తూనే "అక్కా నువ్వు కుక్కపిల్లకు నన్ను కాపలాపెట్టావా లేకపోతే నాకు కుక్కపిల్లను కాపలా పెట్టావా?" అని అడిగాడు తమ్ముడు. వాళ్ళకు, జరిగిన సంగతంతా వివరించాడు. "కుక్క పిల్ల గట్టిదే సుమా!" అని దాన్ని ముద్దాడింది వాళ్ళక్క.

రుక్మిణీదేవి (అహమ్మదాబాదు)

# పాపకి రాత్రి గుండె జలుబు ముమ్మరంగా ఉంది

కాని హాయిగా నిద్రపోయింది, పొద్దుటే నవ్వుతూ ఆరోగ్యంగా లేచింది. శమనం కల్గించే అనోలియం తో పాప గుండె జలుబు మటుమాయమైంది.
ఔనుమరి, అనోలియం శీఘ్రంగా గుణాన్నిచ్చే సౌమ్యమైన నొప్పుల నివారిణి.
అతి కోమలంగా ఉండే చర్మాలకు ప్రత్యేకంగా తయారు చేయబడింది.
దీనిలో ఉండే అమోఘమైన మందులు అతి శీఘ్రంగా జలుబుని, తలనొప్పిని మరియు నరాల నొప్పులను తగ్గిస్తాయి. మీరూ దీనిని ఉపయోగించవచ్చు.
అవసరానికి అందుబాటుగా ఎప్పుడూ ఇంట్లో ఒక ట్యూబును ఉంచండి.







# అనోలియం

శీఘ్రంగా గుణాన్నిచ్చే సౌమ్యమైన నొప్పుల నివారిణి

అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ.

JWT-AM-AN-2362

పురాణాలను అవగాహన చేసుకున్నా కొడుకు లిద్దరికే వాళ్ళు చదువుకున్నంత వరకూ ఇంగ్లీషు చదువులు చెప్పించి ఉన్నత స్థాయిలోని ఉద్యోగాలు చేయించాలని అభిలాష పడ్డాడు. అభిలాషలన్నీ గగన కుసుమాలుకాగా ఫస్టుఫారంనుంచే తప్పటం మొదలు పెట్టాడు కృష్ణమూర్తి. ఆయనకోరిక ఒక్కొక్క మెట్టూ దిగిపోగా కృష్ణమూర్తి కనీసం సెకండరీగ్రేడు టీచరయినా చాలుననే పరిస్థితి ఏర్పడింది. అందుకూడా నోచుకోన ట్లుగా ఆయన స్వాతిశయాన్ని సమూలంగా నాశనం చేసి స్వాతిని చేపట్టాడు కృష్ణమూర్తి. దాంతో ఆయన సగం కృంగిపోయి "అభావే విరక్తిః" అన్న ఆర్యోక్తి ననుసరించి తనరెండు కళ్ళలో ఒకకన్ను పోయిందనుకున్నాడు. నిజంగా ఒక కన్నుకు ఆపరేషన్ చేయించుకోవాల్సి వచ్చింది.

పువ్వు పుట్టంగానే పరిమళిస్తుందన్నచందాన జానకిరాం ప్రతి క్లాసులోనూ ఫస్టు మార్కు తెచ్చుకుంటూ అందరి ఆదరాభిమానాలనూ చూర గొంటూ స్కూలు ఫైనలులో యూనివర్ సిటీలో ప్రథమ శ్రేణి మార్కులు తెచ్చుకున్నాడు. గోపాలశాస్త్రి మనస్సు ఆనందంతో వరవళ్ళు తొక్కింది. వీడు ఐ.ఏ.యస్ ఆఫీసరవుతాడని అందరితో అనేవారు. అందరిచేతా అనిపించుకుని ఆ మాటలు విని తన అభిప్రాయాలకు పందిళ్ళు వేయించుకునే వాడు. పూర్తి స్కాలర్‌షిప్‌తో ఆనర్సులో చేర్పించాడు. ఆ రోజున ఆయన ఆనందం ఆకాశవీధిలో విహరించింది. జానకిరాం కూడా ప్రతి ఏడూ ప్రథమ శ్రేణిలో వస్తూ ఆనర్సులో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయాడు. కృష్ణమూర్తితో మరుగుపడిన శాస్త్రిగారి పరువం మళ్ళా చిగిర్చి సువాసనలను వెదజల్లింది. పెద్ద కొడుకుతో పెళ్ళి ముచ్చట్లు తీరకపోయినా చిన్నకొడుకు పెళ్ళిలో ఆయన నిఖారుసైన వియ్యంకుడిగా నిలబడ్డాడు. ఈ కొడుకు పెళ్ళి ఆయన హుందాతనానికి వింజామరలు వీచింది. జానకిరాం తెలివితేటలకీ, చదువుకూ అంతా హారతులిచ్చారు. పెళ్ళిపీటల మీద కూర్చున్న జానకిరాంను ఆనంద భాష్పాల మధ్య అరమోడ్పు కన్నులతో చూస్తుంటే నిజంగా ఐ.ఏ.యస్ అధికారిలానే కనబడ్డాడు శాస్త్రిగారికి. కోడలు గౌతమికూడా అపర సరస్వతి దేవిలానే కనిపించిందా సమయంలో.

గౌతమి కాపురానికి వచ్చింది. విద్య విజ్ఞానం కోసమేగాని సంపాదనకు కాదన్నాడు జానకిరాం. డొక్కలో తన్నినట్లయింది శాస్త్రిగారికి. నేను ఉద్యోగం చేసి సంపాదించకపోతే పొట్ట గడవదా అన్నాడు జానకిరాం. చెంపమీద ఛెళ్ళున కొట్టి నట్లయింది ఆ వృద్ధునికి. ఉద్యోగం చెయ్యటం కోసమే నన్ను ఇంత వరకూ చదివించారా నాన్నా అన్నాడు జానకిరాం. ముసలాయన గుండెల్లో బాకు దిగినట్లయి ఆయన విలవిల్లాడాడు. ఉద్యోగం చెయక పోతే నాకీ ఇంట్లో స్థానంలేదా అమ్మా అన్నాడు జానకిరాం. కన్న తండ్రి ప్రాణం ఎగిరి పోయింది. కన్న తల్లి హృదయంలో ఏ ఆశా, ఏ కోరికా, ఏ విషయమూ మిగల్లేదు. శూన్య హృదయురాలుగానే జీవిస్తున్న దావిడ. క్రమేపీ కొడుకు ఉద్యోగం విషయం మాట్లాడ్డమే మానేశారు శాస్త్రిగారు. ఒకానొక సమ యంలో భార్యతో అన్నారాయన "పురిటిలోనే సంధి కొట్టి పోయినవాడు కృష్ణమూర్తి. ఎ



# ఎండమావులు

కాలం మన కళ్ళముందు తిరుగుతూ ఉండే పసివాడు జానకిరాం."

అలాంటి కొడుకులు ఉద్యోగాలు చెయ్యక పోవటంవల్ల శాస్త్రిగారి ఉద్యోగపు కాంక్ష కోడళ్ళు తీరుస్తున్నారు. గౌతమికూడా ఉద్యోగంలో చేరిందని వినగానే భార్యను చూసి ఆయన పేలవంగా నవ్వి కళ్ళు తుడుచుకుని "పోనీలే కోడళ్ళ సంపాదనతో నైనా మన ప్రబుద్ధులు బ్రతుకుతారు వాళ్ళు చెయ్యలేని ఉద్యోగాలు వీళ్ళు చేస్తున్నారు. అదీ ఒక చెప్పుకో తగిన విషయమే" అని అన్నారు.

## 23

శలవలకు మురహరి వచ్చిన ఈ వారం రోజుల్లోనూ జ్యోతి ఎప్పుడూ అతనితో మాట్లాడ లేదు. జ్యోతికి మాట్లాడాలని ఉన్నా ఆ సమయానికి సిగ్గు అడ్డుగా నిల్చేది. ఆ సిగ్గును వెనక్కు నెట్టి ఏదో ఒక మిషతో బావను పలకరించాలని అనుకున్నా జ్యోతి తల్లి అడ్డుగా వచ్చేది. మురహరి వచ్చినప్పట్నుంచి ఆమె ఎప్పుడూ కూతుర్ని కనిపెట్టుకునే ఉండేది. వాళ్ళిద్దరూ మాట్లాడుకోటానికి అవకాశాన్ని కలుగనిచ్చేది కాదు. ఇష్టగోష్ఠి కబుర్లుగా మేనమామతో మాట్లాడే వాడు గాని, జ్యోతితో మాట్లాడాలనే అభిలాష ఎప్పుడూ మురహరికి కలగలేదు.

ఆ రోజున ఆర్. డి. ఓ గారింట్లో పేరంటమైతే జ్యోతి తల్లి, చెల్లెళ్ళూ వెళ్ళారు. జ్యోతికి మొదటినుంచీ పేరంటాలకు వెళ్ళే అలవాటు లేదు. కారణం ఒక్కటే. తెల్సినవాళ్ళంతా జ్యోతికి మేనరికమే చేస్తారా అని అనటం, తల్లి ఏవో సాకులు చెప్పి మేనరికం చెయ్యమని చెప్పటం పరిపాటయింది. అందువల్ల జ్యోతి పేరంటాలకు వెళ్ళటమే మానింది. కూతురికి తోడుగా పదేళ్ళ వాడిని కొడుకుని ఇంట్లో ఉండమని చెప్పి, వాడితో రహస్యంగా అక్కయ్యని బావతో మాట్లాడనివ్వద్దని పదే పదే హెచ్చరించి తన హెచ్చరికను పాటించటానికిగాను వాడికి కొనుక్కు తినటానికి పావలా కాసు యిచ్చి ఆవిడ పేరంటానికి వెళ్ళింది. అదే సామాన్యుల యిల్లయితే ఈ పరిస్థితులలో ఆవిడా వెళ్ళడం మానేసేది. కాని, తమకన్న గొప్ప వారి ఇల్లు, తమ పై అధికారిగారిల్లు. పైగా ఆవిడ కారు పంపించింది. అంచేత వెళ్ళక తప్పింది కాదు. ఆవిడ వెళ్ళే సమయంలో మురహరి కూడా ఇంట్లో లేడు కనుక ఆవిడా ధైర్యంగానే వెళ్ళింది.

జ్యోతి తన గదిలో కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటున్నది. తల్లి ఆజ్ఞ ప్రకారం హరనాథ్ కూడా అక్కడే ఉన్నాడు. తాసిల్దారుగారు క్యాంపు వెళ్ళారు.

"అక్కయ్యా, బావతో నువ్వు మాట్లాడ కూడదా" అన్నాడు హరనాథ్.

"ఎందుకు మాట్లాడకూడదు. మన అత్తయ్య కొడుకేగా. ఎవరన్నారు మాట్లాడగూడదని" అన్నది జ్యోతి.

"అమ్మ చెప్పింది."

"అట్లాగా. అమ్మకు బావంటే కోపం. వాళ్ళకు మనంత ఆస్తి, డబ్బూ లేవు. అందుకని

అమ్మకు కోపం."

"ఓస్, అదా సంగతి" అన్నాడు హరనాథ్ అంతా తెలిసినవాడిలా.

"మరెందు కనుకున్నావు."

"నాకేం తెలుసు." అంటూ పావలా కాసు చూపించాడు.

"అమ్మ ఇచ్చిందా."

"అవును."

"ఎందుకూ"

"నువ్వు బావతో మాట్లాడకుండా చూట్టానికి."

కన్న తల్లి అని చెప్పుకోటానిక్కూడా సిగ్గుచేటు అనుకుంది మనస్సులో జ్యోతి.

"అందుకా నువ్వు ఇంటో ఉంది. లేకపోతే ఈపాటికి నువ్వు రోజూ ఇంట్లో ఉంటున్నావా. అయినా బావ ఇంట్లో లేడుకదా, అమ్మకూ, నీకూ మతి లేకపోతే సరి." అన్నది నవ్వుతూ జ్యోతి, వాడి తలమీద చిన్నగా ఒక మొట్టికాయ వేసి.

వాడూ నెత్తి గోక్కుంటూ "నిజమే. బావ ఉంటే కాపలా గాని, బావ లేకపోతే కాపలా ఏముంది. అట్లా వెళ్లి ఒక రౌండు కొట్టొస్తాను" అంటూ ఉడాయించాడు. వాడి తెలివి తేటలకు నవ్వుకుని, తల్లి ఆతీరుగా ఉన్నందుకు మనస్సులో బాధపడుతూ ఆలోచిస్తూ కూర్చుంది జ్యోతి.

"ఈ సమయంలో బావ వస్తే బావుండును." అనుకుంది జ్యోతి మనస్సులో. తన గదిలోనుంచి వెళ్లి హాల్లో సోఫాలో కూర్చుంది. అయిదు నిమిషాల్లో మురహరి వచ్చాడు. వస్తూనే జ్యోతిని చూసి తలొంచుకుని తన గదిలోకి వెళ్లాడు. ఏదో పుస్తకం తీసుకుని వెంటనే వచ్చేసి మళ్లీ ఎక్కడికో వెళ్లబోయాడు. జ్యోతి లేచి నిల్చుంది.

"ఎక్కడికి బావా అంతా హడావుడిగా వచ్చి వెళ్లిపోతున్నావ్" అన్నది జ్యోతి ప్రాణాలు బిగపట్టుకుని ఈ మాట మాట్లాడినందుకు గుండెలు దడదడ లాడినయ్యి.

"ఈ వూళ్లో ఉన్న స్నేహితుడు ఏదో పుస్తకం కావాలంటేను తీసుకెళుతున్నా, ఇంట్లో ఎవ్వరూ లేరా."

చెప్పింది జ్యోతి.

"కాసేపు కూర్చుని మాట్లాడి పోతే అరిగిపోతావా." ధైర్యంగా అనేసింది.

"ఏంలేదు జ్యోతీ, స్నేహితుడు కనిపెట్టుకు ఉంటాడు. అందుకని. నువ్వు మాట్లాడమంటే తప్పక మాట్లాడుతాను. ఆ. ఏం మాట్లాడమంటావు." ముళ్లమీద నిల్చున్నట్టుంది మురహరికి.

"మనస్సులో మాట్లాడాలని ఉంటే కబుర్లు దొరకవా బావా! మేనత్త, మేనమామ బిడ్డలము. కొత్తవాళ్లం కాదుగదా, నేనంటే అంత తప్పుకు తిరుగుతావేం."

సూటిగా, మనస్ఫూర్తిగా అడిగేశాననుకుంది. ఆప్యాయతా, సంతోషమూ ఆమె మాటల్లో తొణికిసలాడినయ్యి.

"ఏం కబుర్లుంటయ్యి జ్యోతీ, కాకపోయినా నేను బీదవాడినని అత్తయ్యకు తెల్సుగా. నాతో మాట్లాడినందువల్ల ఆవిడ మనస్సు క్షోభిల్లుతుంది."

కుండ పగలగొట్టి మాట్లాడా ననుకున్నాడు. జ్యోతి స్థానంలో జయలక్ష్మి కనిపించిందతనికళ్లకి.

ఇంక సంభాషణ సాగలేదు మురహరికి.

"అమ్మను చూసి ఆవిడ ఏమైనా అనుకుంటుందనేగాని లేకపోతే మాట్లాడుదామనే అనుకుంటున్నావా బావా."

ఈ ప్రశ్నతో బైటపడతా డనుకుంది జ్యోతి. సమాధానం చిరునవ్వుతోనో ఇచ్చి వెళ్లిపోయాడు మురహరి. ఖిన్నురాలయింది జ్యోతి.

మనస్సు దుఃఖంతో నిండిపోయింది. ఎంత సంతోషంతో మురహరిని పలకరించిందో అంత నిరాశతో కుప్పుస కూలిపోయినట్లయింది. బావకు నేనంటే ఇష్టం లేనట్టేనా ? లేక ఎవరినయినా ప్రేమించాడా ? ఎంత ఆలోచించినా జ్యోతి మనస్సుకు ఏ సమాధానం దొరకలేదు.

"ఏం చేస్తున్నావు జ్యోతీ" అంటూ వచ్చిన జయలక్ష్మిని చూసేసరికి ఈ ప్రపంచంలో ఎడ్డట్లయింది. జయలక్ష్మి ముఖంవైపు చూడకుండానే ఇదుగో ఒక్క నిముషంలో వచ్చేస్తా కూర్చోండి" అంటూనే వెళ్లిపోయింది ఏమీ అర్థంకాక అక్కడే సోఫాలో కూర్చుంది జయలక్ష్మి. జ్యోతి సబ్బుతో ముఖం కడుక్కుని మళ్లీ టాయిలెట్ అయి వచ్చింది. ఇప్పుడు నవ్వుతూ పలకరించింది జయలక్ష్మిని. తన ముఖంలోని విచార రేఖలను ఎక్కడ పసికడుతుందో నని జ్యోతి భయం. అట్లా విచారంగా ఉన్నావేం జ్యోతీ అంటే తను ఏం సమాధానం చెప్పాలి. అందుకని అట్లా చేసింది.

"ఏం జ్యోతీ ఒక్కదానివే ఏం చేస్తున్నావ్, మీ అమ్మగారు లేరా, సినిమాకు వెళదామనుకున్నాను. నువ్వు కూడా వస్తావా, ఇద్దరం కలిసి స్వాతి వదినెను తీసుకుని వెళదాం" అన్నది జయలక్ష్మి.

"అమ్మ పేరంటానికి వెళ్లింది. మరోసారి వెళదాంలే. ఏమిటి కబుర్లు" అన్నది జ్యోతి.

"ఏమున్నయ్యి? శలవల్లో ఏం తోచదు. మా ఇంట్లో మా పెత్తల్లి, పెదనాన్న, జానకిరాం అన్నయ్యా ఉన్నారంటే వాళ్లతో ఏం మాట్లాడతాను. అంతా పెద్దవాళ్ళు, పూర్వాచార పరాయణులు. ఎప్పుడెప్పుడు సాయంత్రం అవుతుందా, ఎప్పుడెప్పుడు మిమ్మల్ని కలుద్దామా అనిపిస్తుంది."

"స్వాతి వదినె. కృష్ణమూర్తి అన్నయ్యా ఆ యింటికి ఎప్పుడూ వెళ్లరేం. తల్లిదండ్రులతో పోట్లాడివచ్చేశాడా అన్నయ్య."

జయలక్ష్మి మనస్సు ఆశ్చర్యంతో నిండిపోయింది. అసలు విషయం జ్యోతికి తెలియదు కామాలనుకుంది. తెలిస్తే అట్లా అడుగుతుందా?

"ఆ దంపతుల సంగతి నీ కేమీ తెలీదా జ్యోతీ."

"నా కేమీ తెలీదు. స్వాతి వదినె స్కూల్లో టీచరు. మా తమ్ముడికీ, చిన్న చెల్లెళ్లిద్దరికీ ట్యూషను చెపుతుంది. నెలకు పాతిక రూపాయలిస్తాము. ఆవిడ మంచితనానికి, సరళ స్వభావానికీ నేను లొంగిపోయినట్లుగా భావించాను. ఎందుకో వదినా అని పిలవా లనిపించింది. పిలుస్తున్నాను. అంతేగాని, వాళ్ళ చరిత్ర నాకు తెలీదు" అన్నది జ్యోతి నవ్వుతూ.

పచ్చి వెలక్కాయ పామెతయింది జయలక్ష్మికి. కులగోత్రాల సంగతి చెప్పితే జ్యోతి ఏమనుకుంటుందో ? అకారణంగా తానీ సంగతులు చెప్పి వారి స్నేహాన్ని కలుషితం చెయ్యటం ఏం బావుంటుంది ? దానివల్ల వాళ్ళ మనస్సులను పాడుచెయ్యటం తప్ప మరేమీ లేదు. అనుకుంది జయలక్ష్మి.

"ఆలోచిస్తున్నావేం జయా, అంత చెప్పరాని రహస్యమా, అయితే చెప్పొద్దులే, పోని ప్రేమించి పెళ్లి చేసుకున్నారా ? అంతే అయుంటుంది. బహుశా అన్నయ్య కట్నం లేకుండా ప్రేమించి పెళ్లి చేసుకునుంటాడు. కట్నం పోయిందే అని పెద్దవాళ్ళ దిగులు. ఈ కలతలవల్ల విడిగా కాపురం పెట్టి, ఉంటున్నారు. అయినా స్వాతి వదినెలో ఏ లోపం చూసి మీ పెదనాన్న, పెద్దమ్మలు కోడల్ని దూరం చేసుకున్నారు" అన్నది జ్యోతి.

"అమ్మయ్యా" అనుకుంది జయలక్ష్మి. కులగోత్రాల ప్రమేయమే లేకుండా ఈ సమస్యను




"ఇదేమన్నా మూకీచిత్రమా?"

జ్యోతి తేల్చివేసినందుకు తృప్తి చెందింది. ఇట్లా చెప్పుకున్నందువల్ల తను వారి స్నేహాన్ని పాడు చేసినట్టు కాదు.

"అవును జ్యోతీ. వారిద్దరూ చదువుకునే రోజుల్లోనే ప్రేమించి పెళ్లి చేసుకున్నారు. పదేళ్ళు దాటినయ్యి. కట్నం పోయిందనే మా పెదనాన్న బాధ. పెద్దవాళ్ల దృష్టిలో ప్రేమించి పెళ్లి చేసుకోటం తప్పుకాదా మరి." అన్నది జయలక్ష్మి. జ్యోతి ఏమంటుందోనని.

## ఎండమావులు

"ప్రేమించి పెళ్లి చేసుకోడం తప్పుకాదు. కాని అది కూడా ఒక హద్దులో ఉండాలి. అన్య కులములు కాకుండా ఉంటే సరి ఆ రకమైన ప్రేమ పెళ్ళిళ్ళయితే చాలా బాధాకరమైన సంగతే." అన్నది.

జయలక్ష్మి గుండె ఝల్లుమంది.

"అన్యకులస్థుల ప్రేమ వివాహాలు జీవితంలో శాంతి, సౌఖ్యాల నివ్వలేవంటావా జ్యోతీ"

'పర్యవసానం ఎట్లా ఉంటుందో మనం చెప్పలేం. కాని సాధారణ పరిస్థితులలో అది అంత మంచి పద్ధతిగా కనిపించదు. వర్ణాంతర వివాహాలు చేసుకునేంత పరిస్థితి ఎందుకు తెచ్చుకోవాలో నాకు అర్థంకావటంలేదు. అలాంటి దంపతుల్ని నే నెప్పుడూ చూడలేదు".

పరిస్థితి చిలికి చిలికి గాలివాన చిమ్మేటట్లుంది. ఇంత చిన్న వయస్సులో జ్యోతి ఇంత నూటిగా

తన అభిప్రాయాలు చెపుతుంటే జయలక్ష్మికి కొంచెం ఆశ్చర్యం కలిగింది. ఇంక ఈ రకమైన ప్రస్తావన సాగిస్తే అది ఎంతవరకూ పోతుందో నని భయపడింది జయలక్ష్మి.

"అయితే స్వాతివదినె మన కులస్థులు కాదా" హఠాత్తుగా వేసిన ఈ ప్రశ్న వినేసరికి జయలక్ష్మి కలతచెందింది. అయినా ఇంతవరకూ వచ్చింది ఇంక దాచటం మంచిదికాదనుకుంది.

"గుణం మంచిదయితే కులం ప్రధానం కాదు జ్యోతీ. స్వాతివదినెలాంటి వ్యక్తిని కేవలం కుల ప్రాతిపదిక మీద అదో విధంగా భావించటం వెర్రితనమే అవుతుంది. ఏమంటావు"

"నిజమే స్వాతివదినె ఉత్తమురాలు, ఆవిడ హృదయం మంచిది."

"అవునా, ఈ ఉద్దేశ్యం మనస్ఫూర్తిగానే వ్యక్త పరుస్తున్నావుగా"

"ఆహా"

"అదే అభిప్రాయం నీ మనస్సులో ఎల్లప్పుడూ ఉంటుందనీ, ఏమీ మారదనీ నాకు మాట ఇస్తావా"

చెయ్యిజాపింది జయలక్ష్మి. చేతులో చెయ్యి వేస్తూ "అట్లాగే స్వాతివదినె మీద నాకే దురభిప్రాయమూలేదు. ఆమె నాకు నిజంగా వదినె. ఆవిడ రాక కోసం, ఆవిడతో మాట్లాట్టం కోసం స్వాతి వానకు ముత్యపు చిప్పలా ఎదురు చూస్తుంటాను." అన్నది జ్యోతి

సగం ఆదుర్దా తీరింది జయలక్ష్మికి.

"వారిది ప్రేమ వివాహంలాంటిదే. స్వాతి వదినె హరిజన కులస్థురాలు. అందుకనే తల్లిదండ్రులు వెలివేసారు. వాళ్ళు వీళ్ళింటికి పోరు. కొద్ది రోజులవరకూ జాని రాం అన్నయ్యకూడా వెళ్ళేవాడుకాదు.' అన్నది

జ్యోతి ఆశ్చర్యంగా వినసాగింది. ఆమె మనస్సులో అనేక భావాలు పరుగెత్తసాగాయి.

"అయితే ఈ రోజునుంచీ స్వాతితో మాట్లాడటం మానేస్తావు కదూ" నవ్వుతూ అన్నది జయలక్ష్మి.

"ఎప్పటికీ మానెయ్యను. స్వాతివదినె అంద చందాలలో గాని, మాటపొందికలో గాని, పని పాటలలో గాని ఏ జాతి వంశస్థురాలినీ తీసిపోదు. నువ్వు చెప్పినా నేను నమ్మలేకుండా ఉన్నాను. చాలా ఆశ్చర్యంగా ఎన్నడూ గ్రహించలేనంత తీరుగా ఉంది. అందుకనే కామోలు ఒకసారి మా ఇంట్లో భోజనం చెయ్యమంటే ఎంత బతిమాలినా వంటింట్లో కూర్చోటానికి ఒప్పుకోలేదు. అతి కష్టం మీద ఇవతల హాల్లో కూర్చోటానికి ఒప్పుకుంది. చివరకు తన విస్తరి తనే ఎత్తి పారేసింది. అప్పట్లో గాని, ఇప్పుడుగాని నాకా విషయం తెలీలేదు. ఎవరయితేనేం చెయ్యెత్తి నమస్కరించతగిన ఉత్తమ ఇల్లాలు". అన్నది జ్యోతి.

జయలక్ష్మి మనస్సు శాంతించింది.

"నాకు తెలీదుగాని ఇలాంటి వర్ణాంతర వివాహాలు చేసుకున్నా వాళ్ళు ఎక్కువ కాలం సభ్యతగా ఉండలేరంటారు. ఆ అభిజాత్యం ఎప్పుడూ వాళ్ళ మనస్సులో కలక చేస్తూ ఉంటుందిట. ఇంక అలాంటి కాపురాలు సాగక విడాకులు పుచ్చుకున్న కూడా చాలామంది ఉన్నారుట. మా నాన్నగారు ఎవరితోనో చెపుతుంటే విన్నాను. ఈ సంగతి మీ నాన్నగారికే తెలిదేమో" అన్నది జ్యోతి.

"పోనీలే ఎవరికి తెలిసినా, తెలియక పోయినా ఆ పరమాత్ముడికి తెలుసు. వాళ్ళని ఆ పరంధాముడు చల్లగానే చూస్తున్నాడు. సరే మరేం విశేషాలు" అన్నది జయలక్ష్మి.

జయలక్ష్మి తెల్సుకుందామని వచ్చిన విషయం వేరు. మాటల సందర్భంలో అది మరుగుపోయి ఈ మాటల్లో పడ్డారు.

"మీ బావగారు కూడా ఆనర్సు చదువుతున్నారని చెప్పావు. శలవులకు వచ్చారా".

జ్యోతికి కళ్ళు ఆనందంతో మిలమిల లాడాయి. కల్పింతవి చేసుకొని అమృత ఝరులు ప్రవహించినట్లుగా అతి సరళంగా, మృదువుగా అన్నది జ్యోతి.

"మా మురహరి బావకూడా విశాఖలో ఆనర్సు చదువుతున్నాడు. వచ్చి వారం రోజులయింది. మా అత్తయ్యా మావయ్యా పోయారు. మా బావ దక్కడే ఉంటాడు. నువ్వు విశాఖపట్నంలో చదువుతున్నావు గదా. మా మురహరి బావ నీకు తెలుసా జయా. బావవచ్చాడని మొన్న చెప్పానుగా గుర్తులేదా"

ప్రశాంతంగా ప్రవహిస్తున్న సెలయేటిలో మధ్యలో కొంత దూరం పోయాక చిన్న వాగు కలిసింది. ఈ వాగు, సెలయేటి కలయికవల్ల పెద్దదయిన ఆ ప్రవాహ వేగం మరింత ఇనుమడించి గల గలమని శబ్దంచేస్తూ కొండరాళ్ళనూ, బండ రాళ్ళనూ ఒరుసుకుంటూ తీవ్రమైన ఒరవడిగా ప్రవహించి మహానదిలో కలుస్తుందో లేక మళ్ళా రెండుపాయలుగా చీలి ఎక్కడో సంబంధంలేకుండా అంతమవుతయ్యో తెలియదు.

ఏం సమాధానం చెప్పాలో తోచలేదు. తన బావ మాట ప్రస్తావించేసరికి జ్యోతి సంతోషాన్ని పదిపెట్టి హెచ్చవేసినట్లయింది. ఈ హెచ్చవేత వల్ల వచ్చిన ఆన్సరుతో తను తృప్తిచెందే ఆ ఆన్సరు రైటేనని తను టిక్కు కొట్టి మార్కులు వేయగలదా?

"మీ బావ మురహరిని నేను ఎరుగుదున్నాను. ఇద్దరం ఒకటే కాలేజీ, ఒకటే కోర్సు, ఒకటే గ్రూపు, చాలా మంచివారాయన. చక్కగా నవ్విస్తూ, కవ్విస్తూ హృదయపూర్వకంగా అందరితోనూ మాట్లాడుతారు. నలుగురిలోనూ పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోగల సమర్థుడు. మురహరి మీ బావగారని వింటుంటే నాకు చాలా ఆనందంగా ఉంది. మన కుటుంబాలన్నీ ఇంత సన్నిహితంగా ఉంటం తల్చుకుంటే నా మనస్సు సంతోషంతో నిండి పోతున్నది." అన్నది జయలక్ష్మి.

మురహరి బావను గురించి అంత గొప్పగా చెపుతుంటే జ్యోతి హృదయం పులకరించింది. మురహరి బావ అందర్నీ చక్కగా నవ్విస్తూ, కవ్విస్తూ మాట్లాడుతాడని జయ చెప్పింది. కాని తన విషయంలో అది పూజ్యం. తనతో ఎప్పుడూ నాలుగు మాటలుకూడా మనస్ఫూర్తిగా సంతోషంగా మాటాడలేదు. ఎప్పుడూ తప్పించుకునే తిరుగుతాడు. తను పలకరించినా అంటే ముట్టనట్లుగానే సమాధానం చెపుతాడు. సరాయి వాళ్ళతో అంత ఇష్టతగా మాటాడే వాడు. మేనమామ కూతురయిన తనతో ఎందుకు మాట్లాట్టం లేదు. తనంటే ఇష్టంలేదా?

ఈ ప్రశ్నకు సమాధానం దొరక్క తల్లడిల్లి పోయింది జ్యోతి. ఇందాకటివరకూ విప్పారిన ముఖంతో సంతోషంతో ఉన్న జ్యోతి ముఖం [illegible]మైపోయింది.

ఈ పరిస్థితి జయలక్ష్మికి అర్థంకాలేదు.

"అట్లా మాట్లాడకుండా కూర్చుండిపోయావేం. జ్యోతీ నేనేమయినా కష్టంగా మాట్లాడానా."

"లేదు జయా, మా బావ ఇంట్లో ఏం మాట్లాడకుండా ఉంటాడు. చిన్నప్పట్నుంచి చూస్తున్న బావ స్వభావం అంతేననుకున్నాను. అంత చక్కగా నవ్విస్తూ, కవ్విస్తూ బావ ఎప్పుడూ ఎవ్వరితోనూ ఇక్కడ మాట్లాడలేదు. బహుశా కాలేజీ స్నేహితులంటే బావకు మక్కువ కాబోలు" అన్నది నిర్లిప్తంగా.

జయలక్ష్మి మనసులో ఏదో ఒక అనిర్వచనీయమైన ఆలోచన కలిగి అంతలోనే అంతమైంది.

"మీ మురహరి బావ నీతో సరిగా మాట్లాడడా జ్యోతి".

పిడుగుమీద ఛెళ్ళున చరచినట్లయింది జ్యోతికి. ఇంత తీవ్రమైన ప్రశ్న హఠాత్తుగా అడుగుతుందని జ్యోతి అనుకోలేదు. అయినా ఈ ప్రశ్న తన కెందుకు? మురహరి తన బావ. తన కుటుంబంలోని వాడు. ఈ ప్రశక్తి ఇంతటితో ఆపుచెయ్యటం మంచిదేమో అనుకుంది. లేకపోతే మీ జ్యోతి నీ మీద ఈ మాటలు చెప్పిందోయ్ మురహరీ అంటూ జయలక్ష్మి ఎప్పుడయినా విశాఖపట్నం వెళ్ళాక చెపుతుందేమో ? సైగా క్లాస్‌మేట్ కూడాను. ఆలోచించింది జ్యోతి.

"మాట్లాడకేం జయా. మా బావ చక్కగా మాట్లాడుతాడు. అంతే మీరంతా సహాధ్యాయులు కనుక చనువు ఎక్కువ. ఇంట్లో, అట్లా ఛలోక్తులు విసురుతూ మాట్లాడటానికి వీలు

# ఎండమావులు

పడదుగా, అదే నేననేది. అంతకన్నా మరేంలేదు" అన్నది జ్యోతి.

అంతలోనే జ్యోతి తల్లి పేరంటం నుంచి వచ్చింది. ఆమెను చూడగానే జయలక్ష్మి మందహాసంతో నమస్కరించింది.

"ఏం జయా కులాసాగా ఉన్నావా, ఎట్లా ఉన్నయ్యి ఇక్కడి ఎండలు, విశాఖలో పట్నంలో కొంచెం చల్లగా ఉంటుందనుకుంటాను" అన్నదావిడ.

"అవునండీ ఇక్కడ ఎండలు జాస్తి. అక్కడయితే ఆ సముద్రపు గాలికి చల్లగా ఉంటుంది." అన్నది.

"మా మురహరి కూడా అక్కడే చదువుకుంటున్నాడు. శలవులకు ఇక్కడికే చేరాడులే. అతనికి మేమే శరణ్యం" అని వెళ్ళింది.

ఆ మాటల్లోని ఈర్ష్య, కటుత్వం, అయిష్టత స్పష్టంగా ఆమె ముఖ కవళికల్ని బట్టి అర్థం చేసుకుంది జయలక్ష్మి.

"వెళ్ళొస్తాను జ్యోతీ. రెండుసార్లు మీ ఇంటికి వచ్చాను. ఈ సారి నువ్వు మా యింటికి రావాలి. అదే మా పెద్దనాన్న గారి ఇల్లేననుకో, మా ఇల్లు కాదు. జానికిరాం అన్నయ్యనూ, శ్రీలక్ష్మి అక్కయ్యనూ చూద్దువుగాని" అన్నది.

"అట్లాగే తప్పక వస్తాను. స్వాతి వదినె, నేను వస్తాము" అని అంతలోనే నాలిక కర్చుకొని,

"ఓ మర్చిపోయాను ఆవిడ రాకూడదుగా. సరే నేనే వస్తా జయా" అన్నది జ్యోతి.

జయలక్ష్మి వెళ్ళింది రెండుసార్లు వచ్చినా మురహరి కనబడనందుకు నిరాశపడ్డది జయలక్ష్మి.

## 24

గౌతమి పుట్టింటికి వెళ్ళి రెండునెల్లు దాటినయ్యి. ఆమె రాసిన ఉత్తరానికి జానికిరాం జవాబు రాయలేదు. అతనికి మనస్కరించలేదు. అతని కాలకృత్యాల్లో కూడా విలంబన ఏర్పడింది. గౌతమి ఇక్కడ ఉన్న రోజుల్లో ఉదయం ఏడు గంటల్లోనే కాలకృత్యాలు తీర్చుకొని అనుష్ఠానం కానిచ్చి తనకు తోచిన పురాణగ్రంథాలు చదువుకుంటూనో, తల్లికి భారత భాగవతాలు చదివి కొంతసేపు వినిపించి దేవాలయానికి వెళ్ళిరావటమో చేసేవాడు. ఇదంతా ఉదయం పదిగంటల్లోపే అయేది. గౌతమి ఉంటే ఆమె కబుర్లతో, ఉద్యోగాధ్యాయాన్ని గురించి చేసే తర్కవితర్కాలతో కొంచెం కాలం గడిచేది. తండ్రితో మాత్రం ఎప్పుడోగాని మాట్లాడేవాడు కాదు. అదయినా ఆయన పలకరిస్తేనే. ఆ రోజులన్నీ ఆ తీరుగా గడచిపోయినయ్యి.

ఇప్పుడు రాను రాను ఏమీ తోచని పరిస్థితే వచ్చింది. ఒక్కొక్కరోజున ఏమిటో, ఏదో ఆలోచిస్తూ ఎనిమిది గంటలయినా పక్కమీంచి లేవటంలేదు. కాలకృత్యాలు తీర్చుకునే సరికి తొమ్మిది గంటలు దాటుతున్నది. అతనిలోని ఈ మార్పు తల్లి, తండ్రీ, శ్రీలక్ష్మి గ్రహించినా ఎవ్వరూ జోక్యం కలుగచేసుకోలేదు.

ఆ రోజున ఉదయం తొమ్మిది గంటలయినా జానికిరాం నిద్ర పక్కమీంచి లేవలేదు. ఏమిటో ఆలోచన, దిగులు, అవ్యక్త వ్యధ· ఆలోచిస్తూనే క్యాలండరు వైపు చూశాడు. నిరాశగా నవ్వుకున్నాడు. తారీఖుల లెక్క ప్రకారం ఆ రోజు అతని పుట్టిన రోజు. ముప్ఫై నెళ్ళి ముప్ఫై ఒకటి ప్రవేశించింది. రోజులూ, నెలలూ, సంవత్సరాలు గడచిపోతున్నయ్యి. కాలప్రవాహంలో మునుగుతూ, తేలుతూ కొట్టుకు పోవటమే తప్ప కాలు నిలదొక్కుకొని ఈ ముప్ఫై ఏళ్ళలో తను చేసిన ఘనకార్య మేమీ కనబడలేదు· మన స్ఫూర్తిగా ఎవ్వరినీ సంతోషపెట్టలేదు· ఇన్నేళ్ళు కాపురం చేసినా భార్య తన మనస్సును గ్రహించలేదు. ఆమె భావాలనూ, అభిప్రాయాలను, ఎప్పుడూ మన్నించలేదు· ఎప్పుడూ కన్న తల్లిదండ్రుల్ని కనిపెట్టుకుని ఉండాలనే మూఢ భావన తప్ప ఆ తల్లితండ్రుల మనస్సుల్లో తన వల్ల ఏర్పడిన ఆందోళన పోగొట్టటానికి దోహదం చెయ్య ప్రయత్నించలేదు. తన కష్టార్జితంగా, తన సంపాదనగా ఒక్క రూపాయి ఏనాడూ తేలేదు. తన జేబులోకి ఆ రూపాయి కావాలన్నా తండ్రిమీద ఆధారపడవలసిందే. భార్యకు పూలుకావాలన్నా పెద్దల చేతుల్లోనుంచి రావలసిందే. కాలేజీ వదిలాక కాఫీ హోటలుకు వెళ్ళి రెండు మూడేళ్ళు అయింది. అదయినా ఎవరయినా ప్రాణ స్నేహితులు కనిపించి కాఫీకి రమ్మని బలవంతం చేస్తేనే. గౌతమి ఉన్న రోజుల్లో ఒక రోజున ఒక చిన్న సంఘటన జరిగింది.

ఏనాడో ఎవరో బొట్టుపెట్టి ఇచ్చిన రెండు రవికెల్ల గుడ్డలు గౌతమి పెట్టెలో అడుగున పడి




గమనిక:—జేబుదొంగలున్నారు జాగ్రత్త !!

N. B.—దయచేసి మీజేబులు కత్తిరించకండి!!

ఉన్నాయి. ఆ జాకిట్టు గుడ్డలు అప్పట్నుంచీ కుట్టించుకోలేదు. కారణం అవి ఏమంత నచ్చకనే. తొడుక్కునే జాకిట్లు చిరిగిపోతుంటేచేత తనను అడిగింది. నాలుగు జాకిట్లు కుట్టించమని. శ్రీలక్ష్మితో చెప్పమన్నాడు తను. శ్రీలక్ష్మితో గౌతమి చెప్పలేదు. ఆ మర్నాడే పెట్లో ఉన్న ఆ రెండు జాకిట్టు గుడ్డలు తీసి కుట్టించుకుంది.

"ఈ జాకిట్టుగుడ్డలు బావుండలేదన్నావుగా, మళ్ళా ఇవే కుట్టించుకున్నావేం" అన్నాడు తను. "మీరు చేసే ఉద్యోగానికి మీ భార్యనైన నాకు ఈ పాటి జాకిట్టుగుడ్డలు చాలు. మన హోదాకు ఏమీ తీసిపోవు" అన్నది. ఆ రోజున గౌతమి సాధించిన సాధింపు మాటలు, తను పడ్డ కుమిలింపు, వ్యధా ఎన్నిటికీ మరువలేని ఘట్టాలు. ఉద్యోగమన్నా, ధన సంపాదనన్నా తన మనస్సులో ఏర్పడిన అవ్యక్తమైన అభావనకు ఇలాంటి సంఘటనలు గీటురాళ్లు. ఉద్యోగమంటే ఈ విముఖత, అయిష్టం ఎందువల్ల ఇంతగా తన మనస్సులో పాతుకు పోయినట్లు? ఇంత మందికి మనోవ్యథ కలిగించి తను సాధించిన ఘనకార్యం మాత్రం ఏముంది? ఇదంతాకూడా తను తల్లిదండ్రులకు చేసే సేవలోకే వస్తుందా? వృద్ధాప్యంలోని తల్లిదండ్రులకు చేదోడుగా ఉన్నట్లే అవుతుందా? తన ఈ అర్థం కాని చర్యలను అర్థంచేసుకో లేకనే గౌతమి, గుండె రాయిచేసుకొని వెళ్ళిపోయి ఈ తీరుగా ఉద్యోగం చేస్తున్నదా? తను ఎవరిని ఉద రిస్తున్నట్లు? తన జీవితానికి సాఫల్యత ఏమిటి? తనకు ఇష్టంకాని ఉద్యోగంచేస్తూ ఇంతమందినీ సంతోషపెడుతూ ఉంటమే తన జీవిత ధ్యేయమా? లేక తన మనస్సుకు తృప్తికలిగే తీరున ఉద్యోగం చెయ్యకుండా కాలం గడుపుతూ ఇంతమంది హృదయాల్లో, మనస్సులో సంక్షోభం కలిగించటం న్యాయమా? ఏది సరైనది? ఏది ఆమోద యోగ్యమైనది?

పక్కమీద దొర్లుతూ ఉన్న జానికిరాంకు తండ్రి పిలుపు వినిపించింది. గోడగడియారంలో తొమ్మిది దాటింది. కళ్లు నులుముకుంటూ వెళ్ళి తలొంచుకొని తండ్రి ముందు నిల్చున్నాడు.

"పిలిచారా" మెల్లిగా అన్నాడు తలెత్తకుండానే.

"ఏమీలేదు. ఇంకా నిద్రలేవకపోతే ఏమిటో తెలీక, ఏమైనా సుస్తీగా ఉంటున్నావేమోనని తెల్సుకుందామని పిలిచాను"

అభిమానంతో సిగ్గుపడ్డాడు.

"ఏమీలేదు. కులాసాగానే ఉన్నాను"

ముఖం కడుక్కోటానికి వెళ్ళబోయాడు.

"నీ అనుష్టానంకానించి వెళ్లేటప్పుడు ఒకసారి మాట్లాడి వెళ్లు"

ఆజ్ఞాపూర్వకంగా ఉందామాట. మాటలో మనోవ్యథ వ్యక్తమైంది.

ముఖం కడుక్కొంటున్నంత సేపూ జానికిరాం ఆలోచిస్తూనే ఉన్నాడు. తండ్రి మాట్లాడే విషయాలేమిటో అని.

కొడుకు రాకకోసమే వేచి ఉన్నట్లుగా పడక్కుర్చీలో కూర్చున్నారాయన. భార్య వచ్చింది.

"జానికిరాంను పిలిచారుటఎందుకూ" అన్నదావిడ.

"ఏం పిలవకూడదా, వాడితో చాలా సంగతులు మాట్లాడాలి. ఈ ఇంటి గౌరవం నాకళ్ళముందే కప్పిపెట్ట బూనుకున్నారీ ప్రబుద్ధులు" ఆయనలో అవమానంతో కూడినకోపం పరవళ్ళు త్రొక్కుతున్నది.

"పరిష్కారంకాని విషయాలు చాలా ఉన్నమాట నిజమే. జానికిరాం మనస్సు ఎటువంటిదో మీకు తెలీందికాదు. మీ కోపమంతా వాడిమీద వెళ్లగక్కి వాడి మనస్సు బాధపెట్టకండి. ఈ రకంగా వీడినీ దూరం చేసుకోలేను" కడుపులోని కన్న ప్రేమ కట్టలు తెంచుకొని కన్నీటి రూపంలో బైటపడగా ఇంక మాట్లాడలేక మెల్లిగా వెళ్లింది ప్రభావతమ్మ. శాస్త్రిగారి కోపం సగం కరిగిపోయింది. జానికిరాంను నాలుగు దులిపి తన మనోవ్యథనంతా వెళ్లగక్కి బలవంతాన అతని అభిప్రాయాలను మారుద్దామనుకున్నాడు. భార్య కన్నీళ్లు ఆయన కోపాన్ని చల్లార్చినయ్యి. జానికిరాం వచ్చి తండ్రి ఎదురుగా నిల్చున్నాడు. తలెత్తి కళ్లద్దాలలోనుంచి కొడుకును నిలువెల్లా చూశాడు శాస్త్రిగారు. నలభైయ్యవ పడిలో పడుతున్న కొడుకుని ఆయన ఏమని కేకలెయ్యగలడు?

"జానికిరాం"

"ఏం నాన్నగారూ"

"నీ కన్న తండ్రినయినా నీ కన్న మించి నేను చదువుకోలేదు. నీ చదువు పూర్తయ్యే టంతవరకూ నీ స్వవిషయాలో నేను జోక్యం కలుగ జేసుకోలేదు. అప్పట్లో నిన్నుగురించిన బాధలు నాకేవీ కనుపించలేదు"

రాము: ఏమోయ్! ఎదురుగా ఒస్తున్నా చూడనట్టునటిస్తావేం?

మోహన్: సారీ! దారేపోయే మొగాళ్ళ నందర్నీ విపులంగా చూస్తూ నడిచే అలవాటు నాకు దులే భాయ్!

కె. రంగారావ్ (కాకరపర్రు)

తలొంచుకొని మాట్లాడి, తలపైకెత్తి జానికిరాం ముఖంలోకి చూశాడు. తండ్రి మాటల్లోని ప్రతి అక్షరమూ గుర్తుంచుకున్నాడు. ఏమిటీ నాందీ ప్రస్తావన?

"చెప్పండి నాన్నా"

"అట్లా దగ్గరగా కుర్చీలో కూర్చో"

అధికారి ముందు తాభేదారులా, జడ్జీముందు ముద్దాయిలా, మేష్టారుముందు విద్యార్థిలా నిల్చున్న జానికిరాంను చూస్తుంటే ఆయన మనస్సు చిన్నబోయింది. జానికిరాం చేతులుకట్టుకొని వినమ్రుడై నిల్చున్నాడు.

"కూర్చుంటే చాలాసంగతులుమాట్లాడుకోవచ్చు"

ఈసారి తండ్రి మాట జానికిరాం జవదాటలేదు. పక్కనున్న కుర్చీ ఆయనకు దగ్గరగా జరుపుకొని కుర్చున్నాడు.

తనతో భేటీకి వచ్చిన సమాన ఉజ్జీలా కనుపించాడు ఇప్పుడు.

వాత్సల్యంతో జానికిరాం చేతిని తనచేతుల్లోకి తీసుకున్నాడు. ఆయన మనస్సు కరిగిపోయింది.

"పెద్దవాళ్లం. బ్రతికినన్నాళ్ళు బ్రతకబోం. తలకొరివి పెట్టవలసినవాడు, వాడి పని ఇదివరకే చేసేశాడు. ఆ రోజుతోనే, వాడు తల్లిదండ్రుల ఋణం తీర్చుకున్నాడు. ఆ నాడు పెద్దవాడు పెట్టివెళ్లిన తలకొరివి ఈనాటివరకూ మా మనస్సుల్లో నిలువెల్లా మండుతూనే ఉంది. అది ఆరని జ్యోతి— కాదు ఆరని మంట. ఆ మంటలను నువ్వుచల్లార్చలేక చూస్తూ ఊరుకున్నావు ఇన్ని సంవత్సరాలనుంచీ. సకల విద్యాపారంగతుడివి. అన్ని శాస్త్రాలు, కావ్యాలు చదివావు. సరస్వతీదేవి నీ నెత్తినుంది. చదువు నూరిపోసిన ఆ తల్లి నీలో ఏమాత్రమూ ప్రజ్ఞను లేకుండా చేసింది. ఫలితం చదువుకు తగిన ప్రయోజనం కనిపించదు"

తండ్రి మాటలు శ్రద్ధగా వినటం తప్ప ఏమీ మాట్లాడలేదు. ఈ నిస్తబ్ధత ఆయన మనస్సులో కోపాన్ని రగిల్చింది.

"జీవితం పూలపాన్పు కాదు, షడ్రుచిన విస్తరీ కాదు, కూర్చుని తింటే కొండలు కూడా కరిగిపోతయ్యి. ఈ రోజువరకూ నీలో ఉద్యోగం చెయ్యాలనే కోరిక కలగలేదంటే అది నీ ఖర్మ కాదు. బ్రతికి ఉన్నందుకు మా ఖర్మ. ఊరికే గోళ్ళుగింటూ కూర్చుని ఏవో పుస్తకాలూ, గ్రంథాలు చదువుతుంటే, అవ్వేమయినా నీకు బువ్వ పెడతయ్యిరా? ఉద్యోగం చెయ్యకుండా సర్వకాల సర్వావస్థలయందూ మా నెత్తినే ఎక్కి ఉన్నంతలోనే పొట్ట నింపుకుని మాతోనే ఉంటే అది తల్లిదండ్రులకు సేవచేసినట్లే అవుతుందా. సంపాదించటం చేతకాక వాజమ్మలా ఇంట్లో తిని కూర్చుంటూ అమ్మకూ, నాన్నకూ సేవ చేస్తున్నానంటే ఆ పరమాత్ముడు మాత్రం హర్షిస్తాడా? అట్లాగని నువ్వు చదివిన ఏ కావ్యంలో ఉందో చూపించరా? ఎందుకూ పనికి రాని ఆ చదువు ఎందుకు చదివినట్లు? మా నెత్తినెక్కి ఊరేగటానికా? వాడు అప్రాచ్యుడై వెళ్లిపోయాడు. నువ్వు మమ్మల్ని అప్రాచ్యుల్ని చేస్తున్నావు." ఆయనకోపం తీవ్రతరమై ఆకాశాన్నంటింది.

"నాన్నా" శ్రీలక్ష్మి వచ్చింది.

"అంత కోపం ఎందుకు నాన్నా. నీ కోపతాపాలు చూసి, ధడిసి అన్నయ్య ఉద్యోగంలో చేర్తాడంటావా" అన్నది శ్రీలక్ష్మి.

శాస్త్రిగారి కోపం దిగజారింది పాదరసంలా.

"అవునమ్మా నిజమే"

శ్రీలక్ష్మి వెళ్ళింది.

"నువ్వు సంపాదన పరుడువి కాదనీ, తన చేతి గాజులకూ, నుదుటి కుంకుమకూ, గజంజాకిట్టుకూ కూడా మమ్మల్నే అడగాల్సి వస్తున్నదనే అభిమానంతో గౌతమి వెళ్ళిపోయింది. పరోక్షంగా నీ భార్యను నువ్వు వెళ్ళగొట్టావు. అందుకు మేం భాధ్యులం కాము. నీ కన్న తక్కువ చదువుకున్నది నీ సలహా సంప్రదింపులులేకుండానే గౌతమి ఉద్యోగం చేస్తున్నదంటే నిజంగా మనం సిగ్గుపడాల్సిన విషయమే. గౌతమి ఉద్యోగం చెయ్యాల్సిన పరిస్థితి ఎందుకు వచ్చిందో నువ్వేమయినా ఆలోచించావా? నీ మనుస్సులో మార్పు తేవటానికే అట్లా చేసింది. ఏదో ఉత్తరం వ్రాసిందట. సమాధానం రాశావా, మీరిద్దరూ అక్కడ ఆ ఊళ్లో కాపురమున్నా మాకు ఇష్టమే. ఇంక నేను చెప్పాల్సిందేం లేదు. నేను వృద్ధుడ్ని. నువ్వు బాధ్యత నెరిగిన పెద్దవాడివి. వృద్ధిలోకి రావలసిన వాడివి. ఈ కుటుంబంలో నీ కొడుకులు అప్రయోజకులు. కోడళ్లు ఉద్యోగాలు చేస్తారు. ఈ మాటలు దశదిశలా అంతా చెప్పుకునే టట్లుగా ప్రవర్తించారు. మనకే కాదు. చూసే వారికి, వినేవారికి కూడా నీ ప్రవర్తన సిగ్గుచేటుగా ఉంది. మంచిది వెళ్ళు." లేచి వెళ్ళాడాయన.

## ఎండమావులు

కన్నబిడ్డై పోయాడు జానికిరాం. ఇంత తీవ్రంగా తండ్రిపోట్లాట్టం ఎప్పుడూ చూడలేదు జానికిరాం. తండ్రి చెప్పినదంతా నిజమే అందులో ఒక్క మాటకూడా కల్పించి చెప్పలేదు. సంవత్సరాలనుంచీ జీర్ణించిపోయిన మనః క్లేశాన్ని ఇవాళ ఆయన వెళ్ళబోసుకున్నాడు. తన జీవితమూ, తన ఉనికీ అప్రయోజకత్వంగానే కనిపిస్తున్నది. తనను చూసి ఎవరూ సంతోషిస్తున్నారు? సంపాదనపరుడు కాక పోతే కన్నతల్లి దండ్రులకూ, కట్టుకున్న భార్యకూ కష్టంగానే ఉంటుంది. ఇంతమంది మనస్సులకు వ్యథ కలిగించీ తను అనుభవిస్తున్న సుఖం సంతోషం లేమున్నయ్యి ?

### 25

ఆ రోజున కృష్ణమూర్తికి గుండెనొప్పి ఎక్కువైంది. స్వాతి డాక్టర్ని పిలిపించింది. డాక్టర్ ఇంజక్షను ఇచ్చి మందిచ్చి వెళ్ళాడు. వెళుతూ కొంచెం జాగ్రత్తగా కనిపెట్టి ఉండమన్నాడు. ఆయాసంతో రొప్పుతూ పడుకున్నాడు కృష్ణమూర్తి. గుండెలు చిక్కబట్టేనయ్యి.. ఎక్కువగా మాట్లాడలేక పోతున్నాడు. స్వాతి విచారానికి అంతు లేదు. గుండెలు రాస్తూ కూర్చుంది.

"ఊపిరి తిత్తులు రెండూ ఎవరో నలిపేసి నట్లుగా ఉంటున్నదీ స్వాతి. చాలా బాధగా ఉంది." అన్నాడు. ఆయాసపడుతూ కృష్ణమూర్తి.

"తగ్గిపోతూంది. మనస్సులోని . మమతా, గుండెల్లోని కలతా ఒక్కసారి పోవు. ఈ నిర్భాగ్యురాల్ని కట్టుకున్న తనువాత అన్ని మమతలకూ దూర మయ్యారు. -ఇంక మిగిలింది గుండెల్లోనీ కలత మాత్రమే. అదే గుండె జబ్బుగా మారింది. దాని కంతకూ కారణం నేనే కదూ" కంఠంలో ఉద్వేగం, నరనరాలోని మనోవేదనా లయ విన్యాసం చేస్తుం న్నయ్యి. "స్వాతీ, అక్కడే పొరబడుతున్నావు. నిన్ను చేసుకోవటంనుంచి నేను పొడవలేదు. ఒక రకంగా ఆలోచిస్తే నువ్వే నానుంచి బాధలకు గురవుతున్నా వేమో. నీ మెడలో తాళి గట్టి భార్యగా నిన్ను చేపట్టానేగాని భర్తగా నాబాధ్యతను నెరవేర్చుకో లేకపోయాను. మొదటి రెండేళ్ళ నన్ను స్వర్గంలో నడిపించావు. నా సమస్తంలోనూ, నా పరోక్షంలోనూ నన్నే స్మరించావు. అప్పటో నిన్ను అనేవాళ్ళ గుర్తుందా" మెల్లిగా నవ్వుతూ ఆమె బుగ్గమీద చిన్న చిటికె వేశాడు. సిగ్గుతో కుంచించుకుపోయింది స్వాతి.

"ఏమనేవారు." ఆ మాటలేవో ఈ రోజున తను విని ఆనందించటానికి అడగలేదు స్వాతి. తన సంసార జీవిత ఘట్టాలు పర్యాలోచనం చేసుకుంటే ఆ ఆనందాతిశయంతో కూడిన భావతరంగా లేమయినా తగ్గేటట్లుగా చేస్తుందేమోనని ఆశ.

"ఏమనేవారో నీకు తెలిదా స్వాతీ" ఆయాసం లోనే ఆనందంగా అన్నాడు.

"మీరు చెపితే మళ్ళా వినాలనివుంది"

"ఆ బాపనయ్యని కొంగున గట్టుక తిరుగు తుందావా సోతెమ్మా" అనే వాళ్ళ 'కదూ మీ వాళ్ళంతా" బాధను వెనక్కు నెట్టి నవ్వాడు కృష్ణమూర్తి.

"అప్పుడు మీరేమనుకున్నారో అదికూడా చెప్పండి ఆ మాటలు దాచి పెట్టటం ఎందుకూ"

ఓరగా చూస్తూ అడిగింది స్వాతి. ఆ చూపు ఈ స్థితిలో ఇప్పుడు చూడవలసింది కాదు. ఆ చూపుకు విలువ కట్టలేని నాణ్యత ఉంది. ఆ చూపులోనే అందర్నీ ఎదిరించి అతను సేదతీర్చుకున్నాడు. తామిద్దరూ ఉన్నప్పుడే, తమిద్దరూ మాట్లాడు కుంటున్నప్పుడే, ఒకసారిగా అట్లా చూసేది స్వాతి. ఆ చూపులో ఐశ్వర్యాలు కనబడేవికావు. జాతిమత భేదాలు కనబడేవికావు. అపవాదులూ, అనుభవాలూ గుర్తుకొచ్చేవికావు. చల్లని తెల్లని పూర్తి వెన్నెలా, గలగలాడుతూ స్వచ్ఛంగా ప్రవహించే సెలయేరులా, వొడ్డును ఒరుసుకుంటూ ప్రవహించే చల్లని నదీ మతల్లిలా ఉంది. "ఆ చూపు కోసమే నేను జీవించి ఉన్నాను స్వాతీ" అనేవాడు. ఆ చూపు చూసి నాలుగయిదేళ్లయింది. అట్లా చూస్తే తన హృదయంతల్పం మీద శయనించి సేద దీర్చు కుంటాడని ఆమెకు తెల్సు. ఇదివరకు రోజుల్లో ఆ చూపు వెనక కాంక్ష ఉండేది. ఆ కాంక్ష వెనుక కోరిక ఉండేది. ఆ కోరిక వెనుక మనశ్శాంతి ఉండేది. ఆ మనశ్శాంతి వెనుక మానసికోల్లాసం ఉండేది. ఈ నాడు స్వాతి ఆ కోరికలతో ఆకాంక్షలతో చూడలేదు. ఆ అనుభూతులకోసం అర్రులు చాచటంలేదు. ఆ తృప్తిని ఆశించడంలేదు. అతని ఆత్మ తృప్తికోసమే, అతని సంతోషం కోసమే, అట్లా చూసింది స్వాతి. అది ఇద్దరికీ తెలుసు.

"చూడండి. నా కంటిపాపల్లో మీ కంటిపాప మిల మిల్లాడుతూ మెరుస్తున్నంత కాలం ఎవ్వరూ మిమ్మల్ని నా నుండి వేరు చెయ్యలేరు. అట్లా వేరు చెయ్యటానికి ఆ పరమాత్ముడికికూడా మనస్సు ఒప్పదు. నా జీవితంలోని ప్రతి సన్నివేశంలోనూ మీరు కనిపిస్తారు. మీ జీవితంలోని ప్రతి మట్టానికీ నేను అడ్డు వస్తూనే ఉన్నాను. ఏ దృష్టితో చూసినా మీరు ముందుకు పోలేకుండా ఉన్నారు. మీ పురోభివృద్ధికి ఆటంకం కలిగించే నేను క్షంతవ్యురాలినే అంటారా"

ముత్యాలలాంటి కన్నీటి బొట్లు వెచ్చగా అతని చెంపల్ని తాకాయి.

"ఏడుస్తున్నావెందుకు స్వాతీ, నేనేమయినా అన్నానా" పసివాడిలా భయపడుతూ అన్నాడు.

"లేదండి ఏడవడంకాదు. సంతోషాతిశయాన్ని మనస్సులో నింపుకున్నాను. కాని అది పొంగి పొర్లింది. మానసిక భావదర్పణమే కన్నీరు" అన్నది కళ్ళు తుడ్చుకొని.

"స్వాతి వాన నా మీద కురిపిస్తున్నావా"

లాలనగా అడిగాడు. పాడి దగ్గుతో ఆయాసం హెచ్చింది.

"దగ్గుతో మళ్లా ఆయాసం హెచ్చుతున్నది. మాట్లాడవద్దు కాస్త విశ్రాంతి తీసికోండి."

"ఇంతకన్నా విశ్రాంతి ఏంకావాలి స్వాతీ. నువ్వు లేకపోతే ఏ భార్య నాకు ఇంత విశ్రాంతినిస్తుందో చెప్పు. ఈ గుండెజబ్బువాడితో నేను సుఖపడేదేమిటని దాని దారి అది చూసుకునేది. ఆ పని నువ్వు ఎందుకు చెయ్య ......" అర్ధోక్తిలోనే తన చేత్తో అతని నోటిని కప్పేసింది.

"క్షమించండి. మీ నోరు మూశాననుకోకండి. మీ చివరి మాటలు వినలేక ఈ పని చేసాను. కలలోకూడా అనకూడని, వినకూడని మాటలు మాట్లాడవద్దని మిమ్మల్ని అర్థిస్తున్నాను!!" అతని రెండు చేతులతో తన ముఖాన్ని కప్పుకొంది.

"పిచ్చిదానా స్వాతీ ఏదో ఎగతాళికి అన్నాను. ఇంకె ప్పుడూ అననులే. ఒక్క కోరిక తీరుస్తావా."

"తప్పకుండా. మీ ఆరోగ్యానికి భంగంరాని ఏ కోరికనైనా తీరుస్తాను. నాకు కళంకంరాని ఏ కోరికనైనా శిరస్సున ఉంచుకొని ఆచరిస్తాను."

నవ్వాడు కృష్ణమూర్తి.

"అమ్మ దొంగా, అర్ధోక్తిలోనే ఎంత మధురంగా మాట్లాడావు. వివాహానంతరం మన జీవితాన్ని గానం చేస్తావా ?"

ఆశ్చర్యంతో అతని చేతులను తన చెంపలకు రాసుకున్నది.

"మన జీవితం గానం చేయవలసిన కోవలోనిదా, అలాంటి పుణ్య దంపతులమా మనం" కన్నార్పకుండా చూసింది. ఆ చూపులో పదేళ్ల జీవితం కరిగి ఉన్నది.

"అవును స్వాతి. మన పదేళ్ల జీవితమూ ఒక్కసారి కళ్లకు కట్టినట్లుగా చిత్రించగలవా. అదంతా వింటే నా గుండెజబ్బు తగ్గుతుందేమోనని నా ఆశ. మన జీవితంలోని మధుర సన్నివేశాలు నాకన్నా నువ్వే ఎక్కువగా చెప్పగలవు. ఆయా సందర్భాలలో నేను ఒక శ్రోతను మాత్రమే" అన్నాడు.

బరువుగా శ్వాస పీల్చింది స్వాతి. ఆమె పది సంవత్సరాలు వెనక్కు వెళ్ళింది. ఆమెవైపే చూస్తూ ఆమె వళ్లో తల ఉంచి పడుకున్నాడు కృష్ణమూర్తి. అతని మనస్సు ఆమె చెప్పే సంఘటనలను చిత్రీకరిస్తున్నది. ( సశేషం )

## సీతా కల్యాణం

13వ పేజీ తరువాయి

భయాన్నా ఒప్పించి చేరుమాలుని వింది కొట్టుకట్టి బయటకుపరుగెత్తేడు 'అరోగ్యాన్' కొనేనిమిత్తమై.

"ఎండలో నీవెందుకూ— వెంకన్నని నే పంపిస్తాను— నువ్వురా...."అనే అత్తయ్య మాట పది నిముషాలకి గానీ శివరాం చెవిలో దూర లేదు '

దూరిన మరో పది నిముషాలకి గానీ మనస్సుని చేరలేదు ! !

ఈ ఇరవై నిముషాలలోనూ కరణం కొడుకు మధ్య దారిలో కనిపించి— తను ఇంట్లోంచి తెచ్చి ఇచ్చెయ్యడం అయిపోయింది !

ఇక అదే వేగంతో వెనక్కి తిరిగి— "నాకు భయం బాబోయ్— అది మండుతుందనే"— శాంతిని ఖాతరు చెయ్యకుండానే పట్టు కట్టేసేడు ఇంత అయొడిన్ పంచి....

బాధ, సిగ్గు కలిసి శాంతి మొహంలో కమిలి పోయేయి !

ఇంతలోగా మామయ్యవచ్చి— "ఏమిటీ సంగతి?" అని అడిగేసరికి చెరితినవ్వు నవ్వి "ఏం లేదు...." అన్నాడు శివరాం.....

ఆ తర్వాత అత్తయ్యతో.... పూర్వకాలం వాళ్ళు ఎంతెంత మొద్దు బిందెలను వాడేదీ వివరించి.... ఈ కాలం వాళ్ళు అంతంత బరువులు మొయలేక రేకు బిందెలను ఎలా చేయించుకుంటు న్నదీ చూపించి— ఇంక శాంతి కాలంలో ఏ బిందెలు వాడాలో చెప్పి.... "ఇదంతా ఎందు కనుకుంటున్నావ్ అత్తయ్యా ? రేపటి నుంచి శాంతి నాకు రోజుకో వేలి పచ్చడి పెట్టకుండా ఉండేందుకే సుమా ?"— అన్నాడు తన వీళ్ళో వ్యాసానికి ముగింపుగా— పరిసర ప్రాంతాలలో ఎక్కడైనా కుంటుకుంటూన్న శాంతి తచ్చాడు తోందేమోనని ఓర కంటితో పరికిస్తూ.....

నవ్వేశారు అత్తయ్యా, వెనక నుండి విన్న మామయ్యా కలిసి !

పారిపోలేక శాంతి తన జడని శివరాంకి అందించేసింది ! అందిన జడ కొనలను ముడివేస్తూ.

"శాంతీ.... ఈ సారి నీ జడ ఇన్నిసార్లు నా చేతిలో చిక్కి పోవడానికి కారణం నీ కాలిమీద దెబ్బేకదా.... ఆ నాడు నేనల్లా భయపెట్టకుండా ఉంటే నీనాడు కుంటుకుంటూ ఏడవ వలసిన పరిస్థితి కలిగేది కాదు కదా !

"నీవు నాకు అందినా— నిన్ను బాధ పెట్టడం వలన నాకు కలిగే సుఖం అశాంతినే ఇస్తుంది శాంతీ ! పరిగెట్టి తూనీలాగ పారిపోయే శాంతి మెల్లిమెల్లిగా నడుస్తుంటే తమాషాగా ఉన్నా— నీ కుంటి కాలును చూస్తుంటే ఒడ్డున పడిన చేపలా గిలగిల లాడుతోంది నా మనస్సు....

"నీవు తృప్తిగా ఉండీ— సుఖంగా కనిపించి— నవ్వితే చాలు— అదే నా జీవిత పరమావధి...."

నీ నవ్వులో వెన్నెల్లు విరుస్తాయి—
బొండు మల్లెలు విప్పుకుని చూస్తాయి—
నింగి మీద ఎగిరే పక్షుల కిలకిలలు తొంగి
చూస్తాయి —
ధ్వజస్తంభపు మువ్వల గలగలలో దానిమీద
వాలిన గువ్వల కలకలం వినిపిస్తుంది

—ఏదో పనిమీద ఆ గదిలోకి ప్రవేశించిన తల్లిని చూసి తెల్లబోయి శాంతి పెలికిలా నవ్వేసింది చివరికి !

ఇంకా వూహాలోకపు సరిహద్దుల దాకా వెళ్ళినా గా(లే)ని శివరాం .

"అదే.... అదే.... శాంతి నా జీవితానికి విలువ.. అదే నా...." ఎటో చూస్తున్న శివరాంని చూసి సంగతి గ్రహించిన అత్తయ్య.... "ఏదోయ్...." అంటూ పలకరించే సరికి— వూహాలోకం నుండి ఈ లోకంలోకి ఉరికి శాంతి స్థానంలో నిల్చున్న అత్తయ్యను చూసి— నిర్ఘాంతపడి— కుంటు కుంటూ వెళ్ళి పోతున్న శాంతిని చూసి - చివరకు పకపక నవ్వేశాడు ! !

ఆ తర్వాత ఆ వ్రేలి గోరు పుచ్చుగోర్లై కొంత పెరగడం తిరిగి కొంత బాధ పెట్టి మళ్ళీ మొదలంటూ వూడిపోవడం లతో ముగిసింది....

ఆలోచన మదిలో మెదలగానే ఒక్కసారి కాలి గోరును చూసికుని నవ్వింది శాంతమ్మ !

అదే పరిధిలో పడయాడి శాంతమ్మ వెను వెంటనే పరిగెట్టిన శివరాం శాంతమ్మ ఆగిన చోటే ఆగిపోయి తమా ఆమె గోరును చూసి—

"మనస్సుకున్న వేగం మనిషికి తెలియదంటారు" అన్నాడు లేవబోతూ—"

"అయినా— కెంపుల్లా మెరిసే నీ గోళ్ళ మధ్య ఆ పుచ్చుగోరుకు కారణం నేనేకదూ —" అంటూ ముందడుగు వేసే శివరామయ్యని చూసి శాంతమ్మ బంగారు పడి దిక్కులు చూసింది.

* * *

డాబా పిట్ట గోడమీద కూర్చుని కాళ్ళని ఆడిస్తూ— కుర్చీలో కూర్చునున్న సీతని ఉద్దే శించి అన్నాడు రాంబాబు....

"ఆడ పిల్లలకి తండ్రి పోలిక రావడమేమిటి? మగరాయుళ్ళలాగ....." అంటూ వోరగా సీతని చూసేడు...

"ఏం.... ?" అంటూ అరచింది సీత కరవ

# సీతా కల్యాణం

వచ్చినట్లు....

"ఎందుకంటే...." కొంటె తనానికి నట్టు కున్నాడు భయపడుతూన్నట్లు నటిస్తూ....

"నేను చెప్పనా...." అంటూ ప్రవేశించిన మామయ్యని చూసి అమాంతంగా క్రిందికి దిగే

సేడు రాంబాబు....

మరీ కోణంగి తననాకి పోయిన సీత తను కూర్చున్న కుర్చీ నుండి లేచి— రాంబాబు దిగిన స్థలంలోనే అధివసించి అతని భయాన్ని వెక్కి రిస్తూన్నట్లు కిలకిల లాడింది.

శివరామయ్యగారు కూడా నవ్వేసేరు సీత కొంటె తనానికి !

నవ్వుతూనే గతంలోకి పరుగెట్టడానికి సన్నద్ధ మయ్యింది ఆయన మనస్సు ! !

"చెప్పు నాన్నా...." అన్న సీత ప్రశ్న గతంలోకి జారకుండా ఆపి తిరిగి తోసింది అదే గతంలోకి..

"అన్నం తింటూ ఖబుర్లు చెప్పుకోండి— వడ్డనలు కూడా అయ్యాయి రండి— రండి—" అంటూ శాంతమ్మ ప్రవేశించి తొందర పెట్టింది....

"సరే..." అంటూ శాంతమ్మని చూసి నవ్వావు కుని పెరటి దిక్కుగా నడిచే శివరామయ్యగారు డాబా దిగి....

"కబుర్లు చెబుతానంటూ— అల్లా ఆలోచన లనీ— అన్నీన్నీ కలుపుకుని తింటూవేం.... ?"— చూసిచూసి ఇక ఆపుకోలేక ప్రశ్నించింది సీత పెరుగు అన్నాన్ని ప్రక్కలకు నెట్టి వ్రేళ్ళతో కంచంలో ఏదో రాస్తూ— చెరిపేస్తూ....

కూతురి ప్రశ్న నిని అమెని చూసి— అప్పటికే ఆలోచనల్లో పరుగెట్టే శాంతమ్మచూసి — పకపక నవ్వేసిన శివరామయ్యగారు— మొదలు పెట్టేసేరు....

"పెళ్ళిలో పెళ్ళి కొడుకుకూ— పెళ్ళికూతు రికీ ఒకే కంచంలో బోజనం పెడతారు కదూ ! అప్పుడు మీ అమ్మ ఏంచేసిందో తెలుసునా... నావెంగి లంటే అసహ్యంట ! ! అందుకని— తన వంతుని వేరే కలుపుకుని—" మధ్యలోనే కలియ బడిన శాంతమ్మ—

"—ఆఁ.... మహా తిననిచ్చేరు— ఎవరూ చూడకుండా అన్నం మొత్తం అంతా కలయ పిసికి...."— అంది కసిగా చూస్తూ....

"అప్పుడే ఆపావేం ? నే మిగిలింది పూర్తి చెయ్యాలా ? ?" అంటూ ఆమెని ప్రశ్నించి పూర్తి చేసేరు శివరామయ్యగారు.

"అప్పుడు మీ అమ్మకి కోపం వచ్చి తినడం మానేసి— తింటూన్నట్లు నటించడం మొద లెట్టింది.... ఇక నేను— ఆ విధంగా అన్నాన్నంతా కలియబెట్టి మీ అమ్మ కోపాన్ని చూసి పెరుగూ అన్నం కంచంలో— నీ విప్పుడు ఏదో వ్రాస్తు న్నావే ?— అల్లాగే పిచ్చి గీతలు గీస్తున్నట్లు నటిస్తూ 'నేను మనుగడుపులకి రాను సరికదా గొడవ చేసేస్తాను' అని వ్రాసి చూపించేను.." ముగిస్తూ— అందులో కూడా కూతురికి తన పోలికలు చూసికుని ఉత్తరా పోనన చేసేసే శివ రామయ్యగారు కంచం ముందు నుండి లేస్తూ—

"అన్నం తినవోయ్— కబుర్లు తింటావు—" వెక్కిరించేడు రాంబాబు....

అందరి నవ్వుల్లో సీత సిగ్గు దాక్కుంది...

* * *

కూతురి పెళ్ళి హడావిడిలో ఇటూ నటూ తిరుగాడుతూన్న శాంతమ్మ పదేపదే తన కాలం లోకి పరిగెడుతోంది....

ఆ కాలంలో బుక్కా జల్లింపులకి తనని చాకలి ఎత్తుకోవాలని తెలిసి ఏడ్పి రాగాలెట్టిందీ తను.... ఇప్పుడు— కూర్చునే జల్లించుకుంటున్నారు— ఎదిగిన పిల్లలని ఎత్తుకుని మొయ్యలేక ? కాకపోతే ఎదిగే పిల్లలకి చిన్నపిల్లలా ఆ ఆట బాగుండదనా ?

మొత్తానికి ఈ కాలంలో బుక్కా జల్లింపులు లేవు— అనుకుంది—

ఆమె ఆలోచనల పరధ్యానం చూసి— "కూతురి తలంబ్రాలు చూడవా ?"— హెచ్చరించిందో ముత్తైదువు !

ఆ దిక్కుగా పోయిన శాంతమ్మ— రాంబాబు దోసిళ్ళతో తలంబ్రాలు పోస్తుంటే తన కూతురు పళ్ళెం ఎత్తి వంచెయ్యడం చూసి అదాటుగా భర్తని వెతుక్కుంది నలుదిక్కులా !

అప్పటికే గతం తరుముకుని రాగా శాంతమ్మని చూస్తున్న శివరామయ్యగారు చికిలిగా నవ్వేరు వెక్కిరిస్తూన్నట్టు ! !

నీళ్ళ బిందెలో ఉంగరం— మట్టి వేసి ఇంటి పురోహితుడు రాంబాబును హెచ్చరించేడు "నీవు ఉంగరం తియ్యి" అంటూ ! నీళ్ళ బిందెలో ఒకే సారి చెయ్యి పెట్టినా అప్పటికే రెండింటినీ గుప్పెటలో ఇరికించుకున్న సీత చెయ్యిని ఒక్క గిల్లు గిల్లి బాధగా సీత "అమ్మో"— అని మంద్ర స్వరంలో అనుకున్నా లక్ష్యపెట్టక ఆ రెండింటినీ అంకించుకుని వేగంగా చెయ్యి పైకి తియ్య బోయాడు....

అతని చేతి నుండి విడిపించ యత్నించే సీత చెయ్యి కూడా వెను వెనుకే వచ్చింది....

అది చూసి అందరూ విరగబడి నవ్వేసరికి సిగ్గునే ఎరుగని సీత సిగ్గుల భరణిలో దాక్కుంది.

పందిరి గుంజకు ఆనుకుని చూస్తున్న శాంతమ్మ, శివరామయ్యగారు వెనుక నుండి పిలిచేసరికి వెంట వెళ్ళింది....

"శాంతీ— ఈ వేళ నీ బుగ్గ సుడుల్లో ఆ చిలిపి తనమేమిటే ?"—

అంటూ శివరామయ్య గారు ప్రశ్నించేసరికి— "మీ వెలికన్నుల్లో మాత్రం ఏ ముందో ?" అని తిరిగి ప్రశ్నించింది—

ఇద్దరి ప్రశ్నలూ ఒక దాని వెంట మరొకటి ఉండి ప్రవాహంలో ఎదురీదే పుల్లల్లా ఎదురేగి— ఓసారి వెనుదిరిగి చూసుకుని పునరావృత్తిలో పులకలు రెకెత్త పకపకా నవ్వుకున్నాయి నీటి తుప్పరలు చల్లగా వెద జల్లేలా—

"మీ సీతా కల్యాణం...." అనే శాంతమ్మకి "గతాన్ని ఓసారి ముందు నుండి తీసికెళ్ళింది" అంటూ జవాబిచ్చి ఆమె బుగ్గ మీద చిటికి వేసేడు. శివరామయ్యగారు—



# వసంతా బసవేశ్వర్ ల లలిత గానం

మార్చి 16 వ తారీఖునాడు ఆంధ్రపత్రిక కార్యాలయ ఆవరణలో ఆంధ్రపత్రిక అభ్యుదయ కళామండలి వాళ్ళు ఉగాది వేడుకలు చేసుకున్నారు. ఆ సాయంకాలం, ఆవరణమీది ఆకాశం; రెండూ, రంజుగా ఉండి, అయినవాళ్ళనీ, అతిథుల్నీ కూడా వల్లగాలితో పలకరించి ఇరవై ఆరేళ్ల బసవేశ్వర్ ఇరవై ఏళ్ల వసంత ల పాట(ల) కచేరీకి శుభం పలికాయి.

అనుకున్నవేళకి, అప్పలరాజుగారి ఆర్కెస్ట్రాతో సహా ఈ ఇద్దరు వర్ధమాన నేపథ్య గాయనీ గాయకులు వచ్చేసరికి, సభాసీను లందరూ అన్ని పాటలు వినే వెళ్దామనుకున్నట్లు అగుపించలేదు. కొందరు గడియారాలను సంప్రదించడం జరిగింది. కాని, ఈ ఇద్దరూ గొంతు సవరించుకుని పాట లందుకున్నాక, మరి మూడు గంటల సేపు ఎవ్వరూ గడియారాల సంగతి ఎత్తలేదు. వెళ్దామనుకున్నవాళ్లు వెళ్లనూలేదు.



చిత్రంలో వసంత, బసవేశ్వర్‌లతోపాటు, (ఎడమనుంచి కుడికి) వై. పి. జెడ్సన్ (తబలా) ఎస్. పి. సెల్వం (బాంగూస్, రిధిమ్స్), పి. రామ్మూర్తి (వయొలిన్) రాజు (ఫ్లూట్) అప్పలరాజు (హార్మోనియం) (కుడివేపు చివర) మండలి అధ్యక్షుడు పి. ధనకోటి ఉన్నారు.

ఇటీవల 'పూజాఫలం' సినిమాలో రాజేశ్వరరావుగారు బాణీ చేసిన 'బస్తీ దొరగారూ' 'హాస్య జంట' పాటను ఉషారుగా పాడిన ఈ బసవేశ్వర్, వసంత లిద్దరూ, కమ్మగా కొన్ని యుగళగీతాలు, కొన్ని రఫీ, లత, ఘంటసాల, జానకి పాటలతో పాటు, కొంచెం సొంత పాటలు కూడా పోటీపడ్డట్లు పాడి శ్రోతల కరతాళధ్వనులతో పాటు 'ఒహో', 'అహహ' "అదృష్టవంతులయ్యా", "మంచి కంఠ మున్నదయ్యా" ల వంటి ప్రశంసలను, పాడుతున్నప్పుడు, పాట కచ్చేరీ అయిపోయినప్పుడు కూడా బాగా దోచుకున్నారు.

"మధుబన్‌మే రాధికా నా చేరే" (రఫీ "కోహినూర్" అనుకుంటాను) పాటను అవలీలగా రఫీ ప్రియులు కూడా తలలూచేలాగ పాడిన బి. బసవేశ్వర్ స్వగ్రామం కాకినాడ లో రెండేళ్ళపాటు హిందూస్తానీ క్లాసికల్ 'గాత్రం,' (శ్రీ అద్దేపల్లి లక్ష్మినారాయణశాస్త్రి వద్ద) సాధన చేశాడని, ఆ తర్వాత తెలుసుకున్న చాలామందిమి, "గట్టివాడ" నుకున్నాము.

'నిర్దయే ప్రీతమ్' పాట పాడి, మా సరాగమాల రంగారావుగారి ప్రశంసలు దోచుకున్న వసంత ఈసారి కూడా ఆ పాటతోపాటు "మేరే మహబూబ్ తుఝే"—'పగలే వెన్నెలా', 'నీలి మేఘాలలో' పాటలు పాడి భేష్ అనిపించుకుంది. ముఖ్యంగా "తూక్యావ్ ఉస్ కస్ గజై" పాట పాడినప్పుడు ఈ వర్ధమాన నేపథ్య గాయని కంఠ మాధుర్యమంతా హాయిగా వీనుల విందుగా సాగుతూ (నాకు అరవం రాదు) "శ్రోత" అను ముగ్గుల్ని చేసింది. "ఆపాటే మరోసారి పాడితే ఎంతో బాగుణ్ను" అనిపించింది

బి. బసవేశ్వర్ పెళ్లి పందిళ్ళలో వినిపిస్తూ ఉండే 'సిపిటి క్యాట్,' "రావే చక్కాని చుక్కా" లాంటి కామిక్ పాటలు పాడటమే గాకండా, "మామకి తగ్గ అల్లుడు" లో శ్రీ ప్రకాశ్ (?) చేసిన "జీవితమంతా నవ్వుల్లో పువ్వుల్లో" పాట కూడా పాడాడని తెలిసినవాళ్లకీ, ఆ పాటను విన్నవాళ్ళకి, అదే బసవేశ్వర్ "జో వాదాకియాతో" "దిల్ తేరా దివానా" లాంటి రఫీ పాటలు అసలు కంఠానికి ఖ్యాతి చెడకండా అవలీలగా పాడుతూంటే విన్నవాళ్లకీ, కూడా ఈ యువకుని భవిష్యత్తు ఉజ్వలంగా అగుపిస్తుంది.

ఆరోజు వేడుకలకి అధ్యక్షత వహించిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదకుడు శ్రీ రాధాకృష్ణ గారు, ఈ వర్ధమాన గాయకులకు బహుమతు లందజేశారు. వీరి కంఠ మాధుర్యాన్నే గాక



కచ్చేరి వింటున్న ఆంధ్రపత్రిక జనరల్ మానేజర్ శ్రీ కుంచితపాదంగారు మున్నగు పెద్దలు అతిథులు.

# ఉగాది వేడుకలు

ఆర్కెస్ట్రాని కూడా మెచ్చుకున్నారు. జనరల్ మానేజర్ శ్రీకుంచితపాదంగారు "ఇంకా కాస్త ముందస్తుగా కచేరీ పెట్టుకోడానికి వీలుంటే కమ్మని ఈ కచేరీ మరి కాసేపు వినగల అవకాశం ఉండేదని," మెచ్చుకుని ఈ యిద్దరి భవిష్యత్తుకి ఆశీస్సు లందించగా దినపత్రిక యాక్టింగ్ ఎడిటర్ శ్రీ శ్రీదాములుగారు బసవేశ్వర్ "గుర్రపుడౌడు లాంటి లయబద్ధమైన కంఠం గలవాడని, వసంత "కోకిల గాత్ర" యని ప్రశంసించారు.

ఆంధ్రపత్రిక అభ్యుదయ కళామండలి చేసిన ఏర్పాట్లు—శ్రీ పి. ధనకోటి (అధ్యక్షుడు), శ్రీ వి. నారాయణస్వామి (ఉపాధ్యక్షుడు) శ్రీ రామచంద్రయ్య (కార్యదర్శి) వసంతకుమార్ (ఉపకార్యదర్శి) జ్ఞానశేఖరం (కోశాధికారి) —అతిథి మర్యాదా బాగున్నాయి. కాని ఇంత కమ్మని సాయంకాలం వేడుకలలో నాకు నచ్చనివి రెండు జరిగాయి. కళామండలి కార్యవర్గం ఎంత జాగర్తలు తీసుకున్నా, కమ్మని పాటలకి మధ్య మధ్య ఒకటి రెండు సార్లు లౌడ్ స్పీకర్ గరగర లాడటం—కనీసం ఒకసారి వూరుకోడం— "జనగణమణ" అయిన తర్వాత కొంచెంమంది చప్పట్లు కొట్టడం— ఈ రెండూ మినహా మిగతా వేడుకలు ఆనందంగా జరిగాయి.

కమ్మగా పాడగల యీ వసంతా— బసవేశ్వర్ లిద్దరికీ మరో 'ఉగాది'కి యిక్కడికి "రండర్రా" అంటే "బిజీగా ఉన్నా" మని చెప్పేటంత భవిష్యత్ నాశిస్తున్నాను. —వీరాజీ



"హంతకుడెవరు" చిత్రంలో ఒక దృశ్యం.

# అక్కినేనికి సన్మానం

15 వ పేజీ తరువాయి

శ్వరరావు గారిని సభికులకు పరిచయం చేయవలసిన అవసరం లేదని, వారి అమెరికా యాత్ర దిగ్విజయంగా జరగాలని ఆకాంక్షిస్తున్నామని అన్నారు.

అనంతరం కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ సి. వి. రామకృష్ణారావు ప్రసంగిస్తూ, శ్రీ నాగేశ్వరరావు అనన్య ప్రజ్ఞావంతులనీ, క్రమశిక్షణగల నటులనీ, తమ నటనతో అశేషాంధ్ర ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్న వారనీ తన నటనను తపస్సుగా భావిస్తూ వుంటారనీ, అందువల్లనే శ్రీ నాగేశ్వరరావు నటులుగా తారాపథాన్ని అందుకోగలిగారని అభిభాషించారు

ప్రఖ్యాతకవి డాక్టరు సి నారాయణరెడ్డి శ్రీ నాగేశ్వరరావు గారి గుణగణాలను వివరిస్తూ విద్యాభ్యాసం అంతగా లేకున్నా విద్యాధికారుల సరసన వారొక స్థిరమైన స్థానం సంపాదించ గలిగారని, తారాపథాన్ని అందుకున్న శ్రీ నాగేశ్వరరావు నిత్య జీవిత పోరాటంలో సతమత మవుతూ క్రమంగా చిత్రాలను సోపానములుగా చేసుకుని నభోమండలాన్ని అందుకున్నారని అన్నారు.

కళాశాల తెలుగు భాష శాఖాధ్యక్షులు శ్రీ ఎ. వి. రామయ్యగారు, కళాశాల విద్యార్థుల శ్రీ వెంకటరెడ్డి, శ్రీ లక్ష్మారెడ్డి కూడా ప్రసంగించారు.

శ్రీ నాగేశ్వరరావు గారు తమకు జరిగిన సన్మానానికి సమాధానం చెప్తూ, తాను నటుడుగా అనేక కష్ట నష్టాలను ఎదుర్కొంటూ తన నటనను, వృద్ధి పరచుకొంటున్నామని, తాము తారాపథంలో ఒక స్థానం సంపాదించుకొనడానికి కారణాలు నిరంతర కృషి, ప్రజల ఆదరాభిమానా"లని అన్నారు. "సినిమారంగం తమ దేవాలయమని, సినిమాయే తమ దేవుడని, స్వార్థం కోసం దేవుడికి లంచ మివ్వడం తగని పని" అని అన్నారు తమ అమెరికా పర్యటనన గూర్చి మాటాడుతూ వారు ఇంకా యిలా అన్నారు, "నా ఈ పర్యటన రెండు దేశాల మధ్య పరస్పర అవగాహనకు ఏ మాత్రం తోడ్పడినా తమ పర్యటనోద్దేశ్యం సఫలం కాగలదు" అక్కడ తాము ప్రసిద్ధ నటులను పరిచయం చేసుకుందామని, చిత్ర నిర్మాణ సౌలభ్యాలను, పరికరాలను పరిశీలించి అవి మనకు కూడా వినియోగపడగలవేమో తెలుసుకొనేందుకు యత్నిస్తామని అన్నారు.

శ్రీ నాగేశ్వరరావు రాకను పురస్కరించు అందుకు చిహ్నంగా నిర్మల్ చిత్తరువు ఒకదానిని కళాశాల పాలక వర్గాధ్యక్షుడు శ్రీ సాగరాల్ గుప్తా శ్రీ నాగేశ్వరరావు గారికి బహూకరించారు.

కళాశాల వైస్ ప్రిన్సిపాల్ శ్రీ చలపతిరావు వందన సమర్పణతో సభ ముగిసింది సభాప్రారంభంలో తేనీటి విందు జరిగింది

# స్వగ్రామంలో సత్కారం

శ్రీ నాగేశ్వరరావు అమెరికా వెడుతున్న సందర్భంలో వీరి స్వగ్రామమైన, రామాపురం, పరిసర గ్రామాలైన, వెంకట రాఘవపురం, తమ్మలపల్లి, వెన్ననపూడి, పెదివిరివాడ, కుదరవల్లి, అరిపిరాల, నందివాడ గ్రామ ప్రముఖులు ఘనంగా సన్మానించారు.

గ్రామ సరిహద్దుల నుంచి శ్రీ నాగేశ్వరరావును, వారి సతీమణి శ్రీమతి అన్నపూర్ణను, వాయిద్యముల తోను, బాణాసంచాలతోను ఊరేగిస్తూ సభా మండపం వద్దకు తీసుకువెళ్ళారు.

సన్మాన సభకు ఆంధ్రనాటక కళా పరిషత్తు ఉపాధ్యక్షులు శ్రీ కాజ వెంకట్రామయ్య అధ్యక్షత వహించారు.

శ్రీ నాగేశ్వరరావుకు చిన్న వయసు నుంచీవున్న కళాదృక్పథమునీ, కళాభిరుచినీ, పలువురు కొని యాడారు. శ్రీ అక్కినేని అమెరికా వెళ్ళటం యావదాంధ్రులకు గర్వకారణమని యీ పర్యటన తెలుగు సినిమారంగం మరింతగా అభివృద్ధి చెంద టానికి దోహదం చేయగలదని అన్నారు.

# మద్రాస్ సినీమా వార్తలు

## సెట్టుమీద: అరుణాచల ప్రొడక్షన్సు "స్త్రీ"

శంకర్ అటు ఇటు తిరుగుతుంటాడు. బాల కూర్చొని ఉంటుంది.

"నిజంగా నువ్వే విన్నావా ?"

"అబ్బే లేదు. ! వూరికే అబద్ధాలాడుతున్నా— అయినా నాకెందుకు వచ్చింది. ? ఎవరెల్లా పోతే నాకేం ? అవ్వ ! సంసారుల కొంపేనా ఇది ?"

"ఛీ! ఛీ! నోర్ముయ్ !"

"నోరు మూసుకొని పడి ఉండ బట్టేగా మీరిలా ఆడిపోస్తున్నారు "

"అబ్బబ్బ ! ఏమిటే నీ గోల— ఏం విన్నావ్ నువ్వు ? ఎప్పుడు విన్నావ్ ? ఎక్కడ విన్నావ్ ?"

"ఏం విన్నానా ? ఎక్కడ విన్నానా ?— మళ్లీ నా శాంత పసుపు కుంకుమతోవర్ధిల్లాలి— మా ఇంట్లో అందరూ ఈ పెళ్లికి ఆమోది స్తారు. ఆశీర్వదిస్తారు, అంటూ మా నాన్నగా రనడం— ఆమెకులకడం— అయ్యయ్యో !"

"బాలా !"

"ఏం ? గోడ చాటు వ్యవహారం నా కళ్లల్లో పడి పోయిందనా ?"

"ఏదో గోడచాటు వ్యవహారం ? మా అన్నయ్య సంగతి నీకేం తెలుసే— శాంతమ్మ అంటే ఎవ రను కుంటున్నావే ? వాళ్ల మీదా నీ అభాండాలు— వాళ్లనా నువ్వు అనుమానించేది ? ఛీ! ఛీ! నీ పాడుబుద్ధి పోనిచ్చుకున్నావు కాదు."

"అవును, నాది పాడు బుద్ధే. కాదు మరీ— పెద్దింట్లో వ్యవహారాలుగా— చూచినా కళ్ళు మూసుకోవాలి గాబోలు."

"అన్నయ్య అలా అనడం నువ్వు నిజంగా విన్నావా ?"

"నా కళ్ళారా చూచాను. చెవులారా విన్నాను. సరేనా ?"

"ఏమన్నాడు— అన్నయ్య— నా శాంత పసుపు కుంకుమతో వర్ధిల్లాలని కదు. ఆ— వూ— అంతే రైట్ "

"ఏమిటండి ?"

"ఉస్— నన్ను డిష్టర్బు చేయకు— చంద్ర బింబం— మూడు మూరలు— చాలా ఇంకలైన్ క్లియర్— అర్థమైపోయింది."

"ఏమిటర్థమైంది ?"

"ఈ పెళ్లికి ఇంట్లో అందరూ ఆనందిస్తా రన్నాడుగా అన్నయ్య."

"అవును."

"ఆమోదిస్తా రన్నాడుగా"

"అవును."

"ఆశీర్వదిస్తారన్నాడుగా"

"వూ !"

"రైట్— అర్థ మయింది. అన్నయ్య!"

"ఏమిటో చెప్పకుండా ఆ గొడ వేమిటి ?"

"బాలా— నా అనుమానం— అన్నయ్య లవ్ చేసిన పిల్ల శాంత ఎందుకు కాగూడదు.

"అంటే ?"

"పో! ఆడదానివి నీ కర్థంగాదులే !"

"హు! మహా వీరులు బయల్దేరారు."

"బాలా ! పొరపాటునైనా ఈ విషయం పెదిమిదాటి రానీయకు. తర్వాత చెబుతాగా."

"ఏమండీ— ఏమండీ"

"నో ప్లీజ్, వెరీ అర్జంట్ "

ఈ సన్నివేశం అరుణాచల ప్రొడక్షన్స్ వారి "స్త్రీ" చిత్రంలోనిది. ఈ సన్నివేశంలో పద్మ నాభం, గీతాంజలి పాల్గొన్నారు. వీరు గాక ఇంకా యన్. టి. రామారావు, రమణారెడ్డి, వై. వి. రాజు, దేవిక, రమాదేవి, మొదలగువారు నటిస్తున్నారు.

మాటలు : పినిసెట్టి, సంగీతం : టి. చలపతి రావు, ఛాయ : జె. సత్యన్నారాయణ మూర్తి, కథ - దర్శకత్వం : ఏ. కె. వేలన్.

## 'గొల్లభామ' షూటింగ్ ప్రారంభం

శేఖర్ ఫిలింస్ వారు నిర్మించబోయే జానపద చిత్రం "గొల్లభామ"కు ఫిబ్రవరి 17వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. శ్రీ వెంకటేశ్వరుని విగ్రహంతో, శ్లోకంతో రామారావుపై ప్రథమ చిత్రీకరణ జరిపారు. క్లాప్ సముద్రాల రాఘ వాచార్య కొట్టారు. ప్రారంభోత్సవానికి శ్రీయుతులు చక్రపాణి తాతినేని ప్రకాశరావు, డి. వి. ఎస్. రాజు, విఠలాచార్య మొదలగు వారు హాజ రయ్యారు. రామారావుగార్కి, ఈ చిత్రంలో పని చేసే సాంకేతిక వర్గానికి దర్శకుడు, నిర్మాత శ్రీ సోమశేఖర్ రావు పూల మాలలు వేశారు



"రాముడుభీముడు" లో రామారావు, విజయలక్ష్మి.

ఈ సెట్టులో రేలంగి, గిరిజలతో డ్యూయెట్ కామెడీ సాంగ్‌ను చిత్రీకరించారు.

ఈ చిత్రంలో ఇంకా సావిత్రి, ఇ.ల్ విజయలక్ష్మి, ముక్కామల, ప్రభాకరరెడ్డి, మిక్కిలినేని, బాలకృష్ణ, రాజబాబు, పుష్పవల్లి మొదలగువారు నటిస్తున్నారు.

రచన : సముద్రాల (జూనియర్), పాటలు : సి. నారాయణరెడ్డి, సంగీతం : టి. వి. రాజు, ఛాయ : రవి కాంతనిగాయిజ్, కళ : నాగేశ్వరరావు, నృత్యం : వెంపటి, కూర్పు: వీరప్ప, స్టూడియో : విజయా అండ్ వాహిని.

## బి. ఆర్. ఫిలింస్ "పీటలమీద పెళ్ళి"

బి. ఆర్. ఫిలింస్ బేనర్ క్రింద ఘంటసాల కృష్ణమూర్తి సమర్పించనున్న "పీటల మీద పెళ్లి" సాంఘిక చిత్రం పూర్తి అయింది. ఈ చిత్రంలో జగ్గయ్య, గుమ్మడి, చలం, రమణారెడ్డి కృష్ణకుమారి జానకి మొదలగువారు నటించారు.

రచయిత—బి. శివరామకృష్ణ, పాటలు—— సంగీతం—అశ్వద్ధామ, ఛాయ—ప్రకాష్, కళ—, ప్రసాదరావు, స్టూడియో—ఫిలిం సెంటర్, దర్శకుడు—ఘంటసాల కృష్ణమూర్తి.

## డి. బి. ఎన్. ప్రొడక్షన్సు "దొంగుడు మూతలు"

డీ. బి. యస్. ప్రొడక్షన్స్‌వారి "దొంగుడు

# సినిమా వార్తలు

మూతలు" చిత్రం 13రీళ్ళకుపైగా పూర్తి అయింది ఈ చిత్రంలో యన్. టి. రామారావు, బి. సరోజాదేవి, గుమ్మడి, పద్మనాభం, అల్లు రామలింగయ్య, సూర్యకాంతం, శారద మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు—ముళ్ళపూడి వెంకటరమణ, పాటలు—శ్రీశ్రీ, ఆరుద్ర; సంగీతం—కె. వి. మహదేవన్, ఛాయ— పి. ఎల్. రాయ్, దర్శకుడు—ఆదుర్తి సుబ్బారావు, నిర్మాతలు—డి. బి. నారాయణ అండ్ వారణాసి సుబ్రహ్మణ్యం.

## "శ్రీ సింహాచల క్షేత్ర మహిమ"

శ్రీ సరస్వతీ మూవీస్ అండ్ శ్రీ వెంకటేశ్వర్ ఫిలింస్ కంపెనీ ప్రయివేట్ లిమిటెడ్‌వారు నిర్మిస్తున్న "శ్రీ సింహాచల క్షేత్ర మహిమ" చిత్రంనకు పి. బి. శ్రీనివాస్ పాడిన—

"జయహే మోహన రూపా" జయహే॥
గానకలాపా—అది స్వరూపా"....... ॥

అనే పాటను నారద పాత్రధారి చలంతో చిత్రీకరించారు.

ఇంద్రునిచుట్టూ మంటలు అల్లుకొని ఉంటాయి. తప్పించుకు పోవడానికి వీలుండదు. ముల్లోకాలు తిరిగే నారదుడు అదే మార్గాన పోతుంటాడు.

"నారదా! నారదా! నాకేదైనా ఉపాయం చెప్పి రక్షించు!"

"లోక సంచారానికే నాకు వ్యవధి చాలకుండా ఉంటే నీకు ఉపాయం చెప్పడానికి నాకు తీరికెక్కడుంది"

"మునీంద్రా! చేసిన తప్పు ఒప్పుకుంటున్నా! వేధించడం న్యాయమా! దయజూపి దారి చూపించు"

"దారి కేముంది. వెళ్ళివరహా నరసింహునే వేడుకో"

"దేవదేవా! అజ్ఞానంతో నీ భక్తులైన శిరీష పురూరవులకు నేనెంతో అన్యాయం చేశాను. క్షమించి నన్ను రక్షించు స్వామీ!"

"అమరేంద్రా! నీ పగ ఇప్పటికైనా చల్లారిందా!"

"పగేకాదు—నా అహంకారానికి సరైన పరాభవం కూడా జరిగింది."

ఈ సన్నివేశం కూడా "శ్రీ సింహాచల క్షేత్ర మహిమ" చిత్రంలోనిదే. ఈ చిత్రంలో కాంతారావు రేలంగి, చలం, నాగయ్య, రాజనాల, రాజబాబు, నల్ల రామమూర్తి, కృష్ణకుమారి, యల్. విజయలక్ష్మి, గిరిజ, సూర్యకాంతం, గీతాంజలి మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు, పాటలు: రాజశ్రీ, సంగీతం: టి. వి. రాజు, ఛాయ: ఆర్. మధు, నృత్యం చిన్ని సంపత్, కళ : బి. ఎన్. కృష్ణ, కూర్పు : మార్తాండ్, కథ, దర్శకత్వం. బి. వి. ప్రసాద్.



"హంతకుడెవరు" లో బి. సరోజాదేవి.

## పద్మిని పిక్చర్సు "కర్ణ"

పద్మిని పిక్చరు వారు నిర్మించిన పూర్తి కలర్ చిత్రం " కర్ణ " త్వరలో విడుదల కానున్నది. ఈ చిత్రంలో యన్. టి. రామారావు శ్రీ కృష్ణుడుగా నటించేరు. యింకా సావిత్రి, దేవిక, యం. వి. రాజమ్మ, జయంతి, శివాజీ గణేషన్, ప్రభాకరరెడ్డి మొదలగువారు నటించారు. మాటలు : డి. వి. నరస రాజు., పాటలు : సి. నారాయణరెడ్డి., సంగీతం : విశ్వనాథం—రామమూర్తి, స్పెషల్ ట్రిక్‌వర్క్: రవికాంత్ నిగాయిజ్., దర్శకత్వం : బి. ఆర్. పంతులు.

## వీనస్ అండ్ అశోక్‌వారి "సుమంగళి"

వీనస్ అండ్ అశోక్ మూవీస్ వారు తమిళంలో హిట్ అయిన చిత్రం " శారద "ను ఆధారంగా " సుమంగళి " చిత్రాన్ని నిర్మిస్తున్నారు, ఈ చిత్రంలో నాగేశ్వరరావు, సావిత్రి., జగ్గయ్య, యస్. వి. రంగారావు., జి. వరలక్ష్మి, రేలంగి, గిరిజ, వాసంతి, మరియు నూతన నటి పద్మ మొదలగువారు నటిస్తున్నారు.

సంగీతం : కె. వి. మహదేవన్., మాటలు : పాటలు : ఆత్రేయ., ఛాయ : పి. యల్. రాయ్., కళ : జి. వి. సుబ్బారావు., కూర్పు : కృష్ణ., దర్శకత్వం : ఆదుర్తి సుబ్బారావు., నిర్మాత : టి. గోవింద రాజన్., అసోసియేట్ ప్రొడ్యూసర్ : టి. వి. ఎస్. శాస్త్రి.

ఇంతవరకు మూడురీళ్ళ చిత్రం పూర్తి అయింది. నాగేశ్వరరావుగారు అమెరికా పర్యటననుండి వచ్చిన తర్వాత యీ చిత్రాన్ని పూర్తి చేస్తారు.

## "దేశమంటే మనుషులోయ్"

సుగంధి పిక్చర్సు వారు " దేశమంటే మనుషులోయ్ " అనే సాంఘిక చిత్రాన్ని నిర్మించనున్నట్లు తెలుస్తుంది. ఈ చిత్రంలో రమణమూర్తి, చలం, ముక్కామల., ఉషాకుమారి మొదలగువారు నటీనటులు. కథ : ప్రఖ్య శ్రీరామమూర్తి, మాటలు : పాలగుమ్మి. పద్మరాజు, సంగీతం : పెండ్యాల, దర్శకత్వం : సి. యస్. రావు.

## డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ "మంగమ్మ శపథం"

డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారు "మంగమ్మ–శపథం" చిత్రంను త్వరలో నిర్మించనున్నారు. ఈ చిత్రంలో యన్. టి. రామారావు, గుమ్మడి మొదలగువారు నటిస్తారు. కథ : మాటలు : సముద్రాల (జూనియర్), ఛాయ : రవికాంత్ నిగాంయిజ్, దర్శకత్వం బి. విఠలాచార్య.

## విశాల నేత్రాలు

బాబూ మూవీస్ వారు అక్కినేనితో నిర్మింపనున్న 'విశాల నేత్రాలు' చిత్రాన్ని పూర్తిగా ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించడానికి నిర్ణయించినారు. ఈ చిత్రానికి సంబంధించిన వాస్తవిక దృశ్యాల కొరకు దక్షిణ భారతంలో ప్రసిద్ధికెక్కిన శ్రీరంగం మొదలగు అన్ని ప్రదేశాలలోను షూటింగు చేస్తారు. చిత్రానికి దర్శకుడు: ఆదుర్తి సుబ్బారావు, నిర్మాత : సి. సుందరం, సంగీతం : కె. వి. మహదేవన్, కథ : శ్రీ పిలకా గణపతి శాస్త్రిగారు, రచన : ముళ్ళపూడి వెంకటరమణ. ★



"కలవారి కోడలు" లో కృష్ణకుమారి, రామారావు.

చిత్రసమీక్ష:

## సాధారణమైన చిత్రం "కలవారి కోడలు"

అందరికీ తెలిసిన కథ, ఎప్పుడూ చూచే ప్రేమ సన్నివేశాలు, మొరటుహాస్యం, యిలాంటివే మరి కొన్ని కలిపి " సెల్యులాయిడ్ "కు ఎక్కించగా మిగిలిన చిత్రమే " కలవారి కోడలు. "

ఇద్దరు మిత్రులు.... ఒకరు వీణావాయిద్యంలో సిద్ధహస్తులు. రెండవవాడు .... ఆనంద్ ...... 'మెడిసన్'ల్లో శిక్షణ పొందుతుంటాడు. వారిద్దరు ప్రాణమిత్రులు. ఒకరిని విడిచి, ఒకరు వుండలేనంత సన్నిహితులవుతారు.

సోదరి లత, మిత్రుడు ఆనంద్‌ల ప్రోత్సాహం మీద మైసూరు వీణావాయిద్యపు పోటీలకు వెళ్లిన, ఆయన అక్కడే మరణిస్తాడు. ఈ సంఘటన లతను, ఆనంద్‌నూ ఎంతగానో కలవరపరుస్తుంది.

సెలవుల్లో ఆనంద్, లతతోపాటు తన వూరు వెడతాడు. లత మంచితనాన్నిచూసి అతని తల్లి మురిసిపోతుంది.

ఆనంద్‌కు యుక్తవయస్సు వచ్చింది గనుక, దగ్గర సంబంధాన్నే అతని తల్లి ఖాయం చేస్తుంది. ఆ విషయం ఆనంద్‌కు పూర్తిగా తెలియదు.

ఇది ఇలా వుండగా, లత ఆనంద్‌లు ప్రేమించుకుంటారు. పెళ్లి చేసుకోవాలన్న భావన కూడా వారిలో కలుగకపోదు.

పొరుగూరు నుంచి రావలసిన లత సమయానికి రాకపోవటం, రైలుప్రమాదం జరగటం, ఆ ప్రమాదంలోనే ఆమె మరణించిందన్న గాలివార్త వినటం.. ఆనంద్‌ను కుమిల్చివేస్తాయి.

లత ఎలాగూ మరణించింది గనుక, గత్యంతరం లేక, తల్లి కోరిక నెరవేర్చి ఆమెనయినా తృప్తిపరుద్దామని, ఆనంద్ వివాహానికి ఒప్పుకుంటాడు.

కాని కొంతకాలానికి లతను వింత పరిస్థితుల్లో కలుసుకోవడం, అతనిలో మళ్ళీ కొత్త సమస్యను రేకెత్తిస్తుంది.

లతతో సన్నిహితంగా వుంటం ఆనంద్ భార్యకు మనస్కరించదు. ఆమెలో లేనిపోని అనుమానాలు కలుగుతాయి. లతకు విషమిచ్చి చంపాలన్న ఆమె పన్నాగం తలక్రిందులయి, చివరకు తన మరణానికే దారి తీస్తుంది. లత, ఆనంద్‌ల పరిణయంతో కథ సుఖాంతమవుతుంది.

ఇది ప్రధానమైన కథ. దీనికితోడు " ఉప కథలు " కూడా కొన్ని వున్నాయి. అవి కేవలం హాస్యం కోసం ఉద్దేశింపబడినవే.

కథలో పట్టులేదు. ఇది మామూలు కథ. ప్రతి సినిమాలో కనుపించే కృత్రిమ ప్రేమ సన్నివేశాలు, అనుమానాలు, అపార్థాలు యీ చిత్రంలోనూ వున్నాయి.

గుర్తుంచుకో దగినంత మంచి పాటలు లేకపోయినా, అవి చెప్పదగినంత కర్ణకఠోరంగా మాత్రం లేవు. సంభాషణలలో కొత్తదనం లేదు.

ఆనంద్‌గా రామారావు నటించారు .....

కృష్ణకుమారి చక్కగా నటించింది. గిరిజకు తగిన పాత్ర లభించలేదు.

హాస్యం ప్రదర్శిద్దామనుకొన్న రమణారెడ్డి, సూర్యకాంతం, చలం, పద్మనాభం, గారలు తమ లక్ష్యాన్ని నెరవేర్చుకోవటంలో ఎంతవరకు, కృతకృత్యులయ్యారో ప్రేక్షకులే నిర్ణయించాలి. ఉన్నంతలో రమణారెడ్డి, సూర్యకాంతం ఫరవాలేదు. చలం నటన ఒక మాదిరిగా వుంది.

దర్శక, నిర్మాత శ్రీ హేమాంబరధరరావుగారి ఉత్సాహము, చురుకుదనం సద్వినియోగం కాలేదేమోననిపిస్తోంది. ఏమైనా వారిలో దర్శకత్వపు ప్రతిభకంటే, ఉత్తమచిత్రాన్ని తీయాలనే కాంక్ష మాత్రం ఎక్కువగానే వుంది. కనీసం ముందు ముందైనా ఆయన తన ఆశయాన్ని అందుకోగలరని ఆశిస్తాను.

వాశిరాజు ప్రకాశం ★

# సరాగమాల

14వ పేజీ తరువాయి

దేశంగా నవ్వడం ఆడిన వారికి, చూసిన వారికీ ఊహలోకి కూడా రాదు.

ఇక ఆడాన్సు గురించి. చేసింది ముగ్గురమ్మాయిలు. ఒకమ్మాయి జాకెట్టూ పరికిణీ కట్టుకొని చేసేంత చిన్న వయసుది. అలానే కట్టుకుని చేసింది. ముఖంలో ఒక్క భావం కనబడలేదు. "కనరారా చేకొనరారా" అని ఇంద్రభోగాలు ఊరించినపుడు, "తరలి రావా" అని శంకరుని ప్రార్థించినపుడూ ఆమె ముఖం ఒకే విధంగా, ఒక మాదిరి వెర్రి మందహాసం నిండి ఉన్నవి.

ఇక రెండవ అమ్మాయి అంతకన్నా మరో అయిదేళ్ళ పెద్దదై ఉంటుంది. కొంత కొంత, నాటికి పది వంతులు, అప్పుడప్పుడు పాటకొంచూరు, భావాన్ని చూపింది. ఇక మూడవ అమ్మాయి స్టేజిపై చూస్తుంటే ఆరడుగుల మనిషిలా కనిపించింది. సన్నం మూలాన. కాని లయిదున్నరకు బాగా తక్కువే ఉంటుందనుకుంటాను. ఈ ముగ్గురిలో ఈమె పంతం కాస్త నయం. చాలా నట్టుకు హిందీ పాటలు పాడింది. తల చాలా కొత్త ఫేషనులో దువ్వ

సాన్ని గాని ప్రదర్శించలేదు. ప్రదర్శించాలనుకున్నా వారి చేతయి ఉండదని నా అభిప్రాయం. మంచి భావం వ్యక్తం చేయగలిగే శక్తి ఉంటేనే గదా చెడు భావం చూపగలిగేది!

ఇక వచ్చిన వారి గురించి. ఒకరు ఇద్దరు, మహా ఉంటే నలుగురు తాగి వచ్చి ఉంటారు. కాని వీళ్ళెవరూ కిక్కురుమని మాట్లాడలేదు. బుద్ధిమంతుల లాగా నెర్రిగా, వెకిలిగా నవ్వుతూ కూర్చున్నారు. ఒకసారి మాత్రం ఎవరు, తాగనివాడే, ఒక అమ్మాయి

కొన్నాననుకొంటూ స్టేజి పైకి వచ్చింది. తల్లో మల్లె, మొగ్గలు మాకీ గతి పట్టిందే అని వెకిలిగా నవ్వినప్పుడు జాలి వేసింది.

ఈ ముగ్గురిలో ఒకరు కూడ అశ్లీలంగా లరం చేసుకునే లభినయాని కాని, అంగ విన్యా

డాన్సు చేస్తుంటే "సిహోయ్" అన్నాడు. ఆ అమ్మాయి వెక్కిరించింది. కొంత గోల, చాల చిన్న తరహాలో, జరిగింది. ఇది కూడా ఆడా మగా కలిసి చదువుకునే స్కూళ్ళలో ఒక ఆడపిల్లను ఒక మగాడు క్లాసులో టీచర్ రాక ముందు వెక్కిరిస్తే ఎలా జరుగుతుందో అలానే ఉంది. మరొక గుణం ఆపాదించటం అన్యాయం. చివరి అలా అంచిన కుర్రవాణ్ణి వస్తాదులా ఉన్న తబలా అతను చూడగానే ఎవి ఎండకు కరగిపోయే ఐస్ క్రూట్‌లా అయి పోయాడు. ఆగని నృత్యం మొదటిలా కొనసాగి పోయింది.

అంతటికీ నాకు నచ్చింది, తబలా వాద్యగాళ్ళ ప్రతిభ. చేతులు తబలాలు చిట్లిపోయేంత గట్టిగా వాయించారు. కాని కరకాల నడకలు చూపించారు. అంతేకాదు నాట్యంలో కొంతయినా ఉత్సాహం మిగిలినదంటే అది తబలావాని నైపుణ్యం వలనే. వాయించే కాక మధ్య మధ్య హాస్యోక్తులు కూడ విసరడం. "స్త్రై తస్సలరవల" అనే బదులు ఒక బోడిగుండోడిని చూసి "హై తిరుపతి గుండు" అన్నాడు. జనం గొల్లుమన్నారు. అంతకు ముందు వాయించినతను "బంగారు బొమ్మ" పాటకు మధ్య మంత్రాలు లయబద్ధంగా చెప్పాడు. కాని అదెవరూ గనిపించు కున్నట్లు లేదు.

ఇంత నిరీపంగా ఉన్న దాంట్లో ఆకర్షణ ఏమిటా అని ఆలోచిస్తే ఒకటి తోస్తుంది. చేసేవాళ్ళు ఒక విధమైన నిర్లక్ష్యంతో చేస్తారు. ఆ నిర్లక్ష్యాన్ని తమ మగతనానికి సవాలుగా కొంత మంది అనువదించు కుంటారనుకుంటాను. ఆ సవాలే వారికి ఊరు పిచ్చుకల లేహ్యంగా పని చేస్తుండవచ్చు. అంతా చూసిన తరువాత ఆత్రేయ మనసులో మెదిలారు.

"కాగితాల పువ్వులు
కాసులకీ నవ్వులు
ఈ బాధ లీగాథ ఇంతేనురా"

* * *

చాల మంది పాఠకులు "మల్లీశ్వరి" సంగీతానికీ "మూగ మనసులు" సంగీతాన్ని నేను సరి పోల్చానని భ్రమపడినట్లున్నారు. నిసలైన శాస్త్రీయ సంగీతానికి పక్కా జానపద సంగీత ధోరణికి నేనెలా పోలిక చూపించానుకున్నారో నా కర్థం కావటంలేదు. నేను ఆ వారం వ్రాసిన దానికిదీ అర్థమని సావకాశంగా చదివితే తెలుస్తుంది. "మల్లీశ్వరి"లో ప్రతి పాటా కథనంలో ఒక అంతర్భాగమై కథను ముందుకు నడిపించింది. అదే విధంగా "మూగ మనసుల్లో" కూడా పాటలు కథా గమనంలో ఒక భాగమై ఉన్నాయి. ఈ చిత్రాల సంగీతానికి ఇదే పోలిక.

శ్రీయుతులు దేవులపల్లి, రాజేశ్వరరావు, బి. ఎన్. రెడ్డి శ్రీమతి భానుమతి ఆనాడు కలసిచేసిన కృషికి ఫలం "మల్లీశ్వరి" సంగీతం. ఆంధ్రుల పూజాఫలమది. ప్రతి చిత్రంలోను అంతటి ఫలం ఉండాలంటే అవుతుందా ?

* * *

ఆంధ్రా వెటర్నరీ కాలేజి హాస్టల్లో లిటరరీ అసోసియేషన్ అంటూ ఒక సాహితీ శాఖ ఒకటి ఉన్నది. 1963వ సంవత్సరాన విడుదలైన చిత్రాలన్నిటిలో పాటలను దృష్టిలో ఉంచుకొని, వాటిలో ఒక పాటను ఉత్తమమైనదిగా నిర్ణయించ



"సువర్ణ గోపూజా మహిమ" లో శాంతి.

తింధి పై శాఖ కార్య నిర్వాహక వర్గం. ఆ పాట పి. ఎ. పి. వారి "పునర్జన్మ"లో "అందగాడా" అన్నది. దాశరథి రచన. సుశీల పాడినది. చలపతి రావు వరస.

ఈ నిర్ణయం చేసేముందు చాల పాటలను తులనాత్మకమైన పరీక్షకు గురి చేశామనీ, కేవలం సాహిత్య పరంగా "అందగాడా" ఉత్తమోత్తమ మయినదనుకున్నామని ఆ శాఖాధ్యక్షులైన కె. కె. మోహన్ (ఏలూరు) తెలిపారు. ఈ నిర్ణయాలలో పాటకున్న సంగీతపు విలువలు, సన్నివేశ బలం అవస రానికి రావని కేవలం సాహిత్య దృష్టితోనే పరిశీ లిస్తామని కూడా అన్నారు.

ఈ పాట రచయిత అయిన దాశరథి గారికి జ్ఞాపకార్థంగా ఒక చిన్న విగ్రహము, ఆ చిత్రంలో ఆపాట అంత అందంగా ఉండటానికి కారకులైన నిర్మాత ఎ. వి. సుబ్బారావు, దర్శకుడు, కె. ప్రత్య గాత్మ, సంగీత దర్శకుడు టి. చలపతిరావు, గాయని సుశీల ప్రభృతులకు తమ శుభాకాంక్ష లను, తెల్పుతూ పై సాహిత్య శాఖ వారు ఉత్తరాలు అందజేశారు.

ఎంతవరకూ తారలు, దర్శకులు, కథకులూ అనే ఈ రోజుల్లో సంగీత దర్శకులనూ, పాటల రచయితలనూ ప్రేక్షకులు దృష్టిలో పెట్టు కోవడం సంతసించ దగ్గది. అందులో ఒక కళా శాల విద్యార్థుల సమూహం ఒక పాటల రచయి తను ఇలా గౌరవించ దలచినదీ అంటే అది మరింత ముదావహం. ఈ నాడు తారలకూ, దర్శకు లకు ఇస్తున్న ప్రాముఖ్యత సంగీత దర్శకులకూ, పాటల రచయితలకు ఇచ్చే దినం వచ్చిన నాడు పరాగమాలకు సుదినం. సంగీత ప్రియులకు సంతోష వర్షం. సంగీత కళా స్రష్టలకు సామ్రా జ్యాభిషేకం.

* * *

శ్రీ తిరుపతమ్మ కథ జి. ఇ. 35411

"కౌగిలి కైలాసము, రావోయి నాకోసము"

నవీన పంథాలో జావళీ రూపులో దాశరథి రచన. చక్కని, పైపెక్కని శృంగారానికి రూపాంతరం. మనసు వాకిటిలో మల్లెలు పరచిన వేళ, ప్రియుని ఎదపై మేనుమరచిన వేళ. కలలూ కలలూ ఇలలో కలసిన వేళ వినవలసిన జావళి. రాగం కల్యాణి. రాగ రంజితులకు, అనురాగ రంజితులకు అభిమా దాయిని అయిన పామర్తి సంగీతం చివరిదాకా కర్ణాటక సువాసనలతో కుసుమించి చివరన చివా లున పాశ్చాత్యరాహిక పద్ధతికి గుభేలున దిగుతుంది. కారణం అనూహ్యం. ఆ సంగతులు చిట్ట చివర లేకపోతే మరీ నిండుగా ఉండేది. ఇప్పటికి బాగానే ఉంది. దీనికి కారణం సోలమన్టుకు హుందాగా పాడిన లీలనే చెప్పవచ్చును. లీల పాడిన శాస్త్రీయ గీతాలకు తక్కిన వారు పాడిన వాటికీ ఇదీ తేడా. లీల పాడితే తను నేర్పగల్గి పాడినట్లు ఉంటుంది. తక్కిన వారు పాడితే నేర్చుకొని పాడినట్లు ఉంటుంది.

రెండవ ప్రక్క "శ్రీ వేంకటేశా" అను కీర్తన గీతం. లీల పాడినదే. బొల్లిముంత శివరామ కృష్ణయ్య రచన. అది అంతస్సుకు తగిన మాటలు పొదిపి ఉన్నది. బి. శంకర్రావు అమర్చిన వరస యేదో అపూర్వ రాగ మిళితమై ఉన్నది.



ఈ ముగ్గురూ ఫ్రెంచిఫాషన్ మోడల్ అమ్మాయిలే, మధ్యనున్న మోడల్ పేరు మేగిరోగ్.

గుడి గంటలు జి. ఇ 35432

"నాలోన నిన్నే నిలిపేను నేడే,
ఏ శిల్పికల్పనవే ఏకవిభావనవే"

సినిమాలో ఈ నాడు ప్రతి పాట ముందు దృశ్యానికో వెనకటి సన్నివేశానికో జరుగుతున్న సంఘటనకో విడకుండా ముడివేయబడి ఉండటం, ఈ కారణం వలన రచనలో అందం తగ్గి కేవలం అర్థానికే ప్రాముఖ్యత యెక్కువ కావటం తరచు కానవస్తున్నది. ఈ చిక్కు ముళ్లు లేని నాడు పాటలు విడిగా విన్నా, కథ ముందు వెనక తెలియక పోయినా, ఆనందించటానికి అందు బాటులో ఉండేది. ఈనాటి పాటలలో కొన్ని సినిమా చూస్తే గాని పూర్వాపరాలు అర్థంకావు (ఉదాహరణకు "వారసత్వం"లోని "మనగుట్టే".) అటూ ఇటూ ముడులు లేకుండా కేవలం ఒక భావగీతంలా సహజ సౌందర్యంతో అలరారుతూ



"కర్ణ" చిత్రంలో దేవిక

శ్రోతను అలరిస్తున్న పాట "గుడి గంటలు" చిత్రంలో దాశరథి రచన గాజు పూసల్లో మణి అని చెప్పుకోవచ్చు. ఆ చిత్రంలో మరే పాటకు ఈ పాటకున్న విలువలేదు. సంగీత సాహిత్యాల పరంగా, ఘంటసాల కూర్చిన బాణీ, పాడినతీరూ రెండూ వసంతం, వెన్నెలలా కలసి వచ్చాయి.

నార్ల చిరంజీవి రచన "నీ కనుదోయిని నిద్దురన్నై" అన్నది రెండవ ప్రక్కనున్న లాలిపాట. నిజానికి సినిమాలో జాలి పాట. ఆదరించని హృదయాన్ని ప్రేమించే వారి వ్యథను లీలగా తెలిపే పాట. జానకి మందారాల సుగంధంతో, మందానిలముల చల్లదనంతో, మరపురాని తీయదనంతో పాడిన పాట.

మూగవ నసులు జి ఇ 35422

పై చిత్రంలో అత్యధిక ప్రజాదరణ పొందినవని రికార్డుల అమ్మకం ద్వారా తెలుస్తున్నది రెండు పాటలు. 'గౌరమ్మా నీ మొగుడెవరమ్మా''. ప్రథమ స్థానాన్ని ఆక్రమించింది. రెండవ స్థానం.

"గోదారి గట్టుంది గట్టుమ్మైనా చెట్టుంది
చెట్టుమీదను పిట్టుంది, పిట్ట మనసులో
యేముంది"

# సరాగమాల

ఇదీ దాశరథి రచనే. వ్యర్థమ్మైన ఒక మాట లేకుండా, అర్థంకాని ఒక పలుకు లేకుండా, సులభంగా జరిగే నడక, సుకరంగా సాగే రచన. ఇందులో చెప్పుకోదగ్గ విశిష్టత గలది కె వి. మహాదేవన్ అమరించిన వాద్య గోష్టి. ఈ గోష్టిని వాద్యాలతోనే వినిపించాడో లేక గట్టుమీద పూలచుట్టూ ఝుమ్మనే తుమ్మెదల రొదనూ, ఈత చెట్ల మధ్య నుంచి ఝుంయి మనే గాలి సొదను, లేమావి ఆకుల నుంచి కోయనే కోయిల పిలుపునూ చిటారి కొమ్మనుంచి చిలుకమ్మ ఒలకబోసే వలపునూ దొంగలించి సంగీతంగా మలిచి పెట్టాడో ఆ మహాదేవుడు ? వాద్య గోష్టియే ఇంత అపూర్వంగా ఉంటే ఇక పాడటమెలా ఉందో. పాడినది సుశీల కాదు కోమలస్వనలీల. సుగాత్ర సురభిళహేల. వసంత సుమబాల.

రెండవ ప్రక్క ఆత్రేయ రచన. "మానూ మాకును కాను'' పాటలాగా ఉండదు. మనసిచ్చిన వాడితో నచ్చిన విధాన నా మనసందుకో అని నచ్చజెప్పిన పద్ధతిని ఉంటుంది. పాడినది సుశీల. విషాద రాగమే వరసలోనూ, వాద్యనుసరణలో ధ్వనిస్తున్నది.

అమరశిల్పి జక్కన్న జి. ఇ. 35386

"అందాల బొమ్మతో ఆటాడవా, ప
సందైన ఈ రేయి నీ దోయి స్వామీ"

దశరథి లేఖిని నుంచి వెలువడిన శృంగార వీచిక ఇది. ఎస్. రాజేశ్వరరావు వూహాలల్లిన మనుజ్ఞ సంగీత డోలిక ఇది. సుశీల స్వర సుగంధంతో పరిమళిస్తున్న మోహన రాగమాలిక ఇది. జావళులంటే యెంత అందంగా ఉండాలో నలుగురికీ తెలిపే నవ వసంత సుమకేళిక ఇది. రసిక హృదయాన్ని పలుకరించే శారిక ఇది. విరహాతప్తమ్మైన మనసులో కుసుమించిన కోరిక ఇది. ప్రేమ పిపాసుల అంతర్యాలను స్వాధీనం చేసుకొని అమృతం పంచి పెట్టడానికి వస్తున్న జ్యోత్స్నాభిసారిక ఇది.

రెండవ ప్రక్క సీనియర్ సముద్రాల కలం జానపద పథంలో సాగిన జానుతెనుగు రచన మాధవపెద్ది బృందం పాడిన గీతం. పల్లెవాటు సంగీతమే. ★

# సుశీల గ్రహించిన సత్యం-21 - దేవిక















Edited, Printed and Published by S Radhakrishna at the AndhraPatrika Press, 6 &7 Thambuchetty Street Madras 1. Phone 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.



'దేశద్రోహులు' లో జానకి

